# మ నో ర మ

శ్రీ పాంచకడి దేవ

వి ర చి త ము

కవిరాజహంస, కవికులాలంకార

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు

వంగభాషనుండి తెలిఁగించినది.

*

ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్

కాకినాడ

# ప్రథమ భాగము

౧

దేవేంద్రబాబు మందిరమున నతిమనోహరంబును, సమాల్యాలంకారవిశోభితంబును, వినిర్మలంబును, మనోజ్ఞవస్తునిస్తులంబును నగు శయనమందిరమునం దాతని ప్రాణేశ్వరియగు రేవతియును, రవసెల్లా మేలిముసుఁగున వదనమండలముఁ గప్పుకొనియున్న మఱియొక సుందరీమణియును గూర్చుండియుండిరి.

ఆ కామినీమణు లిరువురును గొంతసేపటి వఱకును మౌనమును వహించి యొకరిమొగము నొకరు చూచుకొనుచుఁ జిత్రప్రతిమలవలె నుండిరి. అట్లు చాలసేపైన తరువాత మేలిముసుఁగు వైచుకొనియున్న తరుణీమణి మృదుమధుర స్వరంబున "వారెప్పుడు వచ్చెదరు?" అని యడిగెను.

రేవతి: ఇప్పుడే వచ్చెదరు. స్నేహితుని యింటికిఁబోయి యాతఁని జూచి యేమేమో మాటలాడవలసిన పనిమీఁదఁ బోయి యుండిరి.

స్త్రీ: "ఆలాగా?" అని రసాలపల్లవసన్నిభం బగు నరుణాధరము కంపించునట్లు నిట్టూర్పు విడిచెను.

రేవతి: వారివలన నంత యావశ్యకముగఁ గావలసినపని యేదైన నున్నదా? వారితో నీ కేమి పని?

స్త్రీ: మహావిపత్సముద్రమున మునిఁగి దరిజేరు నుపాయ మెఱుంగక కొట్టుకొనుచున్నదానను. అబలను రక్షించువా రొరు లెవ్వరును లేరు. ఆతనికంటె నాకు దిక్కేమియును లేదు.

రేవతి: మంచిది. వా రిప్పుడే వచ్చెదరు. నాయొద్ద సిగ్గెందులకు? ఇంతటి యెండవేళ నిట్టి పరితాపసమయమునఁ గూడ నీ మొుగ

ముపై బట్టమగు మేలిముసుఁగు నెందులకు వైచుకొందువు? ఆఁడువా రాఁడువారియొద్దనే యింత సిగ్గుపడుట వింతగానున్నది.

"అమ్మా! క్షమింపవలయును" అని చెప్పి యాకాంత యూరకుండెను.

ఈ సమయముననే వెలుపలనుండి యెవ్వరో వచ్చు చున్నట్లుగా నడుగులచప్పుడు విననయ్యెను.

రేవతి : "వారు వచ్చుచున్నారు" అని యొక ప్రక్కకు బోయి నిలువఁబడియెను.

తనమగఁడు సింహద్వార సోపానముల నెక్కి లోపలఁ బ్రవే శించునంతలో రేవతి యాతని యెదుటకుంబోయి నిలువఁబడి "ఈ దినము మీ దర్శనమునకొక తరుణీమణి వచ్చియున్నది. ఆమెకు మీవలన నేదియో యావశ్యక కార్యము కావలసి యున్నదఁట!" అని చెప్పెను.

దేవేంద్రుఁడు బొమలు ముడివైచి "నిజమే? ఆమె యెక్కడ నున్నది?" అని యడిగెను.

రేవతి : లోపల శయనమందిరమున నున్నది.

దేవేం : లోపలనా? మనము శయనించుమందిరముననా? కార్యార్థినియా? రేవతీ! నాతోఁ బరిహాసమాడుచుండుట లేదు గద!

రేవతి : చతురమతియగు నొక యువతీమణి నిజముగా వచ్చి మన శయనమందిరమునఁ గూర్చున్నది. లోపలకుఁబోయి మీ రెండు కన్నులతోడను జూడవచ్చును. కాని, కొంచెము భద్రముగా నుండవలయును జుఁడీ! మీ మనసు చెదరిపోఁగలదు. మీ ప్రియురాలు రేవతి యున్నదనుమాట మఱచిపోవలదు! వేగ ముగఁ బోయి వీక్షింపుఁడు. ఆమె వచ్చి చాలసేపైనది.

ఇట్లు చెప్పి రేవతి యా మందిరములోనికిఁ బోయెను. దేవేంద్రుఁడు వేగముగాఁ దన శయనాగారమునఁ బ్రవేశించెను.

౨

దేవేంద్రునిఁ జూచినతోడనే మొగముపై మేలిముసుఁగు వైచికొని కూర్చుండియున్న యా యువతి సంభ్రమముతో లేచి స్త్రీజనసామాన్య మగు సిగ్గును కార్యభారముచేఁ దొలఁగించుచున్నట్లుగ నభినయించుచు మెల్లమెల్లగ "అయ్యా! అపరాధ రహస్య పరిశోధకులు మీరేనా? మీ పేరు దేవేంద్ర విజయ మిత్రులా?" అని యడిగెను.

దేవేం: ఔను. నీవు నిర్భయముగా నిచ్చటఁ గూర్చుండి నాతో మాటలాడవచ్చును.

స్త్రీ: అయ్యా! విపదంధకారమునఁ బడియున్నాను. జరిగిన సంగతులన్నియు నతి నిగూఢముగను, నతి బలవంతముగను, నతి దృఢముగను, నతి జటిలముగను జరిగిపోయినవి. నే నిప్పుడు చాలఁ జిక్కులలోఁ బడియున్నాను.

దేవేం: సరి.

స్త్రీ: నా కష్టములనుగూర్చి మనవి చేసికొనుమని సెల విచ్చెద రేని ఆద్యోపాంతముగఁ దెలియఁజేసికొందును.

దేవేం: నే నెవ్వరిపక్షమునఁ బనిచేయవలసి యుండునో మొట్టమొదట నాకు వారి పరిచయము కొంచెము కావలసి యుండును.

స్త్రీ: ఎల్లవిధముల మీ సాహాయ్యమునుగోరి మిమ్ముఁ బ్రార్థింపవచ్చిన దీనురాలను నేనే.

దేవేం: పేరు!

స్త్రీ: మనోరమ.

దేవేం: నీకుఁ బాణిగ్రహణ మయినదా? ఇంత పలుకును పెండ్లి కాలేదా?

స్త్రీ: అవివాహితనే.

దేవేం : మంచిది. నే నిప్పు డెవ్వరితోఁ మాటలాడు చుంటినో ముందుగ నామెసంగతి నామూలాగ్రముగఁ దెలిసికొని పరిచయము కలిగించుకొనుట ముఖ్యము. నీవదన మండలమును మఱుఁగుపఱచుచున్న యీ మేలిముసుఁగు నించుక తొలఁగించు టకు సమ్మతించెదవా? అందుల కేమైన నాక్షేపముండునా? సందేహింపవలదు. నన్ను సోదరునిగాఁ జూచుకొనుము.

ఆ సమయమునం దాయింటి వెలుపల నెవ్వతెయో యొక తరుణీరత్నము పకపక నవ్వుచున్న శబ్దము విననయ్యెను. రేవతి యింతవఱకు నా గదివెలుపల దాఁగికొని యీ యిరువురి సంభా షణమును నాలకించుచుండెను.

అసమాన రూపవతియగు మనోరమ కొంచెము వెనుక ముందు లాలోచించుకొని యటునిటు చూచి తరువాతఁ దన మేలిముసుఁగు నించుక తొలఁగించెను.

మనో : మూఁడు సంవత్సరముల తరువాత దీనురాలనగు నా పాడుమొగము నపరిచితులగు పరపురుషుల కన్నులయెదుటఁ బెట్టుట కిదియే మొదలు.

దేవేం : నీ ముఖమండలము మూఁడు సంవత్సరముల నుండియు మాటుగా నుండుటకు గారణమేమి?

మనో : ఎల్లవిధముల నన్నుఁ బోలినకాంత యింకొక తె యున్నది, రూపవర్ణ పరిమాణములందును, సంభాషణ చేష్టా విలాసములందును, నాకు నామెకును లేశమాత్రమైనను భేదము కన్పట్టదు. మూఁడు మూర్తుల నామె నావలెనే యుండును.

దేవేం : ఆమె యెవ్వతె? ఆమె పేరేమి?

మనో : ఆమె పేరును మనోరమయే.

దేవేం : చాల వింతగా నున్నది! లోకమునం దొకరిని బోలినవా రింకొక రుండవచ్చును. నామసాదృశ్యముగూడ నుండుట యద్భుతము.

మనో: ఇది మోసము. కల్పనము—బూటకము—దుండగము—టక్కరితనము—నన్నుఁ బోలియున్న యాయువతి నిజనామమును మాఱ్చుకొని నా పేరు పెట్టుకొని నాకుఁ జెందవలసిన సరస్వమును దొంగిలించి నిరాఘాటముగ ననుభవించుచున్నది. ఎట్టులైన నా ద్రవ్యము నంతను నే నుద్ధరించుకొనవలయు ననునుద్దేశముతో మీ సముఖముఁ కొచ్చితిని. అంతయును మీ చేతిలో నున్నది. పాల ముంచినను, నీట ముంచినను, నాకు మీరే దిక్కు.

దేవేం: తెలిసినది. ఆ మనోరమయొక్క నిజమైన పేరేదియో నీవు చెప్పఁగలవా?

మనో: మనవి చేయఁజాలను. కాని.

దేవేం: ఆమెకును నీకును సంబంధబాంధవ్యము లేమైన నున్నవేమో విశదముగాఁ జెప్పఁగలవా?

మనో: నిశ్చయించి చెప్పఁజాలను.

దేవేం: ఈ విషయమున నీ కెంతవఱకుఁ దెలియునో యంతవఱకును సవిస్తరముగాఁ దెలియఁజేయుము.

అప్పుడు మనోరమ తననయన కమలంబులనుండి యశ్రుబిందువులు ముక్తాఫలంబులవలె జాలువారుచుండ దేవేంద్రుని వంకఁ జూచుచు నించుక సందేహముతో మెల్ల మెల్లఁగా "స్వామీ! ఒకదాని యాకృతియు, ముఖకాంతియు, మఱియొకదాని కారీతిగనే యుండవలసి వచ్చినచో నా మొగూడ మొదటియామెయై పుట్టినప్పుడే గాని యట్లగుట యసంభవము గదా?

దేవేం: అవును.

మనో: ఇప్పుడు నా విషయమున నిట్టిగొడవ పుట్టినది. ముగ్గుర మొక్కరీతిగా నగపడుచున్నాము.

దేవేం: ఏమి! ముగ్గురా! ఒక్కతెను జూచినప్పుడు మఱియొక్కతె యను భ్రాంతి కలుగుచుండునా?

మనో : నిజముగా భ్రమ కలుగుచుండును. అప్పుడప్పుడు మా మువ్వురిలో మాకుఁగూడ నట్టి భ్రాంతి కలుగుచుండెడిది. కాని, యిప్పు డామువ్వురిలో నొక్కతె కాలధర్మము నొందినది.

దేవేం : ఈ మువ్వురిలో జనిపోయినయామె యెవ్వతెయో ఖండితముగాఁ జెప్పఁగలవా?

మనో : చెప్పజాలను.

దేవేం : ఆ యిరువురిలో నెవ్వరైనను నీకు బంధువులా?

మనో : అం దొక్కతె నాకుఁ బినతల్లి కూఁతురు. వావికి నాకుఁ జెల్లెలు. మఱియొకతెతో నా కెంతమాత్రమును బాంధవ్యము లేదు. ఆమెయే నాకుఁ బరమశత్రు స్వరూపిణి.

దేవేం : ఆ మువ్వురు కాంతలలో నీ వొక్కతెవు గదా. మీ మువ్వురి వయస్సును సమానముగనే యుండునా!

మనో : నేనును నా చెలియలు నొక్కదినముననే జనియించితిమి. నా చెల్లెలు గోపాలపురమునను, నేను ఖదరపురమునను జన్మించితిమి. మా యిల్లానంద కుటీరమునం దున్నది. మాలో మూడవ కాంత యేనగరమున నెప్పుడు జన్మించినదో చెప్పఁజాలను.

దేవేం : పోనిమ్ము నీ చెల్లెలి పేరేమియో చెప్పగలవా?

మనో : ఆమె పేరు కుముదిని.

దేవేం : ఆమె నీ పినతల్లి కూఁతురని బాగుగ నెఱుంగుదువా?

మనో : ఎఱుఁగుదును. కుముదిని తల్లియును, మా తల్లియును, కవలపిల్లలు. అక్కచెల్లెండ్ర బిడ్డలమై యున్నప్పుడు నేను కుముదిని నెఱుఁగకుందునా?

దేవేం : నీవలన ననేక సంగతులనుగూర్చి తెలిసికొనవలసి యున్నట్లు తోఁచుచున్నది. సరే! మొదటిదానవు నీవు. నీచెల్లెలు రెండవది, ఊరును పేరును పుట్టుపును దెలియనియామె మూడ

వది. మూఁడవ సంఖ్యానియమముగల యువతి నెన్ని దినముల నుండి యెఱుఁగుదువు?

మనో: ఇప్పటికిఁ బంద్రెండు సంవత్సరములనుండి యెఱిఁగియున్నానని చెప్పవచ్చును. మా బంధువులు కొందఱు భూకైలాస మనునగరమున నివసించుచుండిరి. ఒక కార్యముమీఁదఁ నే నొకప్పు డానగరమునకుఁ బోయి యున్నప్పుడు మూఁడవ కాంతను జూచి యుంటిని.

దేవేం: అప్పుడు చూచియున్నయెడల నీ కామెపరిచయము కలిగియుండవచ్చును.

మనో: ఆ పరిచయము చాల భయంకరమైనది. ఆమూఁడవ స్త్రీ యప్పుడు నన్నుఁజూచి తత్క్షణమే "అక్కా!" అని పిలుచుచు నాయొద్దకువచ్చి పార్శ్వమున నిలువఁబడి రెండవ కాంత యగునాచెల్లెలు కుముదినియని నేను భ్రమించునట్లు నా యొద్దఁ గపటాభినయముల నొనరింప సాఁగెను.

దేవేం: మీ స్వరూప స్వభావములలోఁ బరస్పరభేదము లెంతమాత్రమును లేకయే యుండునుగదా! అట్టిస్థితిలో నామె నీచెల్లెలు కుముదిని కాదని నీ వెట్లు తెలిసికొనఁ జాలితివి?

మనో: అప్పుడు నా చెల్లెలు కుముదిని జబ్బుతో మంచము పట్టి యున్నది. ఆమెకు లేచుటకు శక్తిలేదు. ఆ కారణమువలన నా చెల్లెలు కాదని కనుపెట్టితిని.

దేవేం: నీచెల్లె లంతటి జబ్బుతో నున్నదని నీకుఁ దెలిసి యున్నప్పుడు నీవు వెంటనే పోయి యామెను జూచి తరువాత మరల నింటికిఁ బోయితివా?

మనో: పోలేదు. నాతోఁగూడ వచ్చిన పరిచారకుని నచ్చటకుఁ బోయి చూచిరావలసిన దని చెప్పి పంపియుంటిని. అతఁడు నాకు మిగుల నమ్మకమైనవాఁడు.

దేవేం: ఇప్పు డాతఁ డెచ్చట నున్నాఁడు?

మనో : ఆతఁడు మరణించి మూఁడు సంవత్సరములైనది. ఆతఁడు విషము ద్రాగి మరణించె నని నమ్మియుంటిని.

దేవే : ఆతని మరణవిషయమున నీ కట్టి యనుమానము కలుగుటకుఁ గారణ మేమైన నుండెనా ?

మనో : ఆతఁడారోగ్యవంతుఁడై సంచరించుచుండఁగ నే యాకస్మికముగాఁ జచ్చిపోయెను. ఆచావు చాల రహస్యముగాఁ గలిగినది.

దేవేం : అప్పు డాతనిమరణమునకుఁ గారణ మేమిటో బాగుగ విచారించి తెలిసికొనియుండలేదా ?

మనో : అప్పుడాతఁడు రెండవ యామెయొద్దనో, మూఁడవ యామె యొద్దనో యుండెను. అందుచే కనుపెట్టుటకు వలను పడి నదికాదు.

దేవేం : అట్లుండుట యసంభవము. ఆతఁడు నీ సేవకుఁడై యుండఁగా వారలయొద్ద నుండుట కేమి కారణము ?

మనో : కారణమున కేమున్నది? ఆతనికిని విభ్రాంతికలిగి నది. అప్పు డాతఁడు పోలికలంబట్టి భేదమును గనుపెట్ట జాలక నా యొద్దనేయుండి పని చేయుచున్నట్లు భావించుకొనియెను.

దేవేం : ఆతఁడు చిరకాల సేవకుఁడా ? వృద్ధుఁడా ? మీ కుటుంబమునకుఁ జేరినవాఁడేనా !

మనో : ఔను.

దేవేం : నీవు జన్మించినది మొదలుకొని నిన్ను బాగుగఁ జూచుచున్న వానికిఁ గూడ నట్టివిభ్రాంతి కలిగి మోసపోవుటకుఁ గారణ మే మున్నది ? అంతభ్రాంతి యుండునా ?

మనో : పాప మాతనికి విభ్రాంతి కలుగుట కదియే మొదలు; అదియే తుదిభ్రాంతి యయిపోయినది !

దేవేం : అది యేమి ?

మనో: ఆతని కెప్పుడు సంశయ విభ్రాంతి కలిగియుండ లేదు. ఆతని మరణకాలమునకుఁ గొంచెముముందుగ సన్నిసంగతులు నాతఁడు గ్రహింపగలిగెను. తన్నట్లు మోసముచేసినవారి యుద్దేశము నాతఁడు బాగుగఁ గనుపెట్టెను. ఆతఁడనుమానపడుచుండుట తెలియవచ్చుటచే నందులకుఁ బ్రతీకారముగ వారాతనిని విషప్రయోగముచేఁ జంపివైచిరి.

దేవేం: ఆతనిని మోసముచేయుటయో వారియుద్దేశమైనట్లుగ నాతఁడు తెలిసికొనియుండెనని నీ వెట్లు తెలిసికొనఁ గలిగితివి?

మనో: ఆతఁడు మరణించుటకుఁ బూర్వమే నా పేర నుత్తరమును వ్రాసియున్నాఁడు.

దేవేం: ఆ యుత్తరము టపాలోనే వచ్చినదా?

మనో: లేదు. ఒకఁడు తీసికొని వచ్చి నా కిచ్చినాఁడు. ఆ యుత్తరమును భద్రముగా దాచి యుంచితిని. ఇప్పు డది నా యొద్దనే యున్నది. ఆవశ్యక మని తోఁచినయెడల మీ రిప్పుడు దానిని జిత్తగింపవచ్చును.

దేవేంద్రుఁ డామెయొద్దనున్న యుత్తరము నందుకొని యిట్లు చదువ నారంభించెను:

శ్రీ శ్రీ కాళీసహాయము!

“అక్కా! నేను చాల మోసపోయితిని. నీవు నాకు నిజమైనయధికారిణివని నేనిప్పటికిఁ దెలిసికొనఁ గలిగితిని. ఆ విషయమునుగూర్చి నే ననేక దృష్టాంతములను సిద్ధపఱచి యుంచితిని. ఎవ్వరిమోసముచే నైన నవి యన్నియు నపహరింపఁబడు నేమో యను భయముచే వానిని నీయొద్ద కిప్పుడు పంపియుండలేదు. సమయము వచ్చినప్పుడు మన కనుకూలములగు నని తోఁచు నేని వాని నన్నిటిని నీ కప్పగింపఁగలను. నిన్న నాకు జ్వరము

వచ్చినది. నేఁడా జ్వరము హెచ్చి నీరసముగా నున్నది. ఱేపటికి జ్వరము వదలిపోవక మఱింత హెచ్చుగా నుండుట తటస్థించు నేని నీయొద్ద కాదృష్టాంతముల నన్నిఁటిని మనుష్యునిచేతి కిచ్చి పంపివేయుచున్నాఁడను. నిన్ను సరిగా గుర్తింపజాలని నాయవివేకమువలన నిట్టిమోసములకు లోఁబడి పోతిని. దయయుంచి నా సర్వాపరాధములను క్షమియింపవలయు నని మిగులఁ బ్రార్థించు చున్నాఁడను.

నీవిధేయ సేవకుఁడు,

"రామ గులాము."

"పునశ్చ : ఎప్పటికైన నాయొద్ద నున్న రుజువుపత్రములు దొంగలింపఁబడిపోవు నని నీవు భయపడ నక్కఱలేదు. నే నా కాగితముల నన్నిటిని సంపుటముగాఁ జేసి దాచి యుంచినస్థల మితరుల కెవ్వరికిని తెలియఁబోదు.. ఆ కాగితముల సంపుటమును గుర్తించుటకుఁగాను దానిపై "17. క." అని వ్రాసి గుర్తువేసి యున్నాఁడను."

దేవేంద్రుఁ డాయుత్తరము మొదటినుండి తుదివఱకును జదివి ముగించి, మనోరమతో "ఈ యుత్తరము తరువాత రామ గులాము మరల నెప్పుడైన నీపేర నుత్తరము వ్రాసియున్నాఁడా?" అని యడిగెను.

మనో : లేదు. వ్రాయుట యెట్లు తటస్థించును? ఆతఁడు నాఁటి రాత్రియే కాలధర్మము నొందినాఁడు.

దేవేం : మరణించెనా? ఒకనాఁటి జ్వరమునకే మరణమా? చాల వింతగా నున్నది. నిజముగా నాతఁడేరోగము వలన మరణించి యుండును?

మనో : తరువాత వైద్యులువచ్చి బాగుగఁ బరీక్షించి మూర్ఛ రోగమువలన పోయినాఁడని నిర్ద్దేశించిరఁట.

దేవేం: ఆతనికి విషముపెట్టి చంపివేసిరని నీవిదివఱకు నమ్మియుంటివి కాదా ? సరే! "17. క." అని గుఱ్తువేసి దాఁచి యుంచిన కాగితములకట్ట సంగతి యేమైనది ? దానివిషయమై యేమైనఁ బ్రయత్నము చేసియుంటివా ?

మనో: నేనేమి చేయఁగలను ? దానికొఱకుఁ బ్రయత్నించుటకు నాకెట్టి యాధారమును దొరకలేదు. అందువలననే నేను తప్పు ఫిర్యాదుచేసితినని యెంచి యధికారులు నన్నుఁ జెఱసాలయందుంచిరి. ఈ విషయమునుగూర్చి యితరులెట్లు నమ్ముట లేదో మీరుకూడ నట్లే నమ్ముచున్నారు.

దేవేం: అది యంతయును నీవు చెప్పకపోయినను నేను మఱియొక విధముగాఁ దెలిసికొనఁగలను. కాని నీవీవిషయమున నెట్టి సంగతియును నాతోఁ జెప్పకుండ రహస్యముగా దాచి యుంచుకొనఁగూడదు.

మనో: అమితమగు నాయైశ్వర్యము నంతను దోచుకొని యథేచ్ఛముగ ననుభవించుచున్న యాకపటమనోరమ నన్ను పిచ్చిదానిని జేసి వైద్యుని కొప్పగించి యచట నన్ను బంధించి యుంచినది.

దేవేం: ఆమె నీధనము నంతను బలవంతముగ నాక్రమించుకొని యిప్పటి కెన్నిదినములై యుండును ?

మనో: మూఁడుసంవత్సరములలైనది.

దేవేం: నీవు వైద్యుని నిర్బంధమునుండి యెన్నిదినముల క్రిందట విడుదల యయినావు ?

మనో: రెండుదినముల క్రిందట.

దేవేం: ఆవైద్యుఁ డెక్కడ నున్నాఁడు ? ఆతనిపే రేమి ?

మనో: శివపుర గ్రామమున. నామధేయము గోవింద ప్రసాదు.

దేవేం: నీవు పిచ్చిదానవు. ఎట్లో యాతనియొద్దనుండి తప్పించుకొని యీవిధముగాఁ బరుగెత్తుకొని వచ్చితివి కాదా ?

ఇప్పుడు నిన్ను మరల నాదైవస్యానివశమున నే నొప్పగింపఁగలను.

మనో: పరమేశ్వరా! ఇది న్యాయము! ఆత్మరక్షణమును గోరి దయాళురగు మీపాలకుఁగుఁ జొచ్చితిని. మీ రాదైవస్యని కొప్పగించుటకంటె ప్రీతినాకుఁ దగుసుయమధర్మరాజువశమున—

దేవేం: నీవు పిచ్చిదానవు. నిన్నాతనికైనఁ బట్టి యుంచుటయో మంచి పని యని నాకుఁ దోఁచుచున్నది.

3

దేవేంద్రుఁడు బిగ్గరగను కర్కశధ్వనితోడను చెప్పినమాటలను విని మనోరమ భయపడి కొంతసేపటివఱకు మాఱుమాటాడక యూరకుండి యుచ్ఛ్వాసనిశ్వాసముల నప్పుడైన వినఁబడనంత నిశ్చేష్టయై దీనభావమునఁ దలవంచుకొని కూర్చుండి యుండెను. తర్వాత భయప్రకంపితంబగు కంఠస్వరంబున నస్ఫుటంబగు వచనరచనతో "అయ్యా! నేను చెప్పినమాటల నన్నిటిని మీరు నమ్మియుంటిరా? కాక, నేను పిచ్చిదాన ననియో తలచితిరా?" అని ప్రశ్నించెను.

దేవేం: మనోరమా! "17. క." అను గుర్తువేయఁబడిన కాగితములకట్టను బాగుగఁ బరీక్షించువఱకు నేను నిన్నును, నీమాటలను గూడ నెంతమాత్రమును నమ్మఁజాలను. నీవు నా పేరు దేవేంద్రవిజయుఁడని బాగుగ జ్ఞప్తియం దుంచుకొనుము.

అప్పుడు మనోరమ కృతజ్ఞతాపూరితంబగు వికసితహృదయంబుతోడను, నశ్రుజలప్రపూర్ణంబగువిశాలనయనయుగళంబుతోడను, వినయవినమితం బగునుత్తమాంగంబుతోడను తనసాధుస్వభావమును వెల్లడించు సవినయమధురంబులగువచనంబులతో "అయ్యా! నాకార్యభారమంతయును మీపైఁ బెట్టుటకు ముందుగా నింకొకమాటను మీకు విన్నవింపవలసి

యున్నది. ఇప్పుడు నేను చాల నీచస్థితియందున్నదానను. నా కెక్కడను సహాయులనువా రెవ్వరును లేరు. దిక్కు లేనిదానన గుటయే కాక నిర్ధనురాలనుకూడ నై యున్నదానను. ఇప్పుడు నాయొద్ద నున్న సర్వస్వమును లెక్కవేసి చూచినచో నూట యిరువది రూపాయలకంటె నెక్కుడుగ లేదు. కావున దీనపోషకు లగుమీరు మీబిడ్డవంటిదాన నగునాయందుఁ బరిపూర్ణానుగ్రహ ముంచి నాకార్యము సఫల మగునట్లు పని చేసి నిర్వహించెదరేని నే నప్పుడు మీకుఁ దగిన బహుమాన మీయఁజాలుదు నని విజ్ఞాపనము చేసికొనుచున్నదానను. ఒకవేళ మీరు "17. క." అను గుర్తు గలకాగితపుసంపుటమును కనిపెట్టఁజాలక పోయిన యెడల—

దేవేం: ఆకట్టుతోఁ బని యే మున్నది?

మనో: ఆపత్రసంపుటమువలన నాకుఁ జాలలాభ మున్నది. నాధనసంపత్తియును దానిమూలముననే నాకు రాఁగలదు. ఇప్పటికి నాలుగైదు సంవత్సరములకుఁ బూర్వము నాతండ్రి మరణించు నప్పుడు డాతఁడు నాకొఱకు రెండులక్షలరూపాయలకుఁ దక్కువ కాని నిలువ గల స్థిరమైన స్వాస్థ్యమును కలిగించి చనిపోయి యున్నాఁడు.

దేవేం: మీతల్లియును మరణించినట్లే తోఁచుచున్నది.

మనో: మాతల్లి మరణించి యిప్పటికిఁ బదిసంవత్సరము లైనది. నా కిప్పుడు పదునెనిమిదేండ్ల వయసు నున్నది.

దేవేం: ఇంతవయసున్నను నీకుఁ బెండ్లి కాలే దేమి?

మనో: మాతండ్రి బ్రహ్మసమాజమునకు చేరినవాఁడు. వారు బాల్యవివాహముల నంగీకరించరు. నాతండ్రి మరణించు నప్పటికి నాకు పదుమూఁడేండ్లు. అప్పటినుండి చిక్కులలోఁ బడిపోతిని. ఇంతవఱకును వైద్యశాలయందే బంధింపఁబడి యుంటిని గదా.

దేవేం : నిన్నిట్టి యిడుములపాలు చేసి నీసర్వస్వమును నపహరించి నిరాఘాటముగ ననుభవించుచున్న యాయువతి నీచెల్లెలు కుముదినియో, కాక, యూరును, పేరును కులమును దెలిసికొనఁ జాలని మూఁడవకాంతయో నీవు చెప్పఁగలవా ?

మనో : చెప్పలేను. ప్రయత్నించి తెలిసికొందమన్నను నందులకుఁ దగినయాధార మేమియు నగపడుటలేదు.

దేవేం : ఇది చాలదుర్భేద్యము. నీవు నివసించు మందిర మెచ్చట నున్నది ?

మనో : ఖదరపురమున గంగానదియొడ్డున నేను గాపుర మున్న యిల్లున్నది. అది యంతర్భవనమువలెఁ గట్టినసౌధము. ఆయింటికి నలువంకలను పెద్దపెద్దఫలవృక్షములును, మంచి మంచిపుష్పలతలును గలతోఁట లున్నవి. ఆయారామములకుఁ జుట్టును నీలశిలావినిర్మితం బగు బల మైన ప్రాకారము పరివేష్టించి యున్నది. ప్రక్కనే టేకు, దేవదారు మొదలగువృక్షము లాకసము నంటునట్లుగాఁ బెరిగి కొండొక ప్రాకారముం బోలి యున్నవి. మాతండ్రి మిగులఁ గుతూహలముతో నాభవన మునకు "ఆనందకుటీరము" అని పేరు పెట్టియుండెను.

దేవేం : మీ ముప్వురిలోను మరణించినయామె మీ చెల్లెలు కుముదిని యని నాకుఁ దోఁచుచున్నది. ఆయుద్దేశము తోడనే నే నీ కార్యమును నడపుటకుఁ బ్రయత్నించెదను. మంచిది. మీచెల్లెలు కాలధర్మమునొంది యిప్పటి కెన్నిదినము లై యుండునో చెప్పఁగలవా ?

మనో : పిచ్చిదాననని నన్ను వైద్యుని కొప్పగించుటకుఁ బూర్వము రెండువారములక్రిందట కుముదిని మరణించినది.

దేవేం : ఆమె యెక్కడ జచ్చిపోయినది ?

మనో : మా యానందకుటీరమునందే.

దేవేం : ఆమె యెట్టిరోగమువలనఁ గాలధర్మము నొందిన దో నీవు నిశ్చయముగాఁ జెప్పఁజాలుదువా ?

మనో : రామగులాముస కెట్టిరోగమువలన మృత్యువు సంభవించినదో, కుముదినికి నట్టిరోగము మూలములనే చావు వచ్చినది.

దేవేం: ఆమెయును మూర్ఛరోగమువలననే మరణించెనా?

మనో : అవును. విషప్రయోగమువలన నాచెల్లెలు చనిపోయినతరువాత నేను ఖిదరపురమునందలి క్రయవిక్రయస్థానమునందు చరస్థిరరూపక మైననాద్రవ్యము నంతను విక్రయించి యామూల్యమును భద్రపఱచుకొనవలయు నని ప్రయత్నించుచుంటిని. ఇంతకుఁ బూర్వమునుండియు మాపక్షమునఁ బనిచేయుచున్న న్యాయవాది యొక్కఁడాగ్రామమునం దుండెను. అతఁడు న్యాయస్థానములయందు నాతండ్రిగారి యభియోగకార్యములను నిర్వహించుచుండెడివాఁడు. అప్పుడు నే నాతనియొద్దకుఁ బోయి యెల్లసంగతులను మనవి చేసి పైతృకం బగునా సర్వస్వమును విక్రయించి పెట్టవలయు నని యాతనిని వేఁడుకొంటిని. అతఁడును నాయవస్థంజూచి దుఃఖించువానింబోలి నటియించుచు "అమ్మా! నాచేత నైనంతవఱకు శ్రమపడి నీపక్షమున వ్యవహరించి నీకార్యముల నన్నిఁటి ననుకూల మగురీతిని నిర్వహించెదను," అని చెప్పి తుట్టతుదకు నాకుఁ బిచ్చి పట్టిన దని మిషపెట్టి నన్ను జికిత్సాగారమునకుఁ దీసికొని పోయి యట నొప్పగించి బంధించినాఁడు.

దేవేం : అలాగా! ఇఁకఁ దెలిసినది. కేవలము మృషావాదిఁ యగు నాన్యాయవేషధారి తుచ్ఛధనాపేక్షచేఁ నీప్రతిపక్షుల పక్షమునఁ జేరిపోయియుండును. ఆతనిపే రేమి ?

మనో : తులసీదాసు.

దేవేం : వాని విషయమై క్రమముగా నాలోచింప

వచ్చును. నీకుఁ బిచ్చి యెత్తినదని రుజువుచేయుట కప్పు డేవైన విశేషకారణము లుండెనా ?

మనో : ఆవిషయమున రుజువుపఱచుటకుఁ గారణము లేవి యున్నవో నేను చెప్పఁజాలను. కాని, యాన్యాయవాది యొక్క కాగితముపై ఇంగ్లీషులో నేమేమియో వ్రాసి దానిని నా చేతి కిచ్చి తరువాత నన్నాతఁ డానందకుటీరమునకు వెంటఁబెట్టుకొని పోయెను. ఆ కాగితములో నా సొమ్మువిషయమై యనేకములగు దృష్టాంతము లున్నవని యాతఁడు నాతోఁ జెప్పియున్నాఁడు. తరువాత నే నాతఁడు చెప్పిన రీతినే చేసితిని. ఆ కాగితమును దీసికొనిపోయి యానందకుటీరమునఁ జూపించినతోడనే కన్న వారందఱును నన్నుఁ బరిహసించుచుఁ బకపక నవ్వసాగిరి.

దేవేం : తరువాత ?

మనో : తరువాత వారందఱును జేరి యీ విషయమున బాగుగ విచారణ కావలయునని చెప్పిరి.

దేవేం : ఎక్కడ విచారణ కావలయు ననిరి ?

మనో : తత్క్షణమే యానందకుటీరమునకు విచారణాధికారులను దీసికొని రావలయునని చెప్పిరి.

దేవేం : సరియే. అంతయును దెలిసిపోయినది. నీ పక్షమున నున్న న్యాయవాది నీ కిదియంతయును విశదముగాఁ దెలియఁజేసెను కాఁబోలు. అతఁడు మొదటనుండియు నిన్ను మోసము చేయవలయుననియే తలంచుకొని యుండెను. తరువాత విచారణమున మాత్రము కాఁదగిన దేమున్నది ? ఇంతకు ముందే మీ మువ్వురిలో నొక్కతె యీ లోకమును విడిచిపోయినది. ఆమె నీ చెల్లెలు కుముదినియే కావచ్చును.

మనో : ఔను.

దేవేం : తరువాత నేమి జరిగినది ?

మనో: తరువాత చూపులకుఁ బెద్ద మనుష్యులవలె నగపడుచున్న యిరువురు జను లచ్చటికి వచ్చి కూరుచుండిరి. వారే విచారణముచేసి తీర్పు నధికారులని నేను తెలిసికొంటిని. నేను వారికి నాసంగతుల నన్నిటిని మనవి చేసికొంటిని. అక్కడ నున్న నా న్యాయవాది యప్పుడు వా రిద్దఱియొద్దకును బోయి వారి చెవిలో రహస్యముగ నేమేమియో చెప్పెను. ఏ పాపము నెఱుఁగని నే నప్పు డాతఁడు నా పక్షమున వాదించుచుండె ననియే నమ్మియుంటిని. అంతవఱకును నాకుఁగల నెట్టినమ్మక మప్పుడే వదలిపోయెను. ఆతఁడు మాటాడుచు మాటాడుచుఁ దుట్టతుదకు "కేవలము పిచ్చిది" అని చెప్పి తన వాగ్ధోరణి ముగించెను. ఆ మాట విన్నతోడనే నా ప్రాణములు నిలువున నెగసిపోయి నట్లయ్యెను. న్యాయనిర్ణయకర్త లిరువురును "ఔను నిజమే. పిచ్చి దనుట కెంతమాత్రమును సందేహము లేదు," అని చెప్పి కాగితముపైఁ జేవ్రాలు చేసి దానిని న్యాయవాది కిచ్చిరి. వారు న్యాయాధికారులు కారు. ఎట్లో బిరుదు పట్టముల నందిన డాక్టరు నామమాత్రధారులు. నేను పిచ్చిదాన నైనట్లు బాగుగ రుజువైనదని తీర్పు పత్రమునుగూడ వ్రాసి యిచ్చిరి. నా న్యాయవాదియే నా నాశనమునకు మూలకారణుఁ డయ్యెను.

దేవేం: వా రిరువురి ప్రమాణ పత్రికల మూలమునను నీవు పిచ్చిదానవని దృఢముగా స్థిరపడిపోయిన తరువాత నేమి జరిగినది?

మనో: తరువాత నేను చికిత్సాగారమునందు బందీకృతనై యుంటిని. ఆ మూఁడవ యువతి నేను ధరించు నుడుపులను దొడుగుకొనుచు నాపేరు పెట్టుకొని తానే నే నని చెప్పుకొనుచు సంచరించుచుండెను. మిగుల దయార్ద్రహృదయము కలదానివలె నతి ధారాళముగఁ జరియించు దానివలె లోకమునకుఁ దోఁచునట్లుగా నామె నా చికిత్సకొఱకును, అన్న వస్త్ర

ములకొఱకును, నగుచున్న ద్రవ్యమును తాను నపహరించెదనని వైద్యునితోఁ జెప్పుటయే కాక "పాప మీ పిచ్చిదానికి మంచి యౌషధము నిచ్చి వేగముగా బాగుచేయవలయు"నని యాతనితోఁ జెప్పుచుండెను. నా దురవస్థం జూచి తా నెంతయో కనికరపడుచున్నట్లు కపట నటనములఁ జేయుచు, నా యూరును పేరును తెలియకపోవుటచేఁ దనకుఁ జాల విచారముగా నున్నట్లు తోఁపఁ జేయుచుండెను. అక్కడివారు నాపై మిగులఁ గోపించి "ఈమె నిజముగా పిచ్చిది కాదు; టక్కరికత్తె. అతి దారుణ కృత్యములకు లోఁబడి దుర్బుద్ధియై, దురాశతో దొంగపేరు పెట్టుకొని ద్రవ్యము నపహరింపవలయునను నుద్దేశమున నిటకు వచ్చియున్నది; ఈమెను వైద్యశాలయం దుంచుటకంటెఁ గారాగారమునం దుంచుటయే సర్వవిధములఁ దగియుండును," అని నిందింపసాగిరి. అందుల కా యువతి (ఆమె నాచెల్లెలో, కాక మూఁడవ కాంతయో ఖండితముగాఁ జెప్పజాలను) చాలఁ బశ్చాత్తాపపడుచున్న దానివలె నా విషయమున వారితో "ఈమె టక్కరికత్తె కాదు; పాపము పిచ్చిపట్టుటచే నిట్టి యసందర్భ ప్రలాపములు బ్రకటించినది; దైవోపహతయగు నీమెపై నెల్లరును జాలి చెందవలయునేగాని కోపగింపరాదు" అని చెప్పి నన్ను వైద్యశాలయందే యుంచుట మంచిది యని నిర్ధారణము చేసెను.

దేవేం: అట్లయినయెడల నీవు జనియించినది మొదలు నీ ప్రతిపక్షులచే వెడలఁగొట్టిన దినము వఱకును నీవా యానంద కుటీరమున నివాసము చేయుచున్నట్లు తెలియఁజేయుటకుఁ దగిన నిదర్శనములను సప్రమాణముగఁ జూపింపఁ గలుగుదువా?

మనో: చూపింపఁగలను. ఆ మందిరమునం దెవ్వరికిని గానరాని రహస్యాంతర్భవనమున్నదనియు, దానికిఁ దలుపులును, ద్వారము నున్న యదెంతటి చతురులైనను కనిపెట్టఁజాలని యట్లు

సర్మింపఁబడితె ననియు, నట నున్న మూఁడవకాంత యీ
యోకాంతె మందిరమును జూపింపఁ జాలినయెడల విచారణము
గాని సాక్ష్యముగాని యక్కఱ లేకుండఁగనే యీ మందిరమున
కామెయే యధికారిణి యని నే నంగీకరించెదననియు మనవి చేసి
కొని యుంటిని.

దేవేం: అట్లు నీవు చెప్పుకొనుచున్నను న్యాయాధికారులు
ని మాటలను విశ్వసించి విచారింపలేము కాదా? నీవు పిచ్చిదాన
వనియు నెల్లవిధముల నిశ్చయించి యీ యుద్దేశము ననుస
రించియే తీర్పుచేసిరి కాఁబోలును! తుదకు జరిగిన దింతియేనా?

మనో: ఔను! అయినను నా హృదయమునం దేమో
కాని నిరాశ కలుగుటలేదు. ఎన్నియో కష్టముల కోర్చి సమయము
కొఱకు నిరీక్షించుచుండి యెట్లో యీ వైద్యుని చెఱనుండి
తప్పించుకొని మీ పాదములపైఁ బడితిని. చిరకాలమునుండి
మీ నామమును వినుచుంటిని. అనాథ నగు నాకు మీరే దిక్కు.

దేవేం: నాచేఁత నైనంతవఱకు శ్రమ కోర్చి నీ కార్య
మెల్లవిధముల సఫలమగునట్లు నెఱవేర్పఁ బ్రయత్నించెదను.

మనో: మహాశయా! కృతజ్ఞత నే విధముగాఁ బ్రక
టింపవలయునో తెలియుటలేదు.

దేవేం: దాని కేమి? నేను నీతో నేమి చెప్పుదునో
దానిని సావధానముగ నాకర్ణించి వెనుక ముందుఁ జూడక
వేగముగనే యీ కార్యమును నీవు నిర్వహించుచుండవలయును.

మనో: తత్క్షణమే చేసెదను.

దేవేం: మంచిది. ఇంకను నీవలనఁ గొన్ని సంగతులు
తెలిసికొనవలసి యున్నవి. మూఁడవ కాంత పెండ్లి యయినదా?

మనో: నే నామె నెఱిఁగియున్న మూఁడు సంవత్సరముల
నుండియుఁ బెండ్లి యయినట్లు లేదు. ఇప్పు డేమైనదియో నేను
చెప్పఁజాలను.

దేవేం : నీ చెల్లెలు కుముదినికో ?

మనో : ఆమెయు నవివాహితయే.

దేవేం : మీతల్లిదండ్రులకును, మీపినతల్లి పినతండ్రుల కును నెప్పుడైన నేవిషయమునుగూర్చి యయిన నభియోగములు జరిగినవా ?

మనో : నాతండ్రి మొదటినుండియు జాల ధనవంతుఁడు. కుముదినితండ్రి మిగుల దరిద్రుఁడు. కుముదిని తల్లియును, నాతల్లియుఁ గవలలుగాఁ బుట్టిన యక్కచెల్లెండ్రు. మా తల్లి జీవించి యున్నంతవఱకు నాకుఁ బినతల్లి యగు కుముదినితల్లి మాయింటనే నివసించుచుండెను. వారికుటుంబమున కగువ్యయ మంతయును మేమే భరించుచుంటిమి. అప్పటికి నాకును కుము దినికిని నేడెనిమిదేండ్లకంటె హెచ్చుగానుండవు.

దేవేం : అప్పటికి మీ యిరువురిలోను రూపభేద మేమైన నగపడుచుండెడిదా ?

మనో : లేదు. మా పినతల్లికూడ మా యిరువురను గుర్తింపఁజాలక భేదము తెలియుటకై ప్రతిదినమును నానుదుట శ్రీచందనతిలకమును బెట్టుచుండెడిది. కుముదినియు నేను నొక రీతియుడుపులనే ధరించుచుండుటవలన మాయింటిలోని బరిచా రిక లెవ్వరును మాభేదమును గనిపెట్టఁజాలక తడఁబడి పోవు చుండిరి.

దేవేం : ఒక్కరీతివస్త్రములనే ధరింపవలయు ననుకోరిక మీలో నెవ్వరి కధికముగా నుండెను ?

మనో : కుముదినికే. ఆమె యెల్లపుడు నెల్లవిధముల నాచీరలను నాకంచుకములనే ధరియించుచుండెడిది. ఒక్కొక్క సారి నాయుడుపులఁ బోలినయుడుపులను గుట్టించుకొనుచుండెను.

దేవేం : ఆమె యట్లు చేయుట కేమైనఁ గారణము లుండెనా ? ఊరక కుతూహలమువలననే యట్లు ధరియించు చుండునా ?

మనో : కుముదిని యెప్పుడు నాట లాడుచుండెడిది. ఆమె కాటలనిన నెంతోయిష్టము. కుముదిని యాటపాటలు లేకుండ నిమిషమైనఁ గడపఁజాలదు. ఆమె పరిచారికలతోఁ గూడఁ బరిహాసమాడుచుండును. నాయుడుపులను ధరించుకొని పోయి మాయింటిదాసదాసీ జనమును భ్రమ పెట్టుచుండును. నే నాజ్ఞాపించినట్లుగా వారి కాజ్ఞాపించి వారివలన ననేకకార్యములను జేయించుచుండును.

దేవేం : దీనినిబట్టి చూడఁగా నీసందర్భమునఁ జాల గందరగోళముగా నున్నది. కానిమ్ము. ఇప్పుడు మీయిద్దరి లోను చనిపోయిన యామె కుముదిని కాక మూఁడవకాంత యేమో యని కూడ ననుమానము కలుగుచున్నది. నీద్రవ్య మంతయు నపహరించి యనుభవించుచున్న యామె నీచెల్లెలు కుముదినియే కాని మఱి యొకతె కాదు.

౪

మనోరమ మరల చెప్పనారంభించెను :

"నన్ను మాతండ్రిమాత్రము బాగుగ నానవాలు పట్టుచుండెను. అతని కెన్నఁడును మాయిరువురి విషయమునను భ్రాంతి కలిగి యుండ లేదు. నాకును చెల్లెలికిని రూపమునందుఁ జాలభేద మున్న దని మాతండ్రి చెప్పుచుండెడివాఁడు."

ఇంతవఱకుమాత్రము చెప్పి మనోరమ కొంచెముసేపు మాటలాడ కూరకుండెను. మరల నేమియో యాలోచించుకొని యొకసారి వెనుకకును ముందునకును చూచి యీవిధముగాఁ జెప్పనారంభించెను :

"ఒకదినము నాతండ్రి యెవ్వరును లేనిసమయమున నేకాంతముగ నన్నుఁ బిలిచి కుముదిని యీవిధముగాఁ జిన్నతనపుఁబనులలో నల్లరిచేయు టంత బాగుగ లే దనియును,

'మీరావిషయమున నెవ్వరికి నేవిధ మైనస్రభమయును కలుగకుండునట్లొక యేర్పాటు చేయుడు' ననియును నేనేర్పఱచినసదానిని మన యింటి పరిచారకులకందఱకును తెలిపివైతు ననియును చెప్పిన నన్నందఱు నానవాలుపట్టునట్లుగా నాచేతివ్రేలి కొక యుంగరమును చేయించి పెట్టెను. అందువలన నాపరిచారకు లందఱు నప్పటినుండి నన్ను బాగుగా గుర్తించుచుండిరి. ఆయుంగరమునం దనేకవిధములైనపుష్పములు లతలు మొదలగు చిత్రచిత్రప్రదర్శనములతో నగానుపని చేయఁబడియుండెను. ఆయుంగుళీయకమువలననే నాసేవకుఁడు రామగులాము మోసముఁబడిపోయెను.

దేవేం : ఆయుంగరము పోయినదా ?

మనో : ఔను.

దేవేం : అది యెట్లు పోయినది ?

మనో : ఎట్లు పోయినదో చెప్పఁజాలను. నేను నిద్రించుచున్నసమయమున నా కెఱుకపడకుండ నాపరిచారిక నొంగిలించి యుండవచ్చును.

దేవేం : కావచ్చును. ఆ యుంగరమును గుర్తించుట కేమైన నానవాలు చెప్పఁగలవా ?

మనో : ఆయుంగరమును, నందుపై నున్న నగానుపనియు నచ్చపు బంగారు రేకుతోఁ జేయఁబడినది. దానిపై నక్షత్రములవలె మిలమిల మెఱయుచున్నట్లుగఁ జెక్కఁబడినపుష్పములు కొన్నియున్నవి. వానికి నడుమ వజ్రపుఁబొడులు కూర్పఁబడియున్నవి. మధ్య ప్రదేశమున నలుచదరముగ బంగారుబిళ్ల యున్నది. దానిపై "ఓమ్" చెక్కఁబడినది. ఆ యుంగరము నిచ్చునప్పుడు దానియం దెంతయో మాహాత్మ్య మున్నదనియు, దాని నెవ్వరు ధరియింతురో వారు మహైశ్వర్యముతోఁ దులదూగుచుందురనియు, నెల్లప్పుడును వ్రేలఁదాల్చి యుండ

వలయు ననియు నేకారణమునన్నైన నది పోయినచో డల దరిద్ర దేవత యావహించు ననియు ప్రాణప్రదముగఁ గాపాడుకొనుచుండ వలయు ననియు నాకు తండ్రి బోధించినాఁడు.

దేవేం : ఇప్పటి నీయవస్థ చూడఁగా మీ తండ్రిగారి వాక్యములు శిలాక్షరము లనియే తోఁచుచున్నది.

మనో : ద్రవిడదేశమునకుఁ బోయినప్పు డాయన కొక జ్యోతిష్కుఁ డాయుంగరము నిచ్చినట్లు మాతండ్రి నాతో నప్పుడే చెప్పియున్నాఁడు. తరువాత నాచెల్లెలు కుముదిని యాయుంగ రమువలన నాకును దనకును జాలభేదము కలిగినదని తెలిసికొని యెను. నే నుంగరము ధరించిన దినముమొదలుగ నామె నాపరి చారకులను భ్రమపెట్టుట సాగ లేదు. మాతల్లి చనిపోయిన తరువాత మాతండ్రి నన్ను డిల్లీనగరమునకుఁ దీసికొని పోయెను. మాపినతల్లి తనకూఁతురుతోఁగూడ మా యానందకుటీరముననే యుండెను. మేము డిల్లీలో రెండుసంవత్సరము లుంటిమి. మేము డిల్లీనగరమునుండి వెనుదిరిగి వచ్చినతరువాత మాతండ్రి మా పిన తండ్రిని పిలిచి "మీ రీయానందకుటీరమును విడిచిపెట్టి మీ యిచ్ఛవచ్చినచోటికిఁ బోయి యుండవలయును" అని చెప్పెను. ఆతనినోటినుండి వెడలినమాట నిరర్థకముగఁ బోఁజాలదు. పిన తండ్రి తనభార్య పుత్త్రికను వెంటఁ బెట్టుకొని మఱియొక చోటికిఁ బోయెను. వా రానందకుటీరమును విడిచి పోయినతరు వాత నే నెంతయో విచారించితిని. అదిమొదలుగ నేను కుము దినిని తరుచుగఁ జూచుచుండుట లేదు. అనంతరము రెండుసంవ త్సరములకు కుముదినితండ్రి పరమపదము నందెను. మాతండ్రి మరణించుటకుఁ గొన్ని నెలలు ముందుగనే మాపినతల్లి కాల ధర్మము నొందినది.

దేవేం : (కొంతసే పేమియును మాటాడ కూరకుండి తరువాత) మనోరమా ! నీసర్వస్వమన్యాక్రాంత మగుటకుఁ

బూర్వము మొట్టమొదట నేమి జరిగినదో చెప్పుము! అది నీచే తిలోనుండి యెట్లు వదలిపోయినది?

మనో: మహానగరమున మాబంధువులయింట వివాహ మగుచుండుటచే పెండ్లికి వారియింటికిఁ బోయియుంటిని.

దేవేం: అలాగా! కొంచెమునే పోఁగుము. మఱియొక మాట: నీవు పెండ్లికిఁ బోయినప్పుడు కుముదిని యెచ్చట నున్నదో నీ వెఱుంగుదువా?

మనో: బాగుగఁ దెలియదు. వారియిల్లు చేతలానుహా లునం దున్నది. ఆమెకుఁగూడ నాపెండ్లివారు శుభలేఖను బంపి యున్నారో, లేదో కూడ నెఱుంగను.

దేవేం: నీవు పెండ్లికిఁ బోయిన యింటివారి స్థితిగతు లేమైన నీకుఁ దెలియునా?

మనో: వారు చాలఁ బెద్దమనుష్యులు. వారిమందిరమున నేను మూఁడుదినము లుంటిని. ఆపెండ్లిలో నాకబలిదినమున నాయింటఁ జాల గందరగోళము పుట్టెను. ఆదినమునందే నాపేర నుత్తరము వచ్చినది. మాతండ్రియొద్దఁ జాలకాలమునుండి పని చేసిన పరిచారకునికిఁ జాల జబ్బుచేసి యున్నట్లును, నాతఁడు జీవిత సంశయావస్థయందుండి న న్నొకసారి చూడఁగోరుచున్నట్లును మరణకాలమునందలి యాతనియాశను దీర్పవలయు ననియు, నాయు త్తరమున నుండెను. ఆ సేవకుని యిల్లావలివీథియం దుండెను. మరల నాదినముననే వెనుదిరిగి రావచ్చునని యూహించి నేనా తనిం జూచునుద్దేశముతోఁ బోయియుంటిని.

దేవేం: అట్లు యోచించి పోయియుంటివి గాని తిరిగి నీ వాదినముననే యటనుండి మరలిరాలేదు కాదా?

మనో: రాలేదు. మరణావస్థలోనుండి యాతఁడు నన్నుఁ బోవలదని వేడుకొనుటవలన నాఁగిపోవలసినదాన నైతిని. మఱి

నాఁడు మరల నాపహాస నగరమునందున్న యీ పెండ్లి వారి యింటికి వచ్చితిని.

దేవేం : అటనుండి పెండ్లివారి యింటికి నీ వొక్కతెవే బయలుదేరి వచ్చితివా ?

మనో : ఔను.

దేవేం : "బుద్ధిః కర్మానుసారిణీ."

మనో : ఔను. అందువలననే నా కింతటి దురదృష్టము పట్టినది. పెండ్లివారి యింటికిఁ బోవునప్పటికి మూఁడుగంట లయ్యెను. నా కిచ్చిన గదిలోనికిఁ బోయిపరిచారికను పేరు పెట్టి పిలిచితిని.

దేవేం : ఆమె యచ్చట లేదా ?

మనో : లేదు. అట నా కెంతయు నద్భుతముగానుండెను. ఆ మందిరమునందు నే నిదివఱ కెన్నఁడును జూచి యెఱుంగని కాంత నివసించి యుండెను. భ్రమపడితి నేమోయని భావించి క్షమింపుమని యామెను వేఁడుకొని యాగదిలోనుండి వెలుపలకు వచ్చితిని. పెండ్లివారు నాకు విడిదిగా నొసంగిన గృహద్వారమున వినాయకుని చిత్రపట మంటించి యుండెను. వెలుపలకు వచ్చి చూడఁగా నది వినాయకవిగ్రహ మున్నయిల్లే యగుటవలన నేను పొరపాటు పడలేదని నిశ్చయించుకొంటిని. ఇంత లోపలనే యిట్టి మార్పు కలుగుటకుఁ గారణ మేమైయుండును ? అని యాలోచించుచు గొంతసేపటివఱకు నచ్చటనే నిలువఁబడి యుంటిని. పరిచారకునిఁ జూచుటకుఁ బోయి యాదినముననే మరలి రాక పోవుటవలనఁ బెండ్లికి నాతోఁగూడ వచ్చిన పరిచారిక నేనింటికిఁ బోయియుందు నేమో యని భావించి నాపెట్టె మొదలగు వస్తువులను దీసికొని మా యింటికిఁ బోయినదని యూహించుకొంటిని. గృహాధికారిని జూచి యీ సమాచార మడిగితిని. అతఁడు నన్ను గుర్తింపఁజాలక నే నడిగిన మాటలను దెలిసికొనలేక మిగుల

బూర్వము మొట్టమొదట నేమి జరిగినదో చెప్పుము! అది నీచే తిలోనుండి యెట్లు వదలిపోయినది?

మనో: మహానగరమున మాబంధువులయింట వివాహ మగుచుండుటచే పెండ్లికి వారియింటికిఁ బోయియుంటిని.

దేవేం: అలాగా! కొంచెము సేపాఁగుము. మఱియొక మాట: నీవు పెండ్లికిఁ బోయినప్పుడు కుముదిని యెచ్చట నున్నదో నీ వెఱుఁగుదువా?

మనో: బాగుగఁ దెలియదు. వారియిల్లు చేతలామహాలునం దున్నది. ఆమెకుఁగూడ నాపెండ్లివారు శుభలేఖను బంపి యున్నారో, లేదో కూడ నెఱుంగను.

దేవేం: నీవు పెండ్లికిఁ బోయిన యింటివారి స్థితిగతు లేమైన నీకుఁ దెలియునా?

మనో: వారు చాలఁ బెద్దమనుష్యులు. వారిమందిరమున నేను మూఁడుదినము లుంటిని. ఆపెండ్లిలో నాకబలిదినమున నాయింటఁ జాల గందరగోళము పుట్టెను. ఆదినమునందే నాపేర నుత్తరము వచ్చినది. మాతండ్రియొద్దఁ జాలకాలమునుండి పని చేసిన పరిచారకునికిఁ జాల జబ్బుచేసి యున్నట్లును, నాతఁడు జీవితసంశయావస్థయందుండి నన్నొకసారి చూడఁగోరుచున్నట్లును మరణకాలమునందలి యాతనియాశను దీర్పవలయు ననియు, నాయుత్తరమున నుండెను. ఆ సేవకుని యిల్లావలివీథియం దుండెను. మరల నాదినముననే వెనుదిరిగి రావచ్చునని యూహించి నేనాతనిం జూచునుద్దేశముతోఁ బోయియుంటిని.

దేవేం: అట్లు యోచించి పోయియుంటివి గాని తిరిగి నీ వాదినముననే యటనుండి మరలిరాలేదు కాదా?

మనో: రాలేదు. మరణావస్థలోనుండి యాతఁడు నన్నుఁ బోవలదని వేడుకొనుటవలన నాఁగిపోవలసినదాన నైతిని. మఱు

నాఁడు మరల నాపహాస నగరమునందున్న యా పెండ్లి వారి యింటికి వచ్చితిని.

దేవేం : అటనుండి పెండ్లివారి యింటికి నీ వొక్కఁడవే బయలుదేరి వచ్చితివా ?

మనో : ఔను.

దేవేం : "బుద్ధిః కర్మానుసారిణీ."

మనో : ఔను. అందువలననే నా కింతటి దురదృష్టము పట్టినది. పెండ్లివారి యింటికిఁ బోవునప్పటికి మూఁడుగంట లయ్యెను. నా కిచ్చిన గదిలోనికిఁ బోయి పరిచారికను పేరు పెట్టి పిలిచితిని.

దేవేం : ఆమె యచ్చట లేదా ?

మనో : లేదు. అట నా కెంతయు నద్భుతముగానుండెను. ఆ మందిరమునందు నే నిదివఱ కెన్నఁడును జూచి యెఱుంగని కాంత నివసించి యుండెను. భ్రమపడితి నేమోయని భావించి క్షమింపుమని యామెను వేఁడుకొని యాగదిలోనుండి వెలుపలకు వచ్చితిని. పెండ్లివారు నాకు విడిదిగా నొసంగిన గృహద్వారమున వినాయకుని చిత్రపట మంటించి యుండెను. వెలుపలకు వచ్చి చూడఁగా నది వినాయకవిగ్రహ మున్నయిల్లే యగుటవలన నేను పొరపాటు పడలేదని నిశ్చయించుకొంటిని. ఇంత లోపలనే యిట్టి మార్పు కలుగుటకుఁ గారణ మేమైయుండును ? అని యాలోచించుచు గొంతసేపటివఱకు నచ్చటనే నిలువఁబడి యుంటిని. పరిచారకునిఁ జూచుటకుఁ బోయి యాదినముననే మరలి రాక పోవుటవలనఁ బెండ్లికి నాతోఁగూడ వచ్చిన పరిచారిక నే నింటికిఁ బోయియుందు నేమో యని భావించి నాపెట్టె మొదలగు వస్తువులను దీసికొని మా యింటికిఁ బోయినదని యూహించుకొంటిని. గృహాధికారిని జూచి యా సమాచార మడిగితిని. ఆతఁడు నన్ను గుర్తింపఁజాలక నే నడిగిన మాటలను దెలిసికొనలేక మిగుల

నాశ్చర్యముతో “ఇది యేమి? నీవు నాకబలి దినముననే తిరిగి వచ్చి నీ సామగ్రుల నన్నింటిని బండ్లపైన వేసికొని పరిచారికతోఁ గూడఁ బోయియుంటివి కాదా మరల నిప్పు డిట్లగుచున్నా వేమి?” అని ప్రశ్నించెను.

దేవేం: ఆ మాటలు వినుటవలన నీకు మిగుల నాశ్చర్యము కలిగియుండవచ్చును.

మనో: అప్పటి నాయాశ్చర్యమునకుఁ బారమే లేదు. నన్నుఁజూచి యందఱును నవ్వుట కారంభించిరి.

దేవేం: అప్పుడు నీ వేమి చేసితివి?

మనో: భదరపురమున మోహల్లా యందలి మా యానంద కుటీరమునకుఁ దిరిగి వచ్చి చూచితిని.

దేవేం: నీవు వచ్చి చూచునప్పటికి నీ చెల్లెలు కుముదిని నీకుఁ దెలియకుండఁగనే మనోరమనై యాయింటఁ బ్రవేశించి నది కాదా?

మనో: ఔను.

దేవేం: అక్కడివా రెవ్వరును నిన్నానందకుటీరములోనికిఁ బోనీయలేదు కాఁబోలును! నీవు ముందుగా నెచ్చటకుఁ బోయితివి? నిన్నానవాలు పట్టి యాదరించువారు లేకపోయిరా?

మనో: మొదటినుంఁడియుఁ బ్రాణముగాఁ జూచుకొనుచున్న నా సేవకుఁడగు రామగులాము నొద్దకుఁ బోయిచూచితిని. కుముదినిమాట యనిన నాతనికిఁ గిట్టదు. అతఁడు నన్నుఁ జూచిన తోడనే నేనే కుముదినినని భావించి “కుముదినీ! నాయొద్ద నిఁక నీ యధికారములు సాగవు. నీవు మనోరమవే యైనయెడల నీ యుంగరమును జూపింపుము. మునుపటివలె నీ మాయవేషములు నాకడఁ బనికిరావు” అని పలికెను. అప్పుడు నేను నాయుంగరమును జూచుకొంటిని. అది నావ్రేలియందు లేదు.

దేవేం : ఇంతవఱకుం కెన్నఁడు నా యనుంగడను బోలేదు కాఁబోలును!

మనో : లేదు.

దేవేం : తరువాత నీవు కుముదిని నొకసారి దర్శనమీయ వలయునని కోరి యెవ్వరిచేతనైనను వర్తమానమును పంపించి యుండలేదా ?

మనో : లేదు. నేనే పోయి యామెను జూడవలయు నని యెంచి మహాలులోనికిఁ బోవుటకై ముందునకు సాగితిని. అప్పుడు రామగులాము నా కడ్డముగా వచ్చి నిలువఁబడి నన్ను వెనుకకు గెంటివైచి లోపలకుఁ బోయి తలుపు మూసి గడియ వైచుకొని "నిన్ను లోనికి రానీయను" అని బిగ్గరగా గద్దించి పలికెను. దుస్సహ దుఃఖభారముచే నాజ్ఞానమంతయు నశించిపోయెను.

దేవేం : తరువాత కుముదిని వచ్చి నీకు దర్శనమిచ్చినదా?

మనో : లేదు. నన్నుఁ జూచి మాటలాడుట కెంతమాత్రము నంగీకరింప లేదు.

దేవేం : తరువాత నీ వేమి చేసితివి ?

మనో : రామగులాముతో నిరర్థక ప్రసంగముల మూలమునఁ దర్కవితర్కములు సేయ నారంభించితిని.

దేవేం : ఆ మాటలవలనఁ దెలిసికొని రామగులాము నీవే తన కధికారిణివైనట్లుగా నంగీకరించెనా ?

మనో : నే నెంతయో చెప్పితిని. ఎన్ని యెన్నియోదృష్టాంతములఁ జూపితిని. ఏమి చేసినను రామగులాము నమ్మలేదు.

దేవేం : తుట్టతుదకు రామగులాము నీతో నేమని చెప్పెను ? తరువాత నీ వేమి చేసితివి ?

మనో : అతఁడు మొదట నేను చెప్పినమాటల నన్నిటిని నెమ్మదిగా విని క్రమక్రమముగాఁ గోపము జెందినన్నుఁ గూర్చి "కుముదినీ ! నీటక్కరితనము నా యెదుటఁ జూపింపవలదు. ఈ

రామగులాము వెఱ్ఱివాఁడై నీకపట తంత్రములలో నింకను బడి పోవునని తలంపవలదు. నీవు చాలచోటుల చాలమందికడ మనో రమ వలె నటించుచు నమ్మకము గలుగునట్లు సంచరించుచుంటి వని మామనోరమ నాతోఁ జెప్పియున్నది. నీ వెంతగాఁ గొట్టు కొనినను, నేను లోనికి రానిచ్చువాఁడను గాను.'' అని చెప్పెను. ఆతని మాటలవలన నా మనసు చెదిరిపోయినది.

దేవేం : కులగోత్రములు తెలియని యామూఁడవ కాంతను గందరగోళము పుట్టుటకుముం దెన్నిదినముల క్రిందఁట జూచితివి?

మనో : కొన్ని నెలలకు ముందు.

దేవేం : అప్పు డామె కుముదినియని నీవు భ్రమించునట్లు నటించినది కాదా ?

మనో : ఔను.

దేవేం : ఆమె నీ చెల్లెలగునో, కాదో, యనుసంగతిని బరీక్షించుకొనుటకు నీ చెల్లెలు జబ్బుతో మందిరమున నున్నదియో, లేదో తెలిసికొని రావలయునని రామగులామును బంపియుంటివి కాదా ?

మనో : ఔను.

దేవేం : రామగులాము మరల వచ్చి కుముదిని యింటి యందున్న సంగతినిగూర్చి నీతోఁ జెప్పియున్నాఁడా ? ఆతఁడు ప్రత్యక్షముగాఁ జూచియే వచ్చియుండునా ?

మనో : ఆతఁడు నా చెల్లెలి నింటియొద్దఁ బ్రత్యక్ష ముగాఁ జూచి వచ్చినట్లు నాతోఁ జెప్పియున్నాఁడు.

దేవేం : రామగులాము ప్రభుభక్తి విషయమై యెప్పు డైన ననుమానము కలిగినదా ?

మనో : లేదు.

దేవేం : రామగులాము వెనుదిరిగి వచ్చినతరువాత నిన్ను ''అక్కా'' అని పిలిచినమూఁడవయువతి కేవలము కపటనటనము

చేసినదని నీకు బాగుగ బోధపడినది కాదా? అప్పుడు నీ వామె నేమి చేసితివి?

మనో: ఆపూఁడువ కాంతను నాయొద్దకుఁ బిలిచితిని. ఆమె చాల నేర్పరి. ఆమె కపటనటనమునుగూర్చి దృష్టాంతరములను జూపించితిని. అందుల కామె నా మొగమువంకఁ జూచుచు నూరక నవ్వసాగెను. రామగులామును బిలిచి యామె యెదుట నిలువఁబెట్టి యెల్లసంగతులును జెప్పించితిని. అందుల కామె చిఱునవ్వు నవ్వెను.

దేవేం: ఆమె యట్లు నవ్వి యేమైనను జెప్పినదా?

మనో: ప్రత్యుత్తరమీయ లేదు.

దేవేం: సరియే. కట్టకడపట నీ వెక్కడకుఁ బోయితివి?

మనో: తుద కాపూఁడవకాంత నన్నుఁ జూచి "అక్కా! నీవు నన్ను నట్టిదానినిగాఁ జేసితివి. కానిమ్ము. నీసేవకుని మాటయే నిజ మని నమ్మితివి. నే నేమి చేయఁజాలుదును? నీ విప్పుడు మహైశ్వర్యముతో నున్నదానవు. నేను కాసుకు గతి లేని నిరుపేదరాలను. సంపన్నురాల వగు నిన్ను నేను బంగరు కొండగాఁ జూచుకొనుచు సంతోషించుచుంటిని. ఇప్పు డది యంతయును వదలిపోయినది" అని యేమేమో చెప్పెను.

దేవేం: అప్పు డామె మాటలను విని రామగులా మేమైనఁ జెప్పెనా?

మనో: ఆతనికిఁ జాలఁ గోపము వచ్చినది. నేను కొంచెము శాంతింపఁ జేయుటచే నామె యటనుండి వెడలిపోవు వఱకును జూచుచు నూరకుండెను. తరువాత నాతఁడు నాతో "అక్కా! నాకుఁ గోపము వచ్చినప్పుడు నీ వేమియును నన్నడ్డగింపక యూరకుంటి వేని నే నాదురాత్మురాలిని నీకన్నులయెదుటనే నాకరవాలమున కెర చేసి నేనును ప్రాణములు విడిచి స్వామి ఋణమునుండి విముక్తి నంది యుందును" అని చెప్పెను.

అంతకోప మొంటులకుఁ గలిసిన దని యడిగితిని. రామగులాము "అమ్మా! నీ వేపాపము నెఱుంగవు, ఇందలి రహస్యము నీ కేమియు దెలియదు, ఈ మోసకత్తెయు నాకుముదినియుఁ జేరి యిట్టికపటతంత్రములను పన్నుచున్నా"రు అని చెప్పెను.

దేవేం: రామగులాము చెప్పినమాట ముమ్మాటికిని సత్యమైనది.

మనో: నీ వీసంగతి నెవ్వరియొద్ద నైనను జెప్పవల దని కట్టడ చేసితిని.

దేవేం: ఇది యంతయును నీవు భూకైలాసనగరమునకుఁ బోయిన తరువాత జరిగి యుండవచ్చును. అక్కడ నాయింటి వారితో నేమైన నీవు చెప్పియుంటివా?

మనో: లేదు.

దేవేం: మనోరమా! అదియే కపట తంత్రముల కారంభదినము. ఆయిరువురిలో నొక కాంత మూర్ఛరోగము వలనఁ జచ్చిపోయి యుండును. కుముదినియు నా మూఁడవయువతి యును గలసి యెల్లవిధముల నీకు వ్యతిరేకముగా నింతటిదారుణ కృత్యము నతి నిపుణముగ నతినిగూఢముగ నెఱపియున్నారు. నీద్రవ్యము నెట్లయిన నపహరించి వారిద్దఱు సమానముగఁ బంచుకొను నుద్దేశముతో నీదుస్తంత్రమును బన్నియున్నారు. ఆ యిరువురిలో నతిసాహసికయు, నతి చతురికయు, నగు కాంత యాధనమంతయు దా నొక్కతెయే యనుభవింపదలఁచి మఱి యొకకాంతను విషప్రయోగమునఁ జంపివైచి యుండును. వారలదుస్తంత్రముల నన్నిటిని రామగులాము బాగుగఁ గను పెట్టి యున్న ట్లనుమానము కలిగినప్పుడు తమ దుర్వ్యాపారము నంతను నాతఁడు బయలుపఱుచు నేమో యనుభయముచే నాతని వారిరువురును మొట్టమొదటనే చంపివైచి యుందురు.

మనో: కావచ్చును.

దేవేం : ఒకానొకపాపకార్యమును జేయుట తటస్థించి నప్పుడు దాని నెటులైన మఱుఁగుపఱుచుటకు మఱియొక పాప కార్యము జేయ ప్రవృత్తి గలుగుచుండును. అట్టివానికిఁ దమవయ సుతోఁ గూడఁ బాపాచరణమునందలి బుద్ధియును గ్రమక్రమ ముగా వర్ధిల్లుచుండును. నీచెల్లెలో కాక యా మూడవకాంతయో రామగులామును బరలోకమున కతిథిగాఁ జేసియుండును. ఆకాం తయే క్రమముగా సాధన సంతయును దానే యనుభవించు దురుద్దేశముతో మిగిలిన కాంతను గూడఁ జంపియుండును.

దేవేం : ఇప్పుడు నీ కడుగడుగున మహావిపత్తు సంభవింప నైయున్నది.

మనో : అయ్యో! అధిక మైనవిప త్తింక నేమియున్నది ?

దేవేం : నీవు వైద్యశాలనుండి తప్పించుకొని వచ్చిన సంగతి యందఱకును దెలిసిపోయినది. ఎటులైనఁ బరిశోధించి నిన్ను మరలఁ బట్టుకొని చెఱసాలలో నొప్పగించుటకై కొందఱు వెదకుచుందురు. నీవు మరల వారి చేతులలోఁ జిక్కుదువేమో !

మనో : నేను వారి చెఱనుండి బయలుపడితి ననియే తలంచుచుంటిని.

దేవేం : ప్రకృతమున నీవు నామందిరమునం దుండవల యును. మఱియెక్కడకును బోఁగూడదు.

మనో : ఇంతకంటెఁ గావలసిన దేయున్నది ?

దేవేం : నీవు మాయింట నాభార్యతోఁగూడ నుండుము. రేవతి నిన్నుఁ దనచెలిమికత్తెయుంబోలెఁ జూచుకొనుచుండును. నిరపాయముగా నుండవచ్చును. మఱియెట్టి తొందరలును గలుగఁ జాలవు. నీతోఁగూడ నేమైనసామగ్రులను దీసికొనివచ్చితివా ?

మనో : బట్టలమూటమాత్ర మున్నది.

దేవేం : ఏది ?

మనో : మీ యింటికి వచ్చుటకు ముందామూటను జగు బాబుబజారున సత్రములో బెట్టి యుంటిని. రెండు దినములు నాకు భోజన మైనను దొరకలేదు. బంధుగులు లేరు. కావున నీదినము సత్రమునకుఁ బోయి భోజనము చేసియుంటిని.

దేవేం : ఆ బట్టలమూటయందు విలువగల వస్తువు లేవైన నున్నవా ? వట్టిబట్టలేనా ?

మనో : బట్టలుమాత్రమే.

దేవేం : అట్లయినయెడల నాబట్టలమూటను మరలఁ దెసికొని రావలసినపని లేదు. దాని నచ్చటనే యుండనిమ్ము ! నీకు గావలసినవన్నియును మాయింటియందే దొరకఁగలవు. ఈసరి కప్పుడే శత్రువులు నిన్ను వెదకికొనుచు నూరు వేషములతో నలుదిక్కులను దిరుగుచుందురు. నీబట్టలమూటమాత్రమే యచ్చట పడియుండుటవలన నీ కేదియో ప్రాణాపాయము సంభవించియుండు నని భావించుకొని నీ ప్రతిపక్షులు తమ కార్యము నుండి నివృత్తులై పోయినను పోవచ్చును. "17, క," అను గుఱుతుగల పత్రసంపుటము నందు నీధనమును గూర్చి యెట్టి దృష్టాంతములు కలవో నీవు చెప్పఁగలవా ?

మనో : నా కేమియును దెలియదు.

అప్పుడు దేవేంద్రుడు రేవతిని బిలిచెను. ఆమె వచ్చిన తోడనే మనోరమ నామె కొప్పగించి " ఈ యువతిని నీచెల్లెలి పోలికఁ జూచుకొనుచు నీమె కెట్టిలోపమును గలుగకుండ నుపచరించుచుండవలయును. " అని చెప్పెను.

పరిహాసప్రియురా లగు రేవతి " మీరీమె నెట్టి వావివరుసలతోఁ జూచుకొనుచుందురు ? " అని యడిగెను.

దేవేంద్రుఁడు చిఱునవ్వు నవ్వుచు " కేవలము పరిహాసము ! నీకు వయసు హెచ్చినకొలఁది చిన్నతనము ముదురు చున్నది. ఈమెను నీవు చెల్లెలిగాఁ జూచుకొనుటకు సందేహింతువేని నా చెల్లెలిగఁ జూచుకొనుచుండెదను." అని చెప్పెను.

౨

దేవేంద్రునకు చెల్లెలి కుమారుఁడగు శచీంద్రుఁడు దేవేంద్రునకు దక్షిణ హస్తముంబోలి తోడుపడుచుండును. అతని కిప్పుడు పందొమ్మిదేండ్లు.

దేవేంద్రుఁడు వెలుపలకు వచ్చి శచీంద్రునిం జూచి "శచీంద్రా! ఎల్ల సంగతులును బోధపడినవా? ఆమె చెప్పిన మాటల నన్నిటిని బాగుగ వినియుంటివా?" అని ప్రశ్నించెను.

శచీంద్రుఁడు నవయౌవనుఁ డగుటచే మనోరమ మనోహరాకారముం గాంచి యటనుండి కదలలేకపోయెనో, కాక యా సుకుమారి దురవస్థంగూర్చి జాలిచెంది యా విషయమునఁ దన శక్తికొలఁది సాహాయ్యము చేయు నుద్దేశమున నామె వృత్తాంతము నామూలాగ్రముగ వినఁ గుతూహలముతోఁ దానావలకుఁ బోవఁజాలక పోయెనో గాని, వెలుపలనుండి యెల్ల సంగతులను సావధానముగ నాలకించుచుండెను. వెలుపల నిలిచియున్న యాతనిని మనోరమ చూచినదో చూడలేదో కాని, దేవేంద్రుడు మాత్ర మాతనిఁ జూచియుండెను. అప్పుడు శచీంద్రుఁడు మేనమామతో "సంగతులను బాగుగ వింటిని" అని చెప్పెను.

దేవేం: నీకేమి పొడకట్టినదో చెప్పుము.

శచీం: ఇదమిత్థమని నిర్ణయించుట కసాధ్యముగా నున్నది.

దేవేం: ఈ మనోరమ పిచ్చిదేయని నీ కనుమానము కలుగుచున్నదా?

శచీం: సరి సరి! నే నెంతటి పిచ్చివాఁడనో, యామె కూడ నంతటి పిచ్చిదియే.

దేవేం: ఖిదరపురమున మోహల్లాయందలి యానంద కుటీరమున నిప్పుడు నివసించుచున్న యువతి యెవ్వతెయో నీ

గ్రహించి తెలుపఁగలవా? ఆమె మనోరమ చెల్లెలు కౌముది నియా? కాక కులగోత్రములు తెలియని మూఁడవ కాంతయా? పోనీ. ఆ ముగ్గురు కాంతలలో మరణించినది యెవ్వతెయో యూహించి చెప్పుము.

శచీం: బాగుగ యోచించి తీర్మానింప వలయును.

దేవేం: పోనిమ్ము. విషప్రయోగ విషయమున నీ యభిప్రాయ మేమి?

శచీం: మనోరమ మాటలు సత్యమే యైనవని నా విశ్వాసము.

దేవేం: నాకుఁగూడ నట్లే తోఁచుచున్నది. రామగులామునకు నా కాంతకు జబ్బు చేసినప్పుడు వారల కౌషధము నిచ్చిన వైద్యునిగుఱించి ముందుగఁ దెలిసికొనవలసి యున్నది.

శచీం: ఇది ముఖ్య కార్యము.

దేవేం: ఆ కార్యమును నిర్వర్తించు భారము నీపై నున్నది. రేపటి సాయంకాలము నీవు నన్నానంద కుటీరమునొద్దఁ గలిసికొనవలయును. నీ కొఱకు వేచియుండెదను.

శచీం: సరే.

శచీంద్రుఁడు మలినములై చినిఁగిపోయిన బట్టలను కట్టుకొని పశ్చిమదేశ వాసునివలె వేషము దాల్చి చోలాకిలా లను పేరు పెట్టుకొని కార్యము నిర్వహించుటకై బయలుదేరెను. దేవేంద్రుఁడు ముసలిరైతు వేషమును ధరియించి—మనోరమ పక్షమున నున్నట్లు నటియించి మోసముచేసిన న్యాయవాది యగు తులసీదాస వసు మహాశయుని యింటివైపునకు బయలు దేరెను.

# రెండవ భాగము

## ౧

భవానీపురమున మొహల్లాలో కంచరి వీథియందు న్యాయవాది తులసీదాసు మందిర మున్నది. దేవేంద్ర విజయమిత్రుఁడు ముదుసలి కృషికవేషముతో నచ్చటికిఁబోయి చూడఁగా తులసీదాసు మాత్రమే కూరుచుండి యుండెను. దేవేంద్రుఁ డాతని యొద్దకుఁ బోయి "తులసీదాస మహాశయులు మీరేనా? మీరేనా న్యాయవాదులఁట!" అని యడిగెను.

తుల: ఔను. నీ కేమి పని?

దేవేం: మంచిదయ్యా! నే నొక విధమైన కష్టమునకు లోఁబడి మీ పాదములకడకు వచ్చితిని. మిమ్ములను చూచిన తోడనే నాకు సాక్షాత్తుగఁ బరమేశ్వరునిఁ జూచినట్లున్నది. మా యూరివాఁడు వీరశాంతప్ప మిమ్ములను గూర్చి నాతో నెన్ని సంగతులో చెప్పియున్నాఁడు.

తుల: కావచ్చును. నీ పేరేమి?

దేవేం: శాంతప్ప. మా తండ్రి దొడ్డశాంతప్ప. ఆతని తండ్రిపేరు ముదిశాంతప్ప. ఆతని యబ్బ పేరును ముదిశాంతప్పయే. ఆతని తండ్రి నాకు ముసలితాత. ఆతఁడు ముసలితాత యన్నంత మాత్రమున నేమి లాభము? ఆతని పేరేమో నాకు జ్ఞప్తికి వచ్చుటలేదు. మా తాతకుఁ దండ్రితండ్రి. ఏమో యాతనిఁ జూచిన వా రెవ్వరు? మా ముత్తాత తండ్రి పేరు——

తుల: ఆఁగు మాఁగుము. నీ వంశావళి వర్ణనముతో నా కేమియును బనిలేదు.

దేవేం: పనిలేదా? అట్లయినచో నే నూరక చెప్పినంత మాత్రమున నేమి లాభమున్నది? అక్కఱ లేదా? అయ్యో!

జనులకుఁ బిచ్చి పట్టినయెడల వారి కౌషధము నిచ్చి బాగుచేయు మహాత్ములు మీరేనా? అట్టి వైద్యశాస్త్ర పండితులు పిచ్చి వాండ్రకు వస్త్రాములవలె నగపడుచుందురు కాఁబోలును! వారు పిచ్చివాండ్ర నందఱను బాగుగ శిక్షించి యారోగ్యవంతులుగాఁ జేయుచుందురు. మంచిదయ్యా! మీరు చిరంజీవులై యుండుఁడు. ఇప్పుడప్పుడు పిచ్చివాండ్రు తెలియక మీవంటివారినిఁగూడఁ దమ కాలుసేతులతోఁ దన్నుచుందురఁట కాదా!

దేవేంద్రుఁ డతి సరళముగ యుక్తియుక్తముగ నడిగిన ప్రశ్నములలోని యంతరార్థము కొంచెమైనను వెలువడుట లేదు. పల్లెటూళ్లయందు నివసించు రైతులపోలికనే స్వభావ సిద్ధముగ నాతఁడు మాటలాడుచున్న ట్లగపడెను. ఆతని మాటలను విని తులసీదాసు కొంచె ములికిపడియెను. ఆకస్మికముగ నాతని కొక సంగతి స్మృతికి వచ్చియుండెను. దేవేంద్రుఁడు తులసీ దాసు హృదయ భావమును బాగుగఁ దెలిసికొనఁ గలిగెను.

అప్పుడు తులసీదాసు పిచ్చికుక్కవలె మొఱగుచు మిగులఁ గోపముతో నసహ్యించుకొనువానివలె దేవేంద్రుని జూచి "అందు వలని నీకుఁ బ్రయోజన మేమున్నది? ఈ యసందర్భ ప్రలాపము వలన లాభమేమి?" అని పలికెను.

దేవేం: నాకుఁ బ్రయోజన మేమున్నదని సెలవిచ్చు చున్నారా? ఏమియును పని లేకుండఁగనే మీ యొద్దకువచ్చి మాటలాడుచుంటి ననుకుంటిరా? నాకొక కుమార్తె యున్నది. నా దురదృష్టమువలన నామె పిచ్చిదై పోయినది. మాయూరి వీరశాంతప్ప నాతో నిట్లు చెప్పియున్నాఁడు. "నీవు పోయి యా ప్రభువువారిని చూచి—"

తుల: ఇప్పుడు నీ వెక్కడ నివసించుచున్నావు?

దేవేం: ఈయూరికిఁ గొలఁది దూరమున పల్లెలో నా యిల్లున్నది. మా వీరశాంతప్పవలనఁ గొన్ని సంగతులు తెలియ

నచ్చినవి. ఎవ్వతెయో పిచ్చిది మా యూరికి వచ్చి "ఆనంద కుటీరము నాది" అని కేకలు వైచుచు వీథులవెంట నేడ్చుచుఁ దిరుగాడుచున్నది; నీవు పోయి చూచిరమ్ము." అని నాతో చెప్పియున్నాడు. అయ్యా! నాదొక మనవి యున్నది, ఆల కించెదరేని చెప్పుకొనియెదను. ఆ యధికారులు మీరేనా? ఆ నా వెఱ్ఱి యాఁడుబిడ్డకు——

తుల : ఆ పని నావలనఁ గాఁదగినది కాదు, నేను వైద్యుఁడను గాను.

దేవేం : అయ్యా! మీ రింతమాత్ర ముపకారము చేయఁ జాలరా? ఏమి నాయనా!

తుల : అది నాపని కాదు.

దేవేం : మా వీరశాంతప్ప నాతో నా విధముగా నెందుకుఁ జెప్పెను! ఈ పని మీ మూలముననే కావలయును. దయ యుంచి నా మనవి వినుఁడు. నా ప్రార్థనమును వ్యర్థముగాఁ ద్రోసివేయకుఁడు! మీ పాదములు పట్టుకొనియెదను. పేద రైతును రక్షింపవలయును.

తుల : మీ వీరశాంతప్ప కేవల మసత్యము జెప్పి యున్నాఁడు. కావలసి యున్నయెడల నీవే స్వయముగా డాక్టరు గారి యొద్దకుఁ బొమ్ము. అప్పుడువారు నీ బిడ్డ రోగమును బాగు చేయగలరు. నేను డాక్టరునుగాను, న్యాయవాదిని. వైద్యశాస్త్ర సంబంధములగు పనులేవియును నాకుఁ దెలియవు.

దేవేం : ఓహో! ఎంతమాట యంటిరి? వీరశాంతప్ప కేవల మసత్యవాదియా? టక్కరిగాఁడా? ఆతని సంగతి మీకుఁ దెలియ కుండుటచే నిట్లు పలుకుచున్నారు.

తుల : నిజముగా నాతఁడు బూటకములాడువాఁడని నేను చెప్పఁగలను.

దేవేం: అట్లయిన మీకేల నాక్షేపణచేయుచున్న మీ రెందులకుం జెప్పు—

తుల: అయినచో నిన్ను జైలుసాలకు నే నెందులకుం బంపించితిని? అట్లు చేసినవాఁడను నేను గాను. అది యంతయును డాక్టరు గారికిఁ దెలియును. ఆకాంత పిచ్చిది యని చెప్పుటకు మాత్రము నేను సాక్షిని. ఇంతకంటె నితరసంగతు లేవియును దెలియవు.

దేవేం: అయ్యా! ఆయాఁడుబిడ్డ నిశ్చయముగాఁ బిచ్చిది కాదా? ఆసంగతి మీకు బాగుగఁ దెలియునా?

అప్పుడు పరధ్యానముగా నేమో యాలోచించుకొనుచున్న తులసీదాసు మాటకు బదులుగా 'ఆమె నిజముగాఁ బిచ్చిది కాదు' అని చెప్పెను.

దేవేం: ఆమె నిజముగాఁ బిచ్చిది కాదా? అట్లయినచో పిచ్చిదని వ్రాయుట యెందులకు?

తుల: ఔను, ఔను, కాదు కాదు, పిచ్చి కాక మఱి యేమి? నీ విటనుండి వెడలిపొమ్ము. నాకుఁ జాలఁ దొందరపను లున్నవి. నీగోడవలతో నాపను లన్నియును జెడిపోవుచున్నవి. నీతో మాటలాడుచుండుటకు నాకుఁ దీరిక లేదు.

దేవేం: మీకుఁ బనిలేనిసమయ మెప్పు డుండును? దయయుంచి యింకొకమాట వినవలయును.

తుల: ఇప్పుడు సమయము కాదు. సరే. ఒక్కమాట యంటివి కాన నది యేదియో చెప్పి పొమ్ము.

దేవేం: ఆ డాక్టరుదొరవారిపే రేవ రయ్యా! దయయుంచి కొంచెము తెలుపఁగోరెదను. నాయాఁడుబిడ్డ బిచ్చిదై పోవుటచే నామెకొఱకు కూరాకుఁ దిరుగుచుండుటవలన నాచేతి సొమ్ము వెచ్చపడిపోయినది. నా కిప్పుడు పొట్టకూటికి గతి లేదు. నాదురదృష్టము!

తుల : నీదురదృష్టమునకు నే నేమి చేయఁగలను? శాస్త్రులుగారి పే రేమియో తెలియదు.

దేవేం : అయ్యా! మీకే తెలియకుండునా? మీపాదములపైఁ బడియెదను. దయయుంచి తెలుపవలయును.

తుల : నీవు పిచ్చివాఁడవుగా నగపడుచున్నావు. నీతోఁ మాటలాడుచు వ్యర్థముగాఁ గాలహరణము చేయుటకు నేను పని లేనివాఁడను గాను. వెడలి పొమ్ము.

దేవేం : పోక యేమి చేయఁగల నయ్యా! పేదనైతిని— దొరను కాను గదా—

తుల : నీ ముఖము! రాచపిసాచివలె నీ వెక్కడ దాపురించితివి! పొమ్మని చెప్పుట లేదా? ఇప్పుడు నీమాటలు వినుటకు సమయము కాదు. నాకుఁ బనియున్నది.

ఇట్లు చెప్పి తులసీదాసు డంబముతోఁ లేచి నిలువఁబడియెను. ఆతఁడు చాలఁబొడవు బలము గలవాఁడు.

దేవేం : ఇప్పుడే పోవలయునా?

తుల : ఇప్పుడే, ఈ నిమిషమునందే.

దేవేం : నే నొక్కఁడను గదా వచ్చి మీయొద్ద నెట్లు కూర్చుండఁగలను? మీరు చాల ధనవంతులు. నాయొద్ద కాసైనను లేదు. నేను కూరుచున్నయెడల మీ కేమి లాభ మున్నది? ఎవ్వఁడైన వర్తకుఁడు గాని, ధనవంతుఁడు గాని, యుద్యోగస్థుఁడు గాని వచ్చినయెడల నాతనితోఁ మీరు "దయ చేయుఁడు" అని చెప్పి నెత్తిమీఁదనైనఁ గూర్చుండఁ బెట్టుకొందురు.

తుల : నీవు నాయెదుటనుండి యావలకుఁ బోనిచో నీమెడఁ బట్టుకొని గెంటివైచెదను. నెమ్మదిగా నావలకుఁ బొమ్ము.

దేవేం : అది యెందులకు? నామెడమీఁదఁ జేయి వైచుటకు నేను దొంగతన మేదైనఁ జేసియుంటినా? మఱి యే నేరము నైనఁ జేసియుంటినా? ఏల నన్నింత నీచునిగాఁ

కలఁచుచున్నారు ?

తుల : నేను నీతో నైదాఱుసారులు చెప్పియున్నాను. నాకుఁ జాల విసుఁగు కలిగించుచున్నావు. నీ వెంతమాత్రము నిట నుండఁగూడదు. నా పనుల కన్నిటికి నభ్యంతరము కలుగుచున్నది. వేగముగ నావలకుఁ బొమ్ము.

దేవేం: ఈయొక్కమాటయును వినవలయును. కొంచెము సేపోపిక చేయరాదా? ఇందువలన మీకుఁ గలిగిననష్ట మేమున్నది?

తుల : నీయుంతన నీవు పోవని తోఁచుచున్నది. మెడ పట్టుకొని గెంటివేయువఱకు నీకు నాసంగతి బోధపడదు.

దేవేం : నామెడపైఁ జేయి వైచి గెంటివేయుదురా? అప్పుడు మీరు నిలువఁగలరా ?

తుల : కొట్టెదవా యేమి ?

దేవేం : ఎంతమాట యంటిరి! నాకుఁ దిరుగుడురోగ మున్నది. మీ యర్థమునం దది మూర్ఛరోగము. ఎవ్వరైన నితరులు నన్ను ముట్టుకొనినతోడనే నా కాజబ్బు వచ్చుచుండును. మీరు నామెడ పట్టుకొని నిలువఁజాలుదురా ?

"వదరుబోతా! దూరముగఁ బొమ్ము!" అని కేకలు వైచుచు తులసీదాసు కోపముతో నాతనిపైఁ బడియెను. అంతకు ముందే సిద్ధముగనున్న దేవేంద్రుడు తనమెడపైఁ దులసీదాసు చేయి పడినతోడనే యాచేయి పట్టుకొని తులసీదాసును గిరగిర ద్రిప్పి పైకెత్తి విసరివైచెను. మిగులఁ బొడవుగ నున్న యా తులసీదాసు చుట్టఁ జుట్టుకొనిపోయి గదిలో నొకమూలఁ బడియెను. తల తిరిగిపోవుటచేఁ గొంతసేపటివఱకుఁ దులసీదాసుకు లేచుటకుఁగూడ శక్తిలేకపోయెను.

దేవేం : అయ్యో! నే నింతకుముందే చెప్పితిని గాదా? నా తప్పిద మేమి యున్నది? నామూర్ఛరోగమునుగూర్చి విని

యును, మూచియునుండక నిట్లు తొందరపడితిని. నే నేమి చేయుదును? అయ్యా! మీ రధికారులు, మేము పొలము దున్నుకొను పేదరైతులము. క్షమింపవలయును. మరల రేపు వచ్చి దర్శనము చేసికొందును.

ఇట్లు చెప్పి దేవేంద్రుఁడు తలుపులకడ వచ్చెను. తలుపుల ముంగిటిలోనికి వచ్చినతోడనే మేలిముసుంగు వైచికొనియున్న యొక కాంత యాతలుపులనుండి యాతనిప్రక్కనే లోపలకుఁ బోవుచు నాతనిని జూచి "ఇది యేమి! వింతగా నున్నది. ఈతఁడు దేవేంద్రవిజయమిత్రుఁడు కాఁడా! ఇక్కడ నీతని కేమి పని యున్నది?" యనుకొనియెను.

౨

అవకుంఠనవతి తులసీదాసుని యేకాంతమందిరమునకుఁ బోయి తలుపులు మూసికొని తులసీదాసును పిలిచి "ఇంతవఱకు మీతో మాటలాడుచున్న యాతఁ డెవ్వఁడు?" అని యడిగెను.

మిగుల శ్రమపడి మెట్లో మీఁది కెక్కిన యాతులసీదాసు నిట్టూర్పు విడుచుచు "ఎవ్వఁడో పేదరైతు వచ్చియున్నాఁడు. ఆతఁడు నాతో నేమియో యసందర్భసంభాషణముచేసి యున్నాఁడు" అని చెప్పెను.

స్త్రీ: ఎవరు?

తుల: పేదరైతు. మనయూరికిఁ గొలఁదిదూరమున పల్లెటూరివాఁడు.

స్త్రీ: ఆలాగా? ఆతనికి మీయొద్దఁ బని యేమైన నున్నదా? ఊరక మీదర్శనముకొఱకే వచ్చియుండెనా?

తుల: ఆతనికిఁ బిచ్చికూఁతు రొక్కతె యున్నది. ఆబిడ్డ చికిత్సకొఱ కేదైన నేర్పాటు చేయవలసి వచ్చియున్నాఁడు.

అతనికాఁతుఁడు కిచ్చినది యేమియో నాకు తెలియదు కాని యాతఁడు మాత్రము తప్పక యాతనికొఁతురకంపెను బిచ్చివాఁడు.

స్త్రీ: మీ యిరువురిలోనను దూరదృష్టి యెంతమాత్రమును లేని మీరే పిచ్చివా రైపోయితి రని నాకుఁ దోఁచుచున్నది.

తుల: అది యేమి?

స్త్రీ: ఆసంగతిని మీకుఁ దరువాతఁ జెప్పెదను. మొట్టమొదట నే నడిగిన ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరము చెప్పుఁడు. ఆతఁడు మీయొద్దకు వచ్చి ప్రప్రథమమున ని మ్మే మని యడిగెను?

తుల: ఇప్పుడు నీతోఁ జెప్పలేదా? ఆ సంగతినిగూర్చియే నాతో మాటలాడియున్నాఁడు.

స్త్రీ: తనకెవరైనను వైద్యుని కొప్పగింపవలయు నని కాదా వచ్చియుండెను? మీయొద్దకు రావలసిన పని యేమున్నది?

తుల: అతనిమిత్రుఁ డొకఁడు ముందుగా నన్నుఁ జూడవలసినదని యాతనితోఁ జెప్పియున్నాఁడట. అతనికి మనోరమ వృత్తాంతమంతయును దెలిసియుండవచ్చును.

స్త్రీ: నేనుగూడ నట్లె యూహించుచున్నదానను. ఇప్పుడు నీయొద్దకు వచ్చిన పెద్దమనుష్యుఁ డెవ్వరనఁగా–నిశ్చయముగా దేవేంద్ర విజయమిత్రుఁడు,

ఆమాట వినినతోడనే తులసీదాసు చిత్రప్రతిమవలె స్తంభితుఁడై పోయెను. ఆశ్చర్యము, భయము, సందేహము, కోపము మొదలగు మనోభావము లేకకాలముననే యాతని వదనమండలమునఁ బ్రకటితము లగుచుండెను.

తుల: అతఁడు దేవేంద్ర విజయమిత్రుఁడై యుండు నని నీ వెట్లు తెలిసికొనఁ గలిగితివి?

స్త్రీ: సూక్ష్మదృష్టితో బాగుగ నాలోచించి.

తుల: నీ వాతని నెప్పుడు చూచితివి?

స్త్రీ: అతఁడు ముంగిట నిలువఁబడియున్నప్పుడు చూచితిని. ఆ వ్యక్తిఁడు తన రూపమును మఱుఁగుపెట్టుకొని మాఱువేషమును ధరియించియున్నట్లు నే నెన్నఁడు చూచియుండలేదు, ఏ కారణము వలన నాతఁ డట్టివేషమును దాల్చియుండెనో నాకుఁ దోఁచుట లేదు.

తుల:—నీ నిర్ధారణమునం దేమియును పొరపాటు లేదు గద? అతని నీవు బాగుగ గుర్తించితివా?

స్త్రీ: నేను తెలిసికొన్నదానిలో లేశమైనను పొరపాటు లేదు. నిజముగా నాతఁడు దేవేంద్రవిజయుఁడే.

తుల: కావచ్చును. నీ వెంతమాత్రమును పొరఁబడియుండలే దనియే నిశ్చయించుకొందము. కాని, యాతఁడు నిన్నెప్పుడైనఁ జూచియుండెనా?

స్త్రీ: లేదు.

తుల: అతఁ డేయుద్దేశముతో నాయొద్దకు వచ్చియుండునో నీ వూహించి తెలుపఁగలవా?

స్త్రీ: బుద్ధి యను నమూల్యపదార్థ మొక్కింతైనను మీకలలో లేనట్లు స్పష్టముగాఁ దోఁచుచున్నది.

తుల: నీమాటలవలన నాహృదయము చెదరిపోవుటచేఁ గింకర్తవ్యతామూఢుఁడనై యేమియు నెఱుఁగజాలకున్నాఁడను. దయయుంచి నీకుఁ దోఁచినదానిని చెప్పుము.

స్త్రీ: గంట ముందుగా మిమ్ముఁ జూచుటకు వచ్చినయెడల నాతఁ డిచ్చటకు వచ్చు గారణ మేమైయుండునో తనంతఁ దానే బయలుపడియుండును. అప్పుడు మీరును జాగరూకతతోడనే యుందురు.

తుల: నీమాటల కర్థ మేమియో బోధపడుట లేదు.

స్త్రీ: ఆతఁడు మిమ్ముల నెంతవఱకు మూఢునిగాఁ జేయవలసియుండునో యంతవఱకును జేసి తనదారిని పోయియున్నాఁడు.

తుల : అది యేమి ? ఏమి జరిగినది ? నాకేమియును దెలియకుండ నున్నది.

స్త్రీ : ఆమె పాఱిపోయినది.

తుల : ఎవ్వరు ?

స్త్రీ : మనోరమ.

తుల : మనోరమ పాఱిపోయినదా! ఎప్పుడు? ఎట్లు పాఱి పోయినది ? చాల వింతగా నున్నదే!

స్త్రీ : నాలుగుదినము లైనది. మిగులఁ జాతుర్యముతోఁ దప్పించుకొని పాఱిపోయినది.

తుల : నాకు నమ్మకము కలుగుట లేదు. వైద్యుఁడు గోవిందసేనుఁ డేమిచేయుచున్నాఁడు ?

స్త్రీ : నిద్రపోవుచున్నాఁడు.

తుల : ఆతఁ డామెను పట్టుకొనవలయు నని ప్రయత్నించుట లేదా ? పట్టుకొనుట కవకాశము దొరక లేదా ?

స్త్రీ : లేదు. ఆమె యింకను దొరక లేదు. ఉన్నచోటు మాత్రము తెలియవచ్చినది.

తుల : ఆమె యెచ్చట నున్నది ?

స్త్రీ : ఈ భవానీపురమున మొహల్లాలోపలనే యామె దాఁగియున్నది.

తుల : ఈ గోవిందసేనుఁ డిప్పు డెచ్చట నున్నాఁడు ?

స్త్రీ : ఆతఁడును భవానీపురమునందే యున్నాఁడు.

తుల : ఇప్పుడేమైన నామెసమాచారము తెలియవచ్చినదా ? ఏవైన నాధారములు దొరకినవా ?

స్త్రీ : జగుబజారులో సత్రమునం దొకబట్టలమూట మాత్రము దొరకినది. మనోరమ మాత్ర మెవ్వరికి నగపడలేదు. ఇంకను నామెకొఱకు వెదకుచునే యున్నారు.

తుల : పొరకవచ్చును. ఆమె తనమాట దీసికొని పోవు టకై మరల వచ్చుటకు రాక యుండునా?

స్త్రీ : ఏమో?

తుల : నమ్మకుండుటకుఁ గారణ మే మున్నది?

స్త్రీ : కారణమా? దేవేంద్రవిజయుమిత్రుఁ డిచ్చుటకు వచ్చియుండెను గాదా?

తుల : ఔను. అందువలన నేమి నష్టముగలిగినది?

స్త్రీ : మీరు న్యాయశాస్త్రవేత్తలు. అభియోగరహస్య శోధకులు. ఆమె దేవేంద్రవిజయుని యొద్ద నున్నది. దేవేంద్రుఁ డంతటి మూర్ఖుఁడు కాఁడు. మనోరమ నా మాటకయి పంపు నంతటివిచ్చువాఁడు కాఁడు.

తుల : దేవేంద్ర విజయుఁడు మనోరమయభియోగమును విచారణచేయుటకు స్వయముగాఁ బట్టనుకొని యున్నట్లు నీవు బాగుగఁ దెలిసికొంటివా?

స్త్రీ : అందులకు సందేహము లేదు.

తుల : ఆతఁడు మనోరమను రహస్యముగ దాఁచియుంచి నట్లు నీకు నమ్మకము కలదా?

స్త్రీ : ఔను.

తుల : ఎక్కడ?

స్త్రీ : తనయింటియందే.

తుల : ఆతని యిల్లెక్కడ? నీవు బాగుగ నెఱుంగుదువా?

"ఎఱుఁగుదును" అని చెప్పి మనోరమ యించుక నవ్వి "నే నెఱుంగని విశేషము లేమి యుండును? నలుదిక్కులను నాపైఁ బ్రవాదము వ్యాపించి యున్నను నిర్భయముగ, బహి రంగముగ, స్వతంత్రముగఁ దిరుగాడుచుంటిని. శక్తియే లేని

యెడల నే నీసరికే చెఱసాలలోఁ బడిపోయియుందును. దేవేం
ద్రవిజయుఁడిట్లు చక్రవర్తి వీథియందున్నది,'' అని పలికెను.

తుల : ఇప్పుడు మన మేమి చేయవలెను? నీ కేమైన
నుపాయము తోఁచెనదా ?

స్త్రీ : తోఁచినది యొక్కటియే యుపాయము. ఆమెను
దేవేంద్రునింటినుండి వెలుపలకుఁ దీసికొని రావలయును.

తుల : ఓహో! కష్టసాధ్యమైన పని. దేవేంద్రవిజయుఁడు
సాధారణుఁడు కాఁడని తోఁచుచున్నది. అతని మఱపించుట
మాటలతోఁ గానేరదని తలంచెదను.

స్త్రీ : ఆపని యేమో యంత కష్టమైనదికాదు. ఎట్లయిన
నామనోరమను మఱియొకసారి పట్టితీరవలయును. దైవానుగ్రహ
మువలన నామె దొరకినయెడల మఱియెన్నటికి నామె మననిర్బం
ధమునుండి తప్పించుకొని పోకుండునట్లు తగిన యేర్పాటు
చేయఁగలను.

తుల : చాల బాగుగ నున్నది. మనోరమ దేవేంద్ర
విజయ మిత్రునితోఁ దనసమాచారము నంతను దెలిపి యుండు
నని నీ వభిప్రాయపడుచుంటివా ?

స్త్రీ : అట్లామె చెప్పక పోయినయెడల నాతఁ డిచ్చటకు
వచ్చుట కేమి కారణమున్నది ?

తుల : అతఁడు మిగుల భయంకరుఁడగు నుద్యోగస్థుఁడు.

స్త్రీ : ఆసాహసికుఁ డెల్లప్పుడును భయంకరుఁడే.

తుల : ఒక్కసారి యాతనిమందిరమునుండి మనోరమ
నెట్లులైనఁ దప్పింపగలుగుదు మేని మన మిఁక భయపడవలసిన
పని యేమియు నుండదు.

స్త్రీ : ఎట్లు లేకుండును? తరువాత హత్యనుగుఱించిన
విచారణలు జరుగుట తటస్థించును.

తుల : హత్య యనుచుంటి వేమి? మనోరమను హత్య
చేసెదవా? నిజముగా నామెను చంపివేయుటయే?

స్త్రీ : ఔను. అట్లు చేయక యూరకున్న యెడల దేవేంద్ర
విజయుని బారినుండి తప్పించుకొనుట చాలఁగష్టము. మనోరమ
ప్రాణములతో నుండుట తటస్థించినయెడల నాతఁడెట్లైనను
బ్రయత్నించి యామెను మరల నెప్పటికైనఁ గనిపెట్టి కొనిపోవఁ
గలఁడు. మన మప్పుడు మరల కష్టములకుఁ బాలుపడవలసి
వచ్చును. ఇంతకును మూలమైనమనోరమయే మరణించిన
యెడల నాతఁడెవ్వరికొఱకుఁ బనిచేయును? మనకుఁ గల స్వాతం
త్ర్యమును ద్విగుణము జేసికొని జాగరూకతతో నుండవలయును.

తుల : ఒకవేళ మనోరమను దేవేంద్రవిజయుని రక్షణము
నుండి తప్పించుట సాగనియెడల నప్పు డే మగును?

స్త్రీ : మఱియొక్క యుపాయ మున్నది.

తుల : విశదముగాఁ దెలుపఁగూడదా?

స్త్రీ : ఏమందువా? దేవేంద్రవిజయమిత్రుని మరణము!
తెలిసినదా?

ఆమాట వినినతోడనే తులసీదాసు మిగుల నాశ్చర్యము
తోడను దత్తరముతోడను పీఠమునుండి లేచి నిలువఁబడి "ఔను.
అప్పుడు మనము నిర్విచారముగా నుండవచ్చును. ఇప్పుడా విషయ
మున మొట్టమొదట నేమి చేయవలసియుండు నని నీకుఁ దోఁచు
చున్నది?"

స్త్రీ : మనోరమను బట్టుకొని యెటులైన మననిర్బంధ
మునం దుంచుకొనవలయును.

తుల : ఆమెను నీ వెట్లు పట్టుకొనఁ గలుగుదువు? నేను
తెలిసికొనఁగూడదా?

స్త్రీ : ఇప్పుడు తెలిసికొనవలదు. ఆవశ్యకమని తోఁచిన యెడల నేనే చెప్పెదను. అని చెప్పి యా కాంత లేచి నిలువఁబడియెను.

తుల : ఇప్పుడు నీవు వెడలిపోయెదవా? మరల నెప్పుడగపడియెదవు?

స్త్రీ : గంటలో మరల నీయొద్దకు వచ్చెదను. కాని యెడల వారము దినములు పట్టు నని తోఁచుచున్నది. నీవు మాత్రము సహస్రముఖములఁ జూచుకొనుచు జాగరూకుఁడవై యుండుము. అపరిచితు లగుమనుష్యు లెవ్వరైన వచ్చినచో వారివృత్తాంతమును బాగుగ గ్రహించునట్లు వారితో మాటలాడవలయును. ఎవ్వరి నెంతమాత్రము నమ్మవలదు. ఎవ్వరినిఁ జూచినను నమ్మకుండునట్లు బాగుగ నేర్చుకొనవలయును.

తుల : ఇప్పుడు జాగరూకతతో నుండవలసిన యగత్యమేమి వచ్చినది?

స్త్రీ : దొర గాని, ముసల్మాను గాని, రైతుగాని, భిక్షుకుఁడు గాని, మరియెవ్వరుగాని, మీ కపరిచితుఁ డైనవాఁడు వచ్చి మిమ్ము దర్శించినయెడల నతఁడు తప్పక దేవేంద్రవిజయమిత్రుఁడే యనుసంగతిమాత్రము జ్ఞప్తియం దుంచుకొనవలయును.

తుల : బాగుగ నాలోచించిచూడఁగా నీవు నవీనబాబు సాహాయ్యమును పొంది యున్నట్లు తోఁచుచున్నది. నిజమేనా!

స్త్రీ : కాక మఱి యే మనుకొంటిరి?

ఇంతవఱకును మొగమున మేలిముసుఁగు వైచుకొనియే మాటలాడుచున్న యువతి యప్పుడు మఱింత హెచ్చుగా నవకుంఠనమును సరిచేసికొని వెలుపలకుఁ బోయి తనకొఱకు దీసికొని వచ్చిన బండిలోఁ గూరుచుండి లోపలికిటికీతలుపులను మూసికొనియెను. ఆబండి తోడనే వేగముగ బయలుదేరిపోయెను.

3

షిరపురప్రదేశమున వారాహల్లాలో గంగాతీరమునకు సమీపించి స్త్రీల పెద్దమేడ యున్నది. గదులు విశేషముగా గల యామందిరము నకే "ఆనందకుటీరము" అని పేరు. ఆసౌధమునకు నాలుగు వైపుల నెత్తైన ప్రాకారము కలదు. అంతర్భాగమున నా భవనముచుట్టును రమణీయోద్యానవనము కలదు.

ఆ యువకుంతలవతి కూర్చున్నబండి యుక్తసమయమున కచ్చుటకు వచ్చి యాగృహమున కెదురుగ నున్న యంగణమున నిలువఁబడియెను. బండిదిగి మందిరములోఁ బ్రవేశించి యామె సేవకునిం బిలిచి "నన్నుఁ జూచుట కెవ్వరైనఁ బెద్దమనుష్యులు వచ్చియున్నారా?" అని యడిగెను.

సేవ: అమ్మా! మీ దర్శనమునకై ఎవ్వరో వచ్చి యున్నారు. మీరు లేరని చెప్పితిని.

స్త్రీ: వా రింకను నిచ్చట నున్నారా? లేక యెటకేని పోయినారా?

సేవ: వెలుపల దర్శనమందిరమునఁగూర్చుండి మీ కొఱ కెదురు చూచుచున్నారు.

స్త్రీ: నే నిప్పుడే వచ్చెద నని చెప్పుము. వేగముగఁ బొమ్ము.

"చిత్తము" అని సేవకుఁ డటనుండి వెడలిపోయి యాసంగతి వారికిఁ దెలియఁజేసెను.

ఆ యువతి తనపడకటింటికిఁబోయి మంచముపైఁ గొంత సేపు పరుండి తరువాతఁ దనమొగముపై నున్న మేలిముసుఁగు దీసివైచెను. ఏమేమో యాలోచించి కొంతవఱకు బడలికఁ దీర్చుకొని కలఁగిపోవుచున్న హృదయమును స్థిరపరచుకొనియెను.

నిమ్మళముగా లేచి మొదటియింటి స్త్రీలోనున్న దర్శనగృహ ముందు జనకోటికిఁ గూర్చున్న వారిని చూచుటకై బయలుదేరి పోయెను.

అతఁడు కించుమించుగ ముప్పదియేండ్ల సంవత్సరముల వయస్సుగలవాఁడు. అతనిదేహకాంతి శ్యామలము. అతఁడు కొంచెము పొట్టిగను, పుష్టిగలవాఁడు. కన్నులుమాత్రము చిన్నవి. అతని నాసాగ్రము కొంచెము వంగి యుండెను. ముఖవర్ఛస్సుతో నైక్యము చెందియుండుటచే భ్రూలతాన్యాసమును నిర్ణయించుట కష్టసాధ్యము. ఇతఁడే వైద్యుఁడు గోవిందప్రసాదసేనుఁడు.

యువతి నగుమొగముతో వచ్చి "ఏమి వైద్యస్వామీ! శుభవర్తమానములు దెలియవచ్చినవా? మీ రోగివిషయమై యేమైన తెలిసినదా?" అని యడిగెను.

గోవిం: లేదు. ఇంతవఱకు క్రొత్తసమాచారమును దెలియ లేదు. నీ కేమైనఁ దెలిసినదా?

స్త్రీ: ఆ సతిప్రియునందలి బట్టలమూటను మరలఁ దీసి కొనిపోవుటకై యెవ్వరును రాలేదా?

గోవిం: లేదు.

స్త్రీ: ఔను. నీరోగి యున్నస్థలము నాకుఁ దెలిసినది.

గోవిం: అలాగా? నిజమే? నీ వామెను బాగుగ జూచి యుందువు.

స్త్రీ: నాకన్నులతోఁ జూడ లేదు. మనసుతోఁ జూచితిని. ఎట్లయిన నేమి? ఆమె యున్నస్థలము నాకుఁ దెలిసినది.

గోవిం: చెప్పుము చెప్పుము! ఆమె నీక్షణమునందే పట్టుకొని యెన్నటికిని దాఁటిపోకుండునట్లు బంధింపవలయును.

స్త్రీ: వైద్యమహాశయా! పట్టిమాట లెన్నియైనఁ జెప్పవచ్చును. ఆమె చాల కఠినస్థలమునం దున్నది.

గోవిం : ఎట్లయినను నారోగిని పట్టి తీసికొనిపోవుట కెవ్వరి కధికార మున్నది? సర్వత్రనుండి నా యొద్దకు పిచ్చివాండ్రు వచ్చుచుందురు. పిచ్చిరోగములను బాగుచేయు విషయమున సర్కారులో నాకు విశేషగౌరవ మున్నది. ఎవ్వరి కని భయపడువాడను గాను. నాకార్యముల కభ్యంతరము కలిగించుట కెవ్వరికిని సాధ్యము కాదు. న్యాయస్థానమునకుం బోయి మనవిచేసినచో న్యాయాధికారులు రోగిని నావశము చేయం గలరు. ఆమె పిచ్చిది యని ఋజువుచేయుట కాధారములున్న కాగితముల నన్నిటిని సిద్ధపఱచుకొనియే యుంటిని. ఆమె యిప్పు డెక్కడ నున్నది?

స్త్రీ : దేవేంద్రవిజయునియింట నున్నది.

గోవిం : ఆతం డెవ్వండు?

స్త్రీ : నీవాతని నెఱుంగవా?

గోవిం : ఎఱుంగను. ఎఱుంగవలసిన యావశ్యక మే మున్నది? ఆతం డుండు స్థల మిప్పుడు తెలిసికొనవలసి వచ్చినది.

స్త్రీ : ఆతం డీదేశమునందుం బేరెన్నికం గన్న పత్తేదారు.

గోవిం : ఆతం డొక్కండు గాక పదిమంది పత్తేదారు లైనను నా కెంతమాత్రమును భయములేదు.

స్త్రీ : అది నిజమే. ఆతండొక్కండే పదిమందిపత్తేదారులను మించినవాండు.

గోవిం : ఆతం డెవ్వండైనం గానిమ్ము. నేను రోగి నెటులైన దీసికొనిరాక మానను. ఆతనియి ల్లెక్కడ?

స్త్రీ : పద్మపుష్కర ప్రాంతమున నాతని మందిరము కలదు. పద్మపుష్కరిని చక్రవర్తివీథియం దున్నది. నీతో నేను మఱియొకమాట చెప్పుచున్నదానను, నీ వాతనిచేతులలోనుండి తప్పించి నీరోగిని తీసికొని వచ్చునంతటి సామర్థ్యము కలవాం

డవే యయ్యెదవేని విశేషించి నీకై మువందలరూపాయలను బహుమాన మిచ్చెదను.

గోవిం : మంచిది. రేపటి యుదయముననే వచ్చి నేనారు రూపాయలబహుమానమును దీసికొందును.

స్త్రీ : అట్లే యిచ్చెదను. కాని నీవీదినమున దేవేంద్రవిజయుని యింటికిఁ బోవా యేమి? పోయినను నీకార్యము కొనసాగు నని తోఁపదు. వ్యర్థముగా శ్రమపడవలసి వచ్చును. దేవేంద్రవిజయుఁడు సాధారణుఁడు కాఁడు.

గోవిం : మంచిది. ఆతనిని నేనుగూడ నొకసారి చూచి సంగతి తెలిసికొనవలసి యున్నది.

స్త్రీ : రేపటియుదయమున కెల్లసంగతులును దెలియును గాదా? రేపుపదిగంటలకే యిక్కడకు రావలయును.

గోవిం : మంచిది. ఇప్పటికి సెలవు నొసంగెదవా?

స్త్రీ : పోయి రమ్ము.

## ౪

దేవేంద్ర విజయమిత్రుఁడు తనశయనమందిరమున మంచము పైఁ బరుండి తల దిండుపై నానుకొని యింగ్లీషు పత్రికను జదువుచుండెను. అప్పుడు "సుబ్బు" అను పేరు గల పిల్లవాఁడు వచ్చి యాతని కొకయుత్తరము నిచ్చెను.

ఆతఁ డాయుత్తరమును జదువుకొని లేచి కూర్చుండెను. చిఱునవ్వు నవ్వుకొనుచుఁ దనలోఁ దానే "వైద్యుఁ డగు గోవిందప్రసాదసేనుఁడు తనంతతానే నన్నుఁ జూచుటకు వచ్చుచున్నాఁడు, చాల బాగుగ నున్నది. వెదకఁబోయినతీఁగ పదములకే తగిలిన ట్లయ్యెను. ఆతనిమందిరమును, నాతనిని వెదకుకొనుచుఁ బోవలసినతొందరగ తప్పిపోయినది" అని యనుకొనియెను.

అప్పు డాతఁడు ముందుగా గోవిందసేనుని జూడఁ బోవక రేవతియును, మనోరమయు, మాటలాడుచున్న స్థలమునకుఁ బోయి మనోరమతో "వైద్యగోవింద ప్రసాదసేనుఁడు వచ్చి యున్నాఁడు" అని చెప్పెను.

మనో : గోవిందప్రసాదసేనుఁడా ? వైద్యుఁడా ? ఎక్కడ నున్నాఁడు ?

దేవేం : ఇక్కడికే వచ్చియున్నాడు.

మనో : ఆతఁడు వచ్చుటకుఁ గారణ మేమైయుండునో మీ రూహించితిరా ?

దేవేం : నీకొఱకే యని తోఁచుచున్నది. నిన్నుఁ దీసికొని పోవలయు నని వచ్చియుండును.

మనో : ఏ మనియెదరు? అయ్యో! ఎట్లైన నన్నిప్పుడు రక్షించవలయును! నన్ను బ్రదికింపుఁడు. నన్నాతని కొప్పగింపవలదు.

దేవేం : మనోరమా ! భయపడకుము. ఆతఁ డింత వేగముగా నిన్ను వెదకుటకు వచ్చుటఁ జూడఁగా మిగుల నాశ్చర్యముగ నున్నది.

ఆ సత్రమునందు నీవు విడిచివచ్చిన మూటను వారు కనుపెట్టి యుందురు. నిన్ను వెదకి పట్టుకొనుటకు పత్తేదారును నియమించుకొనియుందు రని కూడఁ దోఁచుచున్నది.

మనో : ఎంతమాత్రమును సంభవము కాదు.

దేవేం : ఏమి ?

మనో : నా ప్రతిపక్షులే స్వయముగా నన్ను వెదకుచుందురు. నేను మీ మఱుఁగుచొచ్చి యుంటి నని వారికిఁ దెలిసి యుండవచ్చును. మీ యట్టి నేర్పరులైన పత్తేదారులపై మఱియొక పత్తేదారును నియమించి పనిచేయుటకు వారు సాహసింపరు.

దేవేం : అన్నిసంగతులు నిప్పుడే తెలియవచ్చును గదా. వైద్యగోవింద ప్రసాదసేనుఁ డెట్టియుద్దేశములతో వచ్చియున్నాఁడో మన కిప్పుడే తెలియగలను. తరువాత జరుగవలసిన సంగతులనుగూర్చి మనము యోచించుకొనవచ్చును.

అని చెప్పి దేవేంద్రవిజయమిత్రుఁడు వెలుపల నున్న దర్శన గృహమునకుఁ బోయెను.

౨౩

ముందువైపున దర్శనగృహమునందు వైద్యగోవింద ప్రసాద సేనుఁడు కూర్చుండి దేవేంద్రునిరాకకై యెదురు చూచు చుండెను. దేవేంద్రవిజయమిత్రుఁ డాతనియొద్దకుఁ బోయిన తోడనే గోవిందసేనుఁడు "అయ్యా! దేవేంద్రవిజయమిత్రులు మీరేనా!" అని యడిగెను.

దేవేం : చిత్తము.

గోవిం : మీరు! పిచ్చిదానిని మీయింటియందుంచు కొనియుంటిరి గదా?

దేవేం : ఓహో! అదియా? అందుకొఱకా మీ రిచ్చటకు దయచేసితిరి?

గోవిం : అందుకొఱకే మీ దర్శనమునకు వచ్చుట తటస్థించినది.

దేవేం : అయ్యా! మీ కీసమాచారమును దెలియఁ జేసిన పెద్ద మనుష్యు లెవ్వరు?

గోవిం : నాయంతన నేనే తెలిసికొంటిని. నేను వైద్యుఁడను. మీయింటియందున్నరోగి యింతవఱకు నా యధీనమున నున్నది.

దేవేం : కావచ్చును. ఇప్పుడు నేను చేయవలసినపని యేమి?

గోవిం : రోగిని మరల నా వైద్యశాలకుఁ గొనిపోవ వచ్చి యున్నాను. మీ రామెను నాతోఁ గూడఁ బంపవలయును.

దేవేం : తొందరపడ వలదు. మీ రోగి పేరేమో చెప్పఁగలరా?

గోవిం : ఆమె పేరా? నాకుఁ దెలియదు.

దేవేం : ఆమె పేరే మీరు చెప్పఁజాలకపోయిన యెడల దేనిని బట్టి నేనామెను గుర్తింపఁగలను?

గోవిం : ఆమె ముఖలక్షణములవలనను, చేష్టలవలనను బాగుగ గుర్తింపవచ్చును. అవయవ లక్షణములను జూచిన యెడల బాగుగఁ గనుపెట్టవచ్చును. నాకొకసారి చూపిన యెడల నిశ్చయముగాఁ జెప్పఁగలను.

దేవేం : ఆమె పిచ్చిదని యంటిరిగదా? దేనినిబట్టి మీ రట్లు నిశ్చయించితిరి?

గోవిం : పిచ్చిచేష్టలవలన—

దేవేం : పిచ్చిచేష్ట లనఁగా నెట్టివి?

గోవిం : పిచ్చిచేష్టలా? అనేకము లున్నవి. ఖాదరపురమున మోహల్లాలో యానందకుటీరము తనయిల్లని ప్రజలందఱితోడను జెప్పుకొనుచు నామె వీథులవెంబడిని తిరుగుచుండెను. నిజముగా నాయింటియధికారిణి మనోరమ. ఇట్టిస్థితిలో నామె పిచ్చిదని తలంచుట కేమి సందేహ మున్నది?

దేవేం : ఓహో! అదియా? దీనినిబట్టి యాలోచించి చూడఁగా నిం దేదియో కపటతంత్ర మున్నదని తోఁచుట లేదా? వైద్యమహాశయా!

గోవిం : నేను మీ ప్రశ్నముల కన్నిటికిని ప్రత్యుత్తరము లిచ్చుటకై యిచ్చటకు వచ్చినవాఁడనుగాను. నారోగిని నా వైద్యశాలకు మరలఁ దీసికొనిపోవుటకై వచ్చితిని.

దేవేం : ఆమె మీరోగి యని తెలియఁబఱచుటకుఁ దగిన యాధారములు గల కాగితములను మీ రిచ్చుటకిఁ దీసికొని వచ్చితిరా ?

గోవిం : అందులకుఁ దగినయాధారము లనేకము లున్నవి. అన్నిటిని దీసికొనియే వచ్చితిని.

దేవేం : ఎక్కడ నున్నవి ?

గోవిం : ఆమె యిచ్చట నున్నదా, లేదా ? మొట్టమొదట నా సంగతిని సెలవీయవలయును.

దేవేం : ఇక్కడనే యున్నది. మీకు సరియైన సమాచారమే తెలియవచ్చినది.

గోవిం : నమ్మకముగల పెద్ద మనుష్యుఁడు చెప్పిన సమాచార మిది.

దేవేం : ఈ సమాచారమును మీతో మనవిచేసిన యా పెద్దమనుష్యుఁ డెవ్వఁడు ?

గోవిం : ఆఁతడు బాగుగఁ దెలిసినవాఁడే. నారోగి మీ యింటిలోఁ బ్రవేశించుచుండుట నాతఁడు ప్రత్యక్షముగాఁజూచియే చెప్పి యున్నాఁడు.

దేవేం : అట్లయినచో నా మనుష్యుఁ డామెను బాగుగ నెఱిగినయాతఁడేనా ?

గోవిం : ఔను.

దేవేం : ఆ మనుష్యునకును నీ రోగికిని నెట్టిపరిచయ మున్నది ?

గోవిం : అనావశ్యకంబు లగుప్రశ్నలకుఁ బ్రత్యుత్తరము లిచ్చు బాధ్యత నాకు లేదు.

దేవేం : మీరోగి మామందరమునం దున్నదని యొప్పకొనుటకు నాకును నంత బాధ్యత లేదు.

గోవిం: ఈ విషయమునం దెల్లవిధముల నేను మిమ్ములను బద్ధులను జేయఁగలుగుదును.

దేవేం: ఎట్లు చేసెదరయ్యా? కొంచెము సెలవిండు! ఆలకించి తెలిసికొందును.

గోవిం: నిన్నుందులకు బాధ్యునిగాఁ జేయువిషయమున రాజ శాసనము నాకు సాహాయ్యము చేయఁగలదు.

దేవేం: అలాగా? అది యిప్పటిమాట కాదు. అంతపని జరుగునప్పటికిఁ జాలకాలము పట్టును.

గోవిం: ఎంతకాలమైన నేమి? అంతమాత్రమున నాకు నష్టము కలుగనేరదు.

దేవేం: ఆ యవకాశమునం దామెను మఱియొకస్థలమునకుఁజేర్చి దాఁచియుంచుట కాధారము కలుగదా?

గోవిం: మీమాటలనుబట్టి చూడఁగా మీ రామెనువిడుచునట్లు తోఁచుటలేదు. ఆమెను మీయింట నుంచుకొనఁగలరా?

దేవేం: ఏమి? ఎందుల కుంచుకొనఁగూడదు?

గోవిం: మీ రెక్కడ నెంతభద్రముగా దాఁచి యుంచినను దుదకామె నా స్వాధీనము కాక మానదు.

దేవేం: అట్లే జరుగవచ్చును. ఆమె నాయింట నున్నదని తెలియఁజేయుటకుఁ దగిన ప్రమాణములు మీయొద్దనున్నవా?

గోవిం: ప్రమాణము లెందులకు? ఆమె యిచ్చట నున్నదని నాకే బాగుగఁ దెలియును.

దేవేం: మీకుఁ దెలియునా? మీకుఁ దెలిసినట్లు నాకును దెలియును. ఆమాట లెందులకు? వానివలన నేమిలాభ మున్నది? ఏవైనఁ బ్రమాణము లున్నవా? ఉన్నచోఁ దయచేసి చూపఁ గోరెదను.

గోవిం: నాకంతటి యావశ్యకత మైనప్పుడు చూపించెదను. నిరర్థకంబులగు నీతర్క వితర్కములతో నేమి ప్రయోజనమున్నది? ఇప్పుడు మీరామెను నాతోఁగూడఁ బంపించుట కంగీకరించెదరా?

దేవేం: సప్రమాణముగ నొకటి రెండు దృష్టాంతములను జూపకుండఁగనే మీ యాజ్ఞాప్రకారము చేయుటకు నేనంగీకరింపఁ జాలను. మొట్టమొదట నామె నామందిరమున నున్నదని చెప్పుటకును, తరువాత నామె పిచ్చిదని నిర్ధారణ చేయుటకును దగిన యాధారములను జూపింపవలయును.

గోవిం: మంచిది. ఒకసారి యీ రెండు కాగితములను జదివి చూచుకొనుఁడు.

దేవేంద్రుఁడు వైద్యుఁ డిచ్చిన కాగితముల నందుకొని మొట్టమొదట నందున్న డాక్టరుల తీర్మానములను, వారి చేవ్రాళ్లను జూచి వారి నామములను దనదినచర్యా లేఖన గ్రంథము నందు వ్రాసికొని వెంటనే గోవిందసేనున కిచ్చివైచెను.

గోవిం: దీనిని మీరేల చదువ లేదు? మీరు తెలిసికొనఁదగిన విషయము లిందున్నవి.

దేవేం: అక్కఱలేదు. నాకుఁ గావలసినంతవఱకు నేను చూచి తెలిసికొని యున్నాఁడను.

గోవిం: డాక్టరుల నామములా? మంచిపని చేసితిరి. ఇప్పుడైన నామెను నా కొప్పగించెదరా?

దేవేం: అట్లే చేయవచ్చును, నే నడిగిన ప్రశ్నలకు సరియైన ప్రత్యుత్తరము లిచ్చినయెడల.

గోవిం: మీ రడుగవలసిన ప్రశ్నము లేవియో యడుగవచ్చును. సాధ్యమైనంతవఱకు సమాధానము చెప్పెదను.

దేవేం: చెప్పెదరా? మిమ్ములను నాయొద్ద కిప్పుడు పంపించిన వారెవ్వరో సెలవిండు?

గోవిం : ఈ ప్రశ్నమునకు నేను బ్రత్యుత్తరము చెప్పఁజాలను. గొప్పయింటి కాంతల నామములను బ్రకటించుట మంచి పని కాదు. ఆ సంగతి మీరుమాత్ర మెఱుఁగరా ?

దేవేం : గొప్పయింటి కాంతయా! ఇప్పుడు మీరు మనోరమయని చెప్పిన కాంతయేనా ?

గోవిం : కాదు. ఆ సంగతి యంతయును నాకుఁ దెలియదు. ఆమె కాదు.

దేవేం : మీరు చెప్పినరోగికి పథ్యము మొదలగు వానికిని, వైద్యనిమిత్తమును ధనము నిచ్చుచున్న కాంత యెవ్వరో చెప్పఁగలరా ?

గోవిం : మీ కాసమాచార మెందుకు ? అందువలన మీ కేమి లాభమున్నది ?

దేవేం : ఆవశ్యకమే యున్నది. అట్లు కానియెడల నిట్టి ప్రశ్నముల నడిగి మీకుఁ దొందర కలిగించు చుందునా ?

గోవిం : ఇప్పుడు మీరు పేరుచెప్పిన కాంతయే.

దేవేం : మనోరమయేనా ?

గోవిం : ఔను.

దేవేం : మీరోగి మాయింట నున్నదని మీతో నామెయే చెప్పినదా ?

గోవిం : లేదు, ఆమెను నేను జూచియుండలేదు.

దేవేం : మీరు చెప్పినది యంతయును నిజమేనా ?

గోవిం : నేను బూటకము లాడువాఁడ ననియే మీరు తలంచుచుంటిరా ?

దేవేం : ఔను. ఇప్పుడే, మీ మాటలవలననే మీ రసత్యవాదులని నిరూపింపగలను.

గోవిం : (కోపముతోఁ గన్నులెఱ్ఱచేసి) నేనసత్యవాదినా?

మీరు నన్నిట్లవమానింతురా ? ఇది మీ యిల్లయినది. కానియెడల నిప్పుడే—

దేవేం : తొందరపడకుఁడు ! వైద్యస్వామీ ! తొందరపడకుఁడు. కొంచెము, శాంతింపుఁడు ! ఊరక నన్నుఁ దిట్టవలదు. మడతమాట లన్నియును మంగళాష్టకములు కావు. ఇది నాయిల్లే కాకపోయినయెడల నప్పుడు మీసంగతి బాగుగనే తెలిసిపోవును. నా యింటికి వచ్చితిరి కావుననే యింతవఱకును మీ యాటలు సాగినవి.

గోవిం : ఈ వట్టి మాటలతో నేమి ? నారోగిని నాకొప్పగింపుఁడు!

దేవేం : ఈ మాటలు దేవేంద్ర విజయమిత్రుని యొద్దఁ బనికిరావు.

గోవిం : అట్లయినచో నామె మీ మందిరమునందున్నట్లు త్రికరణశుద్ధిగా మీ రంగీకరించితిరి కాదా ?

దేవేం : ఆ సంగతి యింకను మీకుఁ దెలియలేదా ? ఆమె నిశ్చయముగా మా యింట లేదు.

గోవిం : ఇప్పుడింతకుముందు మీ రొప్పుకొని యుంటిరి గాదా ? మీ ప్రశ్నములకు సరియైనయుత్తర మిచ్చినయెడల నామెను నాకొప్పగింతునని యిప్పుడేగదా చెప్పితిరి ?

దేవేం : నే నట్లు నిశ్చయముగాఁ జెప్పలేదు. "ప్రత్యుత్తరము చెప్పినయెడల నొప్పగింపవచ్చును" అని చెప్పి యుంటిని. కాని, బాగుగ నాలోచించి చూడఁగా నిప్పుడు రోగిని మీవశము చేయుట సరికాదని తోఁచుచున్నది.

గోవిం : మీరు నాయధీనము చేయకపోయినంత మాత్రమున నే నూరక వదలెద ననుకొంటిరా ? నాకుఁ దోఁచినరీతి నామె నెట్లును నా యధీనము చేసికొనక విడువను.

దేవేం : మీరా ? ఎట్లు తీసికొని పోయెదరో దయయుంచి సెలవీయరాదా ?

గోవిం : ఎట్లు సాధ్యమగునో యట్లు చేసి యామెను వెంటఁ బెట్టుకొని పోయెదను.

దేవేం : ఎప్పుడు ?

గోవిం : ఇప్పుడే.

దేవేం : ఇప్పుడేనా ? ఎట్లు ?

గోవిం : బలాత్కారముగా.

దేవేం : వైద్యస్వామీ! మీరు నాతోఁ బరిహాసము లాడుచుంటిరా ? మీ మాటలవలన నాకు నవ్వు వచ్చుచున్నది.

గోవిందసేనుఁడు కోపముతోఁ గనులెఱ్ఱజేసి గర్జించుచు "నా కా మాటలతోఁ బనిలేదు. నాకుఁ గావలసినది నారోగి. ఇచ్చెదవా ? ఈయవా ?" అనియెను.

దేవేం : ఇయ్యను.

"ఆలాగా !" అని కోపముతోఁ బలుకుచు గోవిందసేనుఁడు తన చేతికఱ్ఱనుదీసి దాని పిడి పట్టుకొని పైకి లాగెను. తోడనే యందున్న నిశితకరవాలము పైకి వచ్చెను. ఇంతవఱకు నా కఱ్ఱ దాని కొరకైయుండెను. గోవిందప్రసాదుఁ డాకత్తి చేతఁ బట్టుకొని దేవేంద్రుని నఱకుటకై ప్రయత్నించెను.

ఆ కత్తి గుఱితప్పకుండ దేవేంద్రునిమీఁదనే పడినయెడల నాతఁ డీసరికి రెండుఖండములై క్రిందఁ బడిపోయి యుండును. కాని, యాతఁడా కృపాణాఘాతము నతిచతురుఁడై తప్పించుకొనియెను. వైద్యుఁ డాతని యుత్తమాంగమునకు సరిగా గుఱి చూచి యా కత్తిని విసరినప్పుడు దేవేంద్రుఁడు చటుకునఁ గ్రిందఁ గూరుచుండెను. అందువలన నా దెబ్బ గోడకుఁ దగిలి వ్యర్థమై పోయెను.

అంతలోనే దేవేంద్రుఁడు తన వజ్రముష్టితో బలముగ గ్రుద్దిన గ్రుద్దు గోవిందసేనుని కపాలమును నొప్పించెను. తోడనే స్మృతితప్పిపోవుటచే గోవిందసేనుఁడు క్రిందఁబడిపోయెను. మరల నంతలోనే లేచి గోవిందసేనుఁడు తన యుడుపులలో దాఁచి తీసికొని వచ్చిన మఱియొక కరవాలమును బైకిఁదీసి దాని మూలమున దేవేంద్రుని సంహరింప నుద్యమించెను.

ఇదివఱకే సంసిద్ధుఁడై యున్న దేవేంద్రుఁడు వైద్యుఁడు తనసమీపమునకు వచ్చుచుండుటఁజూచి రెండడుగులు వెనుకకుఁ దగ్గెను. ఆతఁ డట్లు రెండడుగులు వెనుక కరిగి కరవాల సమన్వితమగు వైద్యుని హస్తముపై మణిబంధమున దెబ్బ కొట్టెను. ఆ దెబ్బ తోడనే దుర్బలమైన వైద్యుని పిడికిటనుండి యాకత్తి దూరముగ బడిపోయి యవనీతలమును చుంబించెను. తత్క్షణమే దేవేంద్రుఁ డా వైద్యుని సమున్నతశరీరమును దనసందిట నిరికించుకొనెను. ఆ దృఢ బాహుబంధమునంబడి వైద్యుఁడు గదలజాలకయుండియు నెట్లైనఁ దప్పించుకొనవలయు నని శక్తికొలఁది గొట్టుకొను చుండెను.

ఆ గందరగోళమును విని సేవకుఁడు సుబ్బు పరుగెత్తుకొని యచ్చటికి వచ్చెను. దేవేంద్రుఁ డాతనితో "నీవు వీథితలుపులను బాగుగఁ దెఱచివేయుము" అని చెప్పెను.

దేవేంద్రుని సెలవు ప్రకారము సుబ్బు తలుపులను దెఱచెను. అప్పుడు దేవేంద్రుఁడు వైద్యుని దనచేతులతోఁ బైకెత్తెను.

వైద్యుఁ డాతనిచేతులలోఁ బడి కొట్టుకొనుచు, తిట్టుచు, కేకలు వైచుచు, భయపెట్టుచుండెను. ఏమిచేసినను లాభ మగు పడుట లేదు.

దేవేంద్రుఁడు గోవిందసేనుని బట్టలమూట పోలికం జుట్టఁ బెట్టుకొనిపోయి వెలుపల నట్టనడివీథిలోనికి విసరిపాఱవైచి వచ్చి తలుపులు మూసికొని గడియ వైచుకొనియెను.

౬

సాయంసమయమున శివపురమున నానందకుటీరమునకు వెనుక భాగమునందొక గూనివాఁడు చేతికఱ్ఱపై నానుకొని మెల్ల మెల్లగ నడచిపోవుచుండెను. నాలుగడుగులు వైచి ముందునకుఁ బోవఁజాలక యూరక దగ్గుచుండెను. అతఁ డానందకుటీరమునకుఁ బార్శ్వమునఁ బ్రవేశించి మార్గము నొద్దకుఁ బోయినతోడనే కొంచెముసేపు నిలువఁబడి మొదలిటికంటెను హెచ్చుగా దగ్గ నారంభించెను.

వెంటనే యా యుద్యానద్వారము నుండి మసల్మానుల వలె నుడుపులను ధరియించిన పురుషుఁడువచ్చి యాగూనివానితో "మీా రిప్పుడే వచ్చితిరా ?" అని యడిగెను.

గూనివాఁడు మెల్లమెల్లగా "ఔను. శచీ !" అనియెను. మసల్మాను వేషధారి దేవేంద్రుని మేనల్లుఁడు శచీంద్రుడు. గూని వాఁడు దేవేంద్రుడు.

శచీ : మీారు వచ్చుట చాలమేలైనది. మీాకుఁ దెలుప వలసిన సమాచారము లనేకము లున్నవి.

దేవేం : తరువాత విని యెదను. నే నిప్పుడు పోవలయును. ఆలస్యముచేయుటకు వలనుపడదు. శివపుర మోహల్లా గోవింద ప్రసాదసేను నింటికిఁ బోయెదను.

శచీ : మరల నా కెప్పుడు దర్శన మిచ్చెదరు ?

దేవేం : ఆ కార్యము నిర్వర్తించుకొని వచ్చి నిన్ను మరల నిచటనే చూచెదను, అని చెప్పి దేవేంద్రుఁడటనుండి వెడలి పోయెను.

౭

దేవేంద్రవిజయుఁడు శివపురమునకు వచ్చునప్పటికిఁ జాలరాత్రి యయ్యెను. వీథులలో మనుష్యసంచారమే లేదు. అందఱును నిద్రాదేవి యొడియందు విశ్రామసౌఖ్యము ననుభవించుచుండిరి.

అతికష్టముతో నాయూరంతయును వెదకి వెదకి దేవేంద్రవిజయమిత్రుఁడు వైద్యగోవిందుని గృహమును కనిపెట్టఁగలిగెను.

ఆ విశాల భవనమునందలి రెండవ యంతస్తుపై నున్న కొన్ని గదులలో దీపకాంతు లగపడుచుండెను. కాని యంతటను నిశ్శబ్దముగా నుండెను. క్రింది యంతస్తునందలి కొన్నియిండ్లలోఁ గూడ దీపకాంతులు గవాక్ష మార్గములనుండి వెలుపలకుఁ బ్రసరించుచుండెను. ఆ గదులలోఁ జచ్చిపోవుచున్న రోగుల కాతర ధ్వనులును యాతనను తెలియజేయుచున్న రోదన శబ్దములును, పిచ్చివాండ్రప్పుడప్పుడు బిగ్గరగా నవ్వుచున్న వికట స్వనంబులును, నా రాత్రియందలి నిశ్శబ్దభావము నపహ్నయించుచుండెను.

దేవేంద్రుఁ డాగృహమునొద్దకుఁ బోయి మూసియున్న తలుపులను చేతితోఁ దట్టుట కారంభించెను. కొంతసేపటికి సేవకుఁడు వచ్చి యా తలుపులను దీసెను.

దేవేం : వైద్యులున్నారా ?

సేవ : ఇంటియొద్ద లేరు.

దేవేం : ఎక్కడకుఁ బోయిరో నీ వెఱుఁగుదువా ? మరల నిప్పుడు వెనుదిరిగి వచ్చెదరా ?

సేవ : ఎవ్వరో రోగిని చూచుటకై యెక్కడకో పోయి యుండవచ్చును. ఇప్పుడు వచ్చెదరో, రారో నిశ్చయముగాఁ జెప్పజాలను.

దేవేం : ఆయన యిటనుండి పోయి యెంతసేపైనది ?

సేవ : సాయంకాలమునకు ముందే.

దేవేం : అట్లయినచో నేను చాలఁజిక్కులలోఁ బడిపోయి తిని. ఎంతయో కష్టపడి వచ్చితిని కాని, తుదకు వారి దర్శనము దొరక లేదు. ఏమి చేయను? మూఁడుకాళ్ళ ముసలివాఁడను. ఇంత రాత్రివేళ మరియెచ్చటికిఁ బోఁగలను?

సేవ: ఆయనయొద్ద మీకేమిపనియున్నది? చెప్పిపోయినచో వారు వచ్చిన వెంటనే తెలిపెదను.

దేవేం : నాకు మరేమి పనియున్నది నాయనా? నాపిచ్చి కుమార్తె నొకదాని నీయనయొద్ద వైద్యమునకై యుంచితిని, ఆ బిడ్డ యిప్పు డెట్లున్నదియో చూచిపో వచ్చితిని.

సేవ : పిచ్చిపిల్లయా? ఇప్పుడట్టి వా రెవ్వరును మా వైద్య శాలయందు లేరు.

దేవేం : అయ్యో!అట్లయినచో నామె చచ్చిపోయినదా? అయ్యో! నా బిడ్డా! నీవు——

సేవ : ఆమె పేరేమి? పేరునుబట్టియైనను తెలిసికొన వచ్చును.

దేవేం : ఆ బిడ్డ పుట్టినప్పటి నుండియు పిచ్చిదియేఅగుటచే మే మామెను పిచ్చిదనియే పిలుచుచుందుము. చాల నందమైనది. పదునెనిమిది ఇరువది ఏండ్ల వయసుకలదు. ఆమె పెద్దదగుచున్న కొలఁది పిచ్చియును హెచ్చిపోవుచుండుటను జూచి యామెకు ఔషధ మిప్పించి బాగుచేయించు నుద్దేశముతో నీ వైద్యుని కొప్పగించితిని.

సేవ : ఓహో! ఆలాగా ఇప్పుడు తెలిసినది. ఆమె నేటికి నాలుగైదురోజుల క్రిందట నెక్కడికో పారిపోయినది. ఎంత మందియో వెదకిరి, కాని యెవ్వరికిని దొరక లేదు.

దేవేం : పాఱిపోవుటయే ? యెక్కడకుఁ బాఱిపోయినది, నాయనా ? అయ్యో ! ఎట్లు పాఱిపోయినదో చెప్పుము. ఇన్ని దినము లైన నింకను పిచ్చి కొంచెమైనను కుదురనే లేదా ?

సేవ : ఆమె మీ కుమార్తెయా ? ఆమె సాధుస్వభావము కలది, మిగులఁ దెలివి కలది. ఇక్కడ నెప్పుడు నామెను కను పెట్టుకొనియుండుటయే నా పని, కాని, యామె పిచ్చితనమును కనుపెట్ట లేదు. ఆమె పిచ్చిది యని నా కెంతమాత్రమును నమ్మకము లేదు. ఆమె యప్పుడప్పుడు తనదురదృష్టమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని పరితపించుచుండును. అంతియ కాని యొక్కప్పుడైన నొక చెడ్డమాట నోటితో నుచ్చరించి యుండ లేదు. ఏపని చెప్పినను బాగుగ విని తోడనే యాపని చేయుచుండెడిది. శ్రీమహాలక్ష్మివలె నున్న యట్టికాంత పిచ్చి దని భావించి యిచ్చటకుఁ బంపవచ్చునా ? నీ వామెకుఁ దండ్రివి కావా ? మీకు ముసలితనమునం దింతటి దుర్బుద్ధి యేల పుట్టినది ?

దేవేం : అయ్యో ! ఇది పరిహాసమునకు సమయము కాదు. అంతటి వెఱ్ఱిదానినిగూర్చి నీ వేమేమో గ్రహించినట్లే స్వస్థచిత్త యనియు సాధుశీల యనియుఁ జెప్పుచు న న్నిట్లు పరిహసించుట నీకు న్యాయమైనపని గాదు. నీ కింకను చిన్నతనము వదల లేదు. నే నిప్పటికిఁ బోయెదను. రేపు మరల వచ్చి వైద్యమహాశయుని దర్శనము చేసికొందును. వా రింటికి వచ్చినతోడనే "దేవేంద్రవిజయుఁడు తనకుమార్తెపిచ్చితనము నిజమైనదియో, కాదో తెలిసికొనిపోవుటకై వచ్చియున్నాఁడు" అని వారితో మనవి చేయుము. వారి కెల్లసమాచారమును తెలియఁగలదు.



దేవేంద్రుఁడు శివపురమునుండి వెడలి ఖదరపురమున శచీంద్రుని చూచుటకై వచ్చునప్పటికిఁ దెల్లవారుసమయము కావచ్చెను.

పూర్వదిగ్భాగమున నాకాశప్రాంతమునం దతిసాంద్రము లగు రక్తకాంతులు విరాజిల్లుచుండెను. ఉషాదేవి పూర్వా కాశమునందలి కనకజలధరసోపానములపై మెల్లమెల్లగ నడుగు లిడుచు మందహాసవద నారవిందయై వచ్చుచుండెను.

దేవేంద్రవిజయమిత్రుం డానందకుటీరమునకు వెనుకతట్టున నేకాంతముగఁ బ్రవేశించి శచీంద్రునిఁ బిలిచి "నీ కేమైన విశేష సమాచారములు తెలియవచ్చినవా?" అని యడిగెను.

శచీ: అనేక సమాచారములు బయటఁ బడినవి. మీరు సావధానముగ నాలకింపవలయును.

దేవేం: ఏవిషయమునుగూర్చి? రహస్యము లేవియైనఁ దెలిసిన యెడలఁ జెప్పుము.

శచీ: రామగులాముసకును, చనిపోయిన యాకాంతకును నౌషధము నిచ్చినవైద్యునియొద్దకుఁబోయి యాతనిని చూచి వచ్చితిని.

దేవేం: ఆతఁ డెవ్వరు? ఆతని యిల్లెక్కడ? ఆతని పే రేమియో తెలిసినదా?

శచీ: అన్నియును దెలిసినవి. ఆతని పేరు నవీనచంద్రుఁడు. ఆతఁడీ యానందకుటీరమునందే యున్నాఁడు. ఆనవీనచంద్రుఁడే యిప్పుడీ యానందకుటీరమునకు నూతనాధికారి. మనోరమ యని పేరు పెట్టుకొని యీసొత్తు నాక్రమించుకొనియున్న యా కాంత కాతఁడు మగఁడు.

దేవేం: ఆలాగా? ఆయిరువురకును బరిణయమై యెన్ని దినము లైనది? నీకుఁ దెలిసినదా?

శచీం: వారిపెండ్లియై నెలదినము లైనట్లు తెలియ వచ్చినది.

దేవేం: వివాహ మీనెలలోననే జరిగినదా?

శచీం : పెండ్లియైనమాట యేమో నిశ్చయము. కాని, యీయిరువురకును బరస్పర ప్రీతివిశ్వాసము లున్నట్లు తోఁచుట లేదు. రేయుంబవలు పరస్పరము వాదప్రతివాదములతోడనే యుందు రఁట !

దేవేం : ఆసంగతు లన్నియు నీ కెట్లు తెలియవచ్చినవి ?

శచీం : నే నీతోఁటకాపరివలన నంతయును వింటిని. నవీనచంద్రుని చూచితిని. మిగుల మూర్ఖుఁడు, గర్వి. ఆతని యాకార వికారములుకూడ నందులకు సరిపడియే యుండును.

దేవేం : మంచిది. నీ వాతనియొద్దకుఁ బోయి యేమైన మాటలాడియుంటివా ?

శచీం : మాటలాడితిని. ఇప్పుడు నా కాతఁడు తనబండి తోలు నుద్యోగమును దయచేసి యున్నాఁడు. నే నిప్పుడు శచీంద్రుఁడను గాను, నవీనచంద్రుని బండివాఁడను.

దేవేం : మనకుఁ గావలసిన దదియే. మంచిపని చేసితివి! నీ వీకార్యమునందు మిగులనైపుణ్యము నగపఱచి యుంటివి. ఇఁక నీ విక్కడనే యుండుము. ఇప్పుడు గాని, మఱియొకప్పుడు గాని, యీ స్థలమునందుఁగాని, మఱియొక స్థలమునందుఁ గాని మిగుల జాగరూకుఁడవై కన్నులు దెఱచికొని యుండవలయును. కాని నోరు మూసికొనియే యుండుట చాలమంచిది. "17. క," అను గుర్తు గలకాగితము నెట్లయినఁ బ్రయత్నించి కనుపెట్ట వలసి యున్నది, అని చెప్పి తానుచేసినపని యంతయు నాతని కెఱింగించి దేవేంద్రుఁడు బయలుదేరెను.

శచీం : మీ రిప్పు డెచ్చటికిఁ బోయెదరు ?

దేవేం : ఇంటికిఁ బోయెదను. ఇప్పటి స్థితిగతులనుబట్టి బాగుగ నాలోచించి చూడఁగా మనయింటియొద్దఁగూడ నేమేమో దుష్కృత్యములను జరిగించుటకై వారు ప్రయత్నించుచుండి రేమో యని యనుమానము కలుగుచున్నది.

శచీం : మామా! అట్లు చెప్పెద రేమి? మీ కంతటి సందేహ మెందులకుఁ గలుగవలయును ?

దేవేం : వారు మనోరమ నెట్ులైన మరలఁ దీసికొని పోవుటకుఁ జేఁతనైనన్ని ప్రయత్నములను జేయక విడుచువారు కారు. సాయంకాలమునందే యిల్లు విడిచిపోయిన వైద్యు డింకను తనయింటికి రాలేదు; వా రేదియో దుస్తంత్రము నడపుచున్నట్లు తోఁచుచున్నది. వా రెంతటివిపత్తు నైనను లక్ష్యము చేయువారు కారు.

శచీం : తీరిక కలిగినప్పు డావశ్యక మని తోఁచినప్పుడు మీ రొకసారి వచ్చి నాకు దర్శన మిచ్చుచుండవలయును.

దేవేం : అట్లే వచ్చెదను. ఈలోపలిదుస్తంత్రములను లోపలిసమాచారములను బాగుగఁ గనుపెట్టుచుండుము. కార్యగతులు మిగుల భయంకరముగా నున్నవి. ఇఁక నేను పోయెదను.

"చిత్తము" అని చెప్పి శచీంద్రుఁ డాదిడ్డిగుమ్మమునుండి యానందకుటీరమునకుఁ బోయెను.



# మూడవ భాగము

౧

దేవేంద్రుఁడు మరల నింటికి వచ్చునప్పటికిఁ బ్రాతఃకాల మయ్యెను. ఆప్రాతఃకాలమునందలి బాలభాస్కరుని యుపరంజి కిరణములు దిగంతముల వ్యాపించియుండెను. జగ మంతయు రక్తకాంత్యుజ్జ్వలమై యుండెను.

గృహద్వారముఁ జేరినతోడనే యాతని హృదయమున నమంగళశంక యుదయించుటచేఁ గలఁత నొంది యతఁడు లోపలఁ బ్రవేశించెను. అంతట నిశ్శబ్దముగా నుండెను. దేవేంద్రుఁడు వేగముగా మేడమీఁదికిఁ బోయి శయనమందిరమును బ్రవేశించి నలువంకల బరీక్షించి చూచెను. అక్కడ నెవ్వరును లేరు. "రేవతీ! రేవతీ! మనోరమా! మనోరమా!" అని బిగ్గరగాఁ బిలిచెను. ప్రత్యుత్తరము రాలేదు.

దేవేంద్రవిజయుఁడు "ఏమి యీవింత! ఇంటిలోనివా రందఱు నెచ్చటకుఁ బోయి యుందురు!" అని యనుకొనుచు ప్రక్క యంగణములోనికిఁ బోయి చూచెను. ఎక్కడ నుంచిన వస్తువు లక్కడనే యున్నవి. ఆతనిచూపు లింకను గొంత దూరమువఱకును పోయినవి. అటు చూచునప్పటి కాతని తల తిరిగిపోయెను, కన్నులఁ జీకటులు గ్రమ్మెను. ఆముంగిటియం దొకచోట మొగముతుడుచుకొను చొకవుసడ్డ రక్తమున దడిసి పడియుండెను. అది రేవతిది. ఎన్నఁడు నాతని హృదయ మింతగాఁ జలియించియుండలేదు. అతఁడు ధైర్యము వహించి ముందు చేయవలసిన కార్యములనుగూర్చి నిర్ణయించుకొనుటకుఁ బ్రయత్నించెను.

క్షణములోనే దేవేంద్రుని భావములు మార్పుల నందుటచే నాతనిముఖమండలము ప్రదీప్తమై యుండెను.

అతఁడు శచీంద్రునితోఁ మాటలాడుటకై ధరియించిన గూనివాని వేషము దీసివైచెను. అరిపోయిన యాతనిముఖ మండలమున గంభీరరేఖలు కానవచ్చుచుండెను. కనుబొమలు రెండు నైక్యము నందెను. మూఁడుగా నందుఁ గొంచెమైనను రక్తకాంతు లగుపడుట లేదు. విశాలము లైనకన్నులు రెంటి నుండియు నగ్నిస్ఫులింగములు బయలుదేరుచుండెను.

అనంతరము దేవేంద్రుఁడు శయనమందిరమును మరల నొకసారి పరిశోధించి చూచి దొంగలు వచ్చి పడునప్పటికి రేవతియు మనోరమయు నొక్కచోటనే పరుండి యుండురనియు, వారికిఁ దెలియకుండ నాదుర్మార్గులు వారిని మఱియొకచోటికిఁ గొనిపోయి యుందురనియు నూహించుకొనియెను. కాని యచ్చట రక్తముతోఁ దడిసియున్న చొకమును జూచి యది యెట్లు వచ్చి యుండు నని కొంచెము సందేహించెను.

౨

దేవేంద్రుఁడు సుబ్బుగృహమునొద్దకు వేవేగముగాఁ బోయెను. ఆమందిరమునకు వెనుక చిన్నగుడిసె యున్నది. అం దొక భాగమున వంట చేసికొని మఱియొకభాగమునఁ గంబళి పఱచుకొని యాసేవకుఁడు శయనించుచుండును.

దేవేంద్రుఁడు పోయి చూచునప్పటికి సుబ్బు తనశయ్యపైఁ బరుండి యుండెను. కదలకుండున ట్లాతని కాలుసేతులు బంధించి యున్నవి. మాటలాడుటకు వలనుపడకుండ నాతనినోట గుడ్డలు గ్రుక్కినారు. అంతయును జూచి దేవేంద్రుఁడు మొట్టమొదట సేవకుని బంధనములను వదలించెను.

ఇంతకుముందు జరిగిన దుష్కృత్యములనుగాంచుటవలనను తన కట్టియవస్థ సంభవించుటవలనను స్మృతితప్పి యున్న యాతనిని దేవేంద్రుఁడు వెలుపలకుఁ దీసికొనివచ్చి నెమ్మదిగా "సుబ్బా! విశేషము లేమి? వేగముగాఁ జెప్పుము!" అని యడిగెను.

సుబ్బ : క్షమింపవలయును. నా కేమియును దెలియదు. ఊరక వ్యర్థుఁడనై పడియుంటిని.

దేవేం : వారు నిన్ను మొట్టమొదట నెచ్చట నున్నప్పుడు పట్టి బంధించిరో చెప్పుము.

సుబ్బ : ఈయింటియందే ఇప్పుడు నే నున్నయీప్రక్కపైఁ బరుండియున్నప్పుడే—

దేవేం : ఈదారుణకృత్య మంతయు నెప్పుడు జరగినది? ఎంత రాత్రివేళ?

సుబ్బ : రాత్రి మూడుగంటలు కొట్టిన తరువాతనే.

దేవేం : అయ్యో! నేను రెండుగంటలు ముందుగా వచ్చి యుండినయెడల బాగుగనే యుండును. నీవు వారిని చూచితివా? వారందఱు నెంతమంది యున్నారు?

సుబ్బ : నలుగురు.

దేవేం : అందఱును పురుషులేనా?

సుబ్బ : కాదు. అందు యువతికూడ నున్నది.

దేవేం : ఆమెముఖలక్షణము లెట్లుండునో బాగుగఁ దెలియునట్లు చెప్పఁగలవా?

సుబ్బ : చెప్పఁజాలను. నే నామెముఖము జూడలేదు; చూచుటకు వలను పడలేదు. ఆమె మేలిముసుఁగు వైచుకొన్నది.

దేవేం : తక్కినవారు ముగ్గు రున్నారు కదా? అం దెవ్వరినైన బాగుగఁ జూచితివా? ఇప్పుడు మరల వారిని జూచి నచో నానవాలు పట్టఁగలవా?

సుబ్బ : వారు ముప్పురునుగూడఁ మొగములపై ముసుఁగు లను వేసికొని యున్నారు.

దేవేం : పెద్దవాండ్రా? చిన్నవయసువారా?

సుబ్బ : అం దొకఁడు చాల బలము గలవాఁడు. మఱి యొకఁడు వానికిఁ దగిన సేవకుఁడు.

దేవేం : వారి కంఠస్వరమునుబట్టి నీవు వారి నానవాలు పట్టఁగలవా ?

సుబ్బు : వా రెవ్వరును మాటలాడనే లేదు. ఆయువతి చేయుచున్న సంజ్ఞలనుబట్టియే కార్యములు జరుగుచుండెను. ఆమెసంజ్ఞ వలననే వారితో "ఈతనిగుండెలపైఁ గత్తి నాటుకొని యుండవలెను ! ఏమైన గందరగోళము చేయు నేమో ! పని సులభముగా జరగిపోవలయును" అని చెప్పెను.

దేవేం : ఆయువతియే యీాదుస్తంత్రమున కంతకును మూలము ?

సుబ్బు : అవును.

దేవేం : నిన్నట్లు బంధించినతరువాత వా రేమేమి పనులను జేసిరో నీవు చూచితివా ?

సుబ్బు: తరువాత నాయువతి మొగము జేవురింప, బొమలు ముడివడుచుండ, నాయొద్దకు వచ్చి తల వంచి నా మొగము వంకఁ జూడసాగెను. వారు నావక్షమునఁ గత్తితోఁ బొడిచిరో, లేదో చూచుటకై వచ్చియుండు ననియు, నన్నుఁ బొడిచి వేయక పోయినయెడలఁ దానే యట్లు చేయుటకు నిశ్చయించుకొనియె ననియు నప్పుడు నే ననుకొంటిని. కాని యామె నాతో "మీా యధికారి వచ్చినయెడల నాతనితో నీమందిరమున నితర మనుష్య ప్రచారమున కిదియే మొదలని చెప్పుము. రెండవసారి మేము వచ్చినప్పు డాతని ప్రాణవాయుప్రచారమే లేకుండఁ జేసెద మని కూడఁ దెలుపుము ! ఇదియే నా దృఢసంకల్పము. ఎన్నిప్రయత్నముల నైనఁ జేసి, యెట్టికష్టముల కైన సహించి, యెంతనష్టమున కైన నోర్చి యాతనిప్రాణముల నెట్లయినఁ దీసివేయుదు మని హెచ్చరింపుము" అని చెప్పెను.

దేవేంద్రుఁడు "నేను పోయి వారినిఁ గనుపెట్టుటకు గుర్తులను దెలుపఁగలవా ?" అని యడిగెను.

సుబ్బ : నే నెంతమాత్రము మనవి చేయఁ జాలనివాఁడ
నై పోయితిని.

దేవేం : నీవలన నొకపని కావలసి యున్నది.

సుబ్బ : ఆజ్ఞాపింపవలయును.

దేవేం: నీవు వేగముగఁ బోయి ఖదరపురమున నదీతీరము
నందున్న యానందకుటీర మనుపేరు గల పెద్దమేడను కనుపెట్ట
వలయును. ఆయూర నంతటికి ఘనమందిరము వేఱొండు లేదు.
ఆ భవనము చుట్టును దోఁట యున్నది. ఆయింటియందే "వీర
బహు" అను బండివాఁ డున్నాఁడు. రహస్యముగా నీ వాతనిం
గలిసికొనవలసియున్నది.

సుబ్బ : చిత్తము.

దేవేం : ఆబండివాఁడు మన శచీంద్రుఁడే. తెలిసినదా ?

సుబ్బ : చిత్తము.

దేవేం : సరియే. ఆతనియొద్దకుఁ బోయి నీ వెల్లసమా
చారములను దెలిసికొని రావలయును. నిన్నటిరాత్రి యానంద
కుటీరమునం దెవ్వ రెవ్వ రున్నారో, యెవ్వ రెవ్వ రటనుండి
వెడలిపోయిరో వారిసంగతులను బాగుగఁ దెలిసికొనుము.
వేగముగాఁ బొమ్ము. ఆతఁడు చెప్పిన సమాచారముల నన్నిటిని
విని గ్రహించి జ్ఞప్తియం దుంచుకొని యుండుము. ఆవశ్యక
మైనప్పుడు నీవలనఁ దెలిసికొనఁ గలను.

సుబ్బ : పరుగెత్తుకొని పోయెదను. కాని యొక విన్నప
మున్నది. అమ్మగారియెడల నేమైన దారుణకృత్యములు జరగి
పోయిన వేమోయని భయ మగుచున్నది.

దేవేం : ఎట్టివిపత్తులు సంభవించినవో తెలియుట లేదు.
చాల సందిగ్ధావస్థయందుఁ బడియున్నాఁడను. వారు మనోరమతోఁ
గూడ రేవతిని దీసికొని పోయియున్నారు. వారిని వెదకి కనుపెట్టి

పట్టుకొనులోపలనే వారి కెట్టిసంకటములు కలుగనున్నవో పరమేశ్వరునికే తెలియఁగలవు. నీవు పొమ్ము.

3

సేవకుఁడు వెడలిపోయినతరువాత దేవేంద్రుఁడు యింటివెనుక భాగమునకుఁబోయి పరీక్షించెను. వెనుకఁ గొంతభూమి పెరటుగా నున్నందున దానిచుట్టు నెత్తయినగోడ కట్టి దానిపై గాజు పెంకులు నాటినారు. దేవేంద్రుఁడు బాగుగఁ బరిశీలించి చూడఁగా గోడపై నొకచోటఁ గంబళి పఱచియుండెను. గోడపై కెక్కి చూచెను. వెలుపలిభాగమున నెనిమిదియిటుక లొక దానిపై నొకటిగఁ జేర్చియున్నవి. అందువలన నాదుర్మార్గులు గోడపై కెక్కి లోపలఁ బ్రవేశించి పశ్చిమద్వారమునందలి తాళమును బగులఁగొట్టి యుందురని దేవేంద్రుఁ డూహించెను.

ఆ నలుగురిమీఁద నేరము మోపుటకును వారిని వెన్నంటి పోఁగూడ దనియు, రక్తమయమై యున్న చొకము విచారణకు ముఖ్యమైనది కాదనియు, సుబ్బన్నవలనఁ దెలియవచ్చిన సమాచారము లేవియు బ్రయోజనకరంబులు కావనియుఁ దగిన దృష్టాంతరములతో నేరము బయలుపడువఱకు జాగరూకతతోఁ బ్రయత్నింపవలయు ననియు నాతఁడు నిశ్చయించుకొనియెను.

దేవేంద్రుఁడు చాల యోచించి యింటికిసమీపమున నున్న యారక్షకభటాలయమునకుఁ బోయి ముఖ్యాధికారిఁ జూచి "నిన్నటిరాత్రి పుర మంతయును దిరిగి కావలి గాయుచున్న నగర రక్షకభటుఁ డెవ్వఁడు?" అని యడిగెను.

రక్షకభటాధికారి రామకృష్ణ ముఖోపాధ్యాయునకు నలువదియాఱు సంవత్సరముల వయసుండును. దేవేంద్రవిజయుని బాగుగ నెఱిగిన యాతఁడు దేవేంద్రునిమాట లాలించి రాత్రి పురరక్షణార్థమై తిరిగిన రక్షకభటుని బిలిపించెను. ఆతనిపేరు జయసింహుఁడు.

దేవేంద్రుఁడు జయసింహుని మఱియొకచోటికిఁ బిలిచి “రాత్రి మూఁడుగంటలు వేసినతరువాత నీవెక్కడ నుంటివి ?” అని ప్రశ్నించెను.

జయ : మీ మందిరమునకు దక్షిణ భాగమున నిలువఁబడి యుంటిని.

దేవేంద్రుఁడా దురాత్ములు తమ కార్యమును నెఱవేర్చుటకై బండి నెక్కి వచ్చియుందురని యూహించి యా భటునితో “మా యింటిముంగిట నిల్చియున్న బండి విషయమై నీ కేమైనఁ దెలియునా ?” అని యడిగెను.

జయ : తెలియదు. అచ్చట బండి నిలుచుట మాత్రము చూచితిని.

దేవేం : మంచిది. ఎప్పుడు చూచితివి ? అప్పటి కెంత రాత్రి యైయుండును ?

జయ : మూఁడు గంటలై యుండవచ్చును.

దేవేం : ఆ బండి మా యింటిముంగిట నెంతసేపటివఱకు నిలిచి యున్నది !

జయ : సరిగాఁ జెప్పఁజాలను. బండి యక్కడ నిలిచిన తరువాత నేను పనిచేయవలసిన కాలము ముగియుటవలన స్టేషనుకు మరలిపోతిని.

దేవేం : ఆ బండిలో వచ్చినవా రెవ్వరో కనుపెట్టితివా?

జయ : చూచితిని. ఒక యువతి.

దేవేం : ఆమె యెట్లున్నది ? ఆమె నిదివఱ కెన్నఁడైన జూచితివా ?

జయ : ముఖము జూచుటకు వలనుపడినది కాదు. ముఖమున మేలిముసుఁ గున్నది.

దేవేం : బండి దిగి వెంటనే మా మందిరము లోపలకుఁ బోయినదా ? ఆమెతోఁగూడ మఱి యెవ్వరును లేరా ?

జయ : ఎవ్వరును లేరు.

దేవేం : అది అద్దె బండియా? సొంత బండియా?

జయ : చాల విలువగల బండి. మిగుల నందముగా నున్నది. సామాన్యమైన యద్దె బండ్లవంటిది కాదు.

దేవేం : ఆ బండి మా యింటిముంగిట నిలిచియుండుట నీవు చూచితివి గదా? నీవేమి తెలిసికొంటివి?

జయ : ఎవ్వరో పెద్దమనుష్యులు పనిమీఁద మీతో మాటలాడవలసి వచ్చియుందు రనుకొంటిని.

దేవేం : నే నప్పుడు మాయింట లేకపోతిని. వారిని నేను చూడనే లేదు. వా రైనను దమయూరు, పేరు, మా యింటియొద్దఁ జెప్పిపోలేదు.

జయ : అయ్యో! అంతటివారు మిమ్ములను జూడకయే పోయిరా? ఎవ్వరో ధనవంతులో, జమీందారులో యని యూహించితిని.

దేవేం : అంతటివారు, జమీందారులును, ధనవంతులును గాక మఱి యెవ్వ రగుదురు?

జయ : ఆమె మహారాజ్ఞి యే యగును. ఆమె మెడలి నిండ నెన్నియో యాభరణము లున్నవి.

దేవేం : బండివాఁడు, నిరువురు గుఱ్ఱపు సేవకులును లేరా?

జయ : ఇద్దఱు బండివాండ్రు. అశ్వసేవకుఁ డొక్కఁడు. బండివాండ్రిద్దఱును బండిముందరఁ గూర్చుండిరి. అశ్వసేవకుఁడు వెనుక భాగమున గూరుచుండెను. ఆ బండి వచ్చి మీ యింటి ముంగిట నిలిచినతోడనే సేవకుఁడు వచ్చి బండితలుపులను దెఱచి యొక వంక నిలువఁబడియెను. తత్క్షణమే యువతి క్రిందికి దిగి మీ మందిరములోపలకుఁ బోయెను.

దేవేం : ఆ బండికిఁ గట్టిన గుఱ్ఱములు రెండు నెట్టి రంగులవో చెప్పగలవా?

జయ : ఒకటి నల్లనిది. రెండవది తెల్ల గుఱ్ఱము.

దేవేం : ఆ బండి యచ్చటి కే దిక్కునుండి వచ్చియున్న దని నీ వూహించితివి ?

జయ : తూర్పు దిక్కునుండి రాజమార్గమును బట్టి వచ్చి యుండుట చూచితిని.

దేవేం : అక్కడనుండి మరల నా బండి యేదిక్కు ననుస రించి పోయినది ?

జయ : ఆ బండి యెట్లు పోయినదో నేను చూడలేదు. సమయము ముగియుటచే ముందు నాస్థానమున పని చేయవలసిన యాతనిని పంపుటకై స్టేషనుకుఁ బోతిని.

దేవేం : నీ స్థానమునఁ బనిచేయవలసిన యాతనితో నీవా బండి సంగతి దెలిపితివా ? ఆతని పేరేమి ?

జయ : రఘువీర పాండ్యా.

దేవేం : ఆతని నే నొకసారి చూడవలయును. ఆతనితో మాటలాడవలయును.

జయ : గందరగోళములు పుట్టినవా యేమి ? అట్టిత్తొం దర లేవియును గలుగలేదు గద !

దేవేం : ఏవియు లేవు.

౪

దేవేంద్రుఁడు జయసింహుని బంపివైచి రఘువీరపాండ్యాను బిలి పించి యాతనితో "నీవు నిన్న రాత్రి పుర రక్షణమునకై తిరుగు చున్నప్పుడు మా మందిరముముంగిట బండిని జూచియుంటివా ?" అని యడిగెను.

రఘు : మహాస్వామీ ! చూచితిని. దాని ప్రక్క నుండియే పోయితిని. అది మీ యింటిముంగిటనే యున్నది.

దేవేం : నీవు చూచునప్పటి కాబండిపై నిరువురు గుఱ్ఱపు సేవకు లున్నారా?

రఘు : ఒక్కఁడును లేఁడు. పిల్లవాఁడు రెండు గుఱ్ఱముల కళ్యములను పట్టుకొని రాజమార్గమునకుఁ బార్శ్వమున నిలువఁబడి యున్నాఁడు.

దేవేం : నీ వాసమయమున నా పిల్లవానితో నేమైన మాటలాడియుంటివా?

రఘు : మాటలాడింపక యూరకుందునా? "గుఱ్ఱపువాం డ్రెక్కడ నున్నారు?" అని వాని నడిగితిని. "వారు లోపలకుఁ బోయియున్నారు," అని యా పిల్లవాఁడు ప్రత్యుత్తర మిచ్చెను. తరువాత నే నటనుండి పోయి పురమంతయును జుట్టి తిరిగి మరల మీ యింటియొద్దకు వచ్చితిని.

దేవేం : మరల నీవు వచ్చునప్పటి కేమి జరిగినది? అప్పు డెవ్వరైన నీ కగపడిరా?

రఘు : నే నక్కడకు వచ్చితిని. అంతలోనే యాబండి తూర్పు దిక్కు రాజమార్గమునుబట్టి వెడలిపోవుచుండెను.

దేవేం : అప్పు డిరువురు బండివాండ్రు నొక యశ్వసేవ కుఁడు నా బండిపై నెక్కియున్నట్లు నీవు చూచితివా?

రఘు : సేవకుఁ డెవ్వఁడును లేఁడు. ఇరువురు బండి వాండ్రు మాత్రమే యున్నారు.

దేవేం : ఆ గుఱ్ఱముల కళ్యములను పట్టుకొని నిలుఁవబడి యున్న పిల్లవానిని నీ వెఱుఁగుదువా? ఆతనిని తీసికొని రాగలవా?

రఘు : సెలవైనచో నెప్పుడు గావలసిన నప్పుడే తీసికొని రాఁగలను.

దేవేం : రాత్రి యంతయును దిరిగి తిరిగి వచ్చితివి. నీకు నిదుర కావలయునా? రెండు రూపాయలు కావలయునా?

రూపాయలు కావలసియుండెనేని నీ విశ్వాసము నాతోఁగూడ వచ్చి యా పిల్లవానిని చూపింపుము.

రఘు : అట్లే. దయచేయుము.

తరువాత దేవేంద్రుఁడా రక్షకభటాలయమునుండి వెలుపలకు వచ్చి రఘువీరునితోఁగూడ బయలుదేరి పోయెను. అతనికిఁ దాను చెప్పినట్లు రెండు రూపాయలను బహుమానముగా నిచ్చెను.

౨

రఘువీరుఁడును పిల్లవాని నరగంటలో దీసికొనివచ్చి దేవేంద్రుని యెదుటఁ బెట్టెను. వాఁడు నిద్దురకన్నులను నులుముకొనుచు నిలువఁబడియెను. దేవేంద్రుఁ డాతని నాదరముతోఁ బిలిచి "అన్నా! నీ పేరేమి?" అని యడిగెను.

పిల్ల : శ్రీశచంద్రరాయలు.

దేవేం : ఇప్పుడు నీవు పరుండి నిద్దురపోవు చుంటివి కాఁబోలు?

శ్రీశ : ఔను. నిన్నటిరాత్రి చాలసేపటికి బరుంటిని.

దేవేం : మంచిది. నీవు లేచి యిచ్చటకు వచ్చుటవలన నిద్దుర పోయినది కాదా?

అని దేవేంద్రుఁ డాపిల్లవానిని దగ్గఱకుఁ బిలిచి యాతని చేతిలో నైదురూపాయల నోటు పెట్టెను.

శ్రీశచంద్రుఁడు దాని నందుకొని చూచి మిగుల నానందముతో "అయ్యా! చాల బాగుగ నున్నది. ఇఁక మూఁడు రాత్రులు జరిగినను నిద్ర నా సమీపమునకు రాఁజాలదు." అనియెను.

దేవేం : ఇప్పు డారూపాయలను నీవు తీసికొని నే నడిగిన ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరము చెప్పుము. నీ వెఱిఁగి యున్నంత

వఱకు నిశ్చయముగాఁ జెప్పవలయును. గుఱ్ఱపుఁ గళ్ళెములను పట్టుకొని నిలువఁబడి యుంటివి కాదా ?

శ్రీశ : ఔను. మీరు నిజముగా నక్కడకు వచ్చి చూచి నట్లే చెప్పితిరి.

దేవేం : అట్లు నీవెంత సేపటివఱకు కళ్లెములను పట్టుకొని నిలిచియుంటివి ?

శ్రీశ : కొంచె మెచ్చుతగ్గుగా నఱగంట సేపట్లుంటిని.

దేవేం : కళ్లెములను బట్టుకొన నీ కాజ్ఞాపించినవా రెవ్వరు ? అప్పటికి యెన్ని గంటలై యుండును ?

శ్రీశ : బండివాఁడే నాతోఁ జెప్పియున్నాఁడు. అప్పటికి మూఁడు గంటలు దాటిపోయియుండును.

దేవేం : అంతరాత్రివేళ నొంటరిగా నీ వెక్కడనుండి బయలుదేరి వచ్చుచుంటివి?

శ్రీశ : మా మేనమామ యింటినుండి వచ్చుచుంటిని.

దేవేం : బండివాం డ్రిద్దఱు సేవకుఁ డొక్కడు నీవువచ్చు నప్పటి కచ్చట నున్నవారు ముగ్గురే కాదా ?

శ్రీశ : ఔను.

దేవేం : నీవా గుఱ్ఱములను పట్టుకొన్న తరువాత వా రందఱు నెచ్చటకుఁ బోయిరి ?

శ్రీశ : బండి కెదురుగనున్న యింటిలోనికిఁ బోయిరి.

దేవేం : వారు దుస్తులను మార్చుకొని వెళ్ళినారా ?

శ్రీశ : మార్చుకొన లేదు.

దేవేం : వారిలో నెవ్వరియొద్దనైన మూట వున్నదా ?

శ్రీశ : ఒక్కరియొద్ద బట్టల మూట యున్నట్లు కనఁ బడినది.

దేవేం : వా రా యింటినుండి మరలి వచ్చినప్పుడు వా రేమే వస్తువులను దీసికొని వచ్చిరి ?

శ్రీశ : మొట్టమొదట నొక్కఁడు నాయొద్దకు వచ్చి "మీ యింటికిఁ బొమ్ము. పాపము, చాల రాత్రియైనది," అని చెప్పెను.

దేవేం : ఇంటికిఁ బోయితివా ?

శ్రీశచంద్రుఁ డాప్రశ్నమునకు ప్రత్యుత్తరము జెప్పక దేవేంద్రుని మొగమువంకఁ జూచుచు నిలువబడియెను. దేవేంద్రుఁడు కొంచెము నవ్వి " సంగతి యంతయును బోధపడినది. నీవు మీాయింటికిఁ బోలేదు. దూరమునకుఁ బోయి నిలిచియుండి యట జరుగుచున్న యెల్ల విషయములను గనుపెట్టుచుంటివి కాదా ? తరువాత నేమిజరిగినది ? " అనియెను.

శ్రీశ : తరువాత వా రందఱు నొక్కొక్కరుగా నాయింటి నుండి వెలుపలకు వచ్చిరి.

దేవేం : ఇంటినుండి వెడలి వచ్చినప్పుడు వా రేమైనఁ దీసికొని వచ్చిరా ?

శ్రీశ : మొట్టమొదట యువతిని దీసికొనివచ్చిరి. ఆమె నీవల నుంచి మరల లోనికిఁ బోయి మఱియొక కాంతనుగూడఁ దీసికొనివచ్చిరి.

దేవేం : అట్లు వారు తీసికొనిపోవుచుండఁగా నాకాంతలు కేకలు వైచియుండ లేదా ?

శ్రీశ : ఆకాంత లిరువురిలో నొకరైనఁ గిక్కురు మన లేదు, శవములు ! ప్రాణములే పోయినప్పుడు కేకలు వేయ నెక్కడిది ?

దేవేం : శవములేనా ? అట్లు నీతో నెవ్వరు చెప్పిరి ?

శ్రీశ : బాగుగఁ జూచినప్పుడు తెలియ కుండునా ? ఆభయంకర సందర్శనమువలన నాప్రాణములు నిలువున నెగసి

పోయిన ట్లయ్యేను రామనామమును స్మరించుకొనుచు నొక్క పరుగున నింటికిఁబోయి మాయిల్లు త్రొక్కి చూచితిని.

దేవేం : ఊరక పాఱిపోవుటయో ?

శ్రీశ : సామాన్యవిషయములకు భయపడి పాఱిపోవు నంతటి పిఱికివాఁడను గాను.

దేవేం : శ్రీశా ! నీ వప్పుడు భయపడి పాఱిపోవక యాబంకీని వెంబడించి యదిపోయినస్థలమును గుప్తపట్టి తెలిసి కొని యున్న యెడల నీయదృష్టము మిగుల బాగుగా నుండును. నీకు విశేషలాభమే కలుగును. ఆమాట కేమి ? ఇప్పుడు మంచి యంగీ, పాయిజామాసెల్లా పదిరూపాయలనుగూడఁ దీసికొనుటకు నీ విష్టపడియెదవా ? మనసు కుదురుపఱచుకొనుము. నీవు రెండు దినములు నాయొద్దనుండి నేను చెప్పినకార్యములను నెఱవేర్చుచుండవలయును.

శ్రీశ : నేఁటినుండియే ?

దేవేం : ఈదినమునుండియే.

శ్రీశ : మీ రెప్పుడు సిద్ధముగా నుండవలయు నని సెల విచ్చెదరో, యప్పుడే సంసిద్ధుఁడనై యుందును.

దేవేం : ఇప్పుడే నిన్ను నావెంటఁ దీసికొని పోయెదను.

శ్రీశ : ఎక్కడకు ?

దేవేం : అనేక స్థలములకు.

శ్రీశ : వలదు స్వామీ ! నాకు మిగుల భయ మగుచున్నది. ఇంతటి చిన్నతనమున ప్రాణముల నేల పోఁగొట్టుకొనవలయును ? అయ్యా ! దయయుంచి నన్ను వదలిపెట్టుఁడు.

దేవేం : నీ విట్లేల భయపడియెదవు ? ఈతనిని నీ వెఱుఁగుదువా ?

శ్రీశ : అయ్యో! నే నెఱుఁగనా? రఘువీర పాండ్యా కాదా?

దేవేం : ఇతని నీవు బాగుగ నెఱుంగుదువు కావున నితని వలన నాసంగతులను తెలిసికొనుము. తరువాత నీకు నాయెడల నమ్మకము కలుగనియెడలఁ బొమ్ము!

శ్రీశ : అక్కఱ లేదు.

దేవేం : నీ విప్పుడు నాతోఁగూడ వచ్చుటకుఁ ద్రికరణ శుద్ధిగా నంగీకరింతువా?

శ్రీశ : చిత్తము.

దేవేం : అట్లయినచో రమ్ము!

ౘ

దేవేంద్రుఁడు శ్రీశచంద్రుని తన మందిరమునకుఁ దీసికొని పోయెను. అచ్చట మాఱువేషమును దాల్చి శ్రీశచంద్రునకుఁగూడ మఱియొక వేషము వైచెను. తరువాత శ్రీశచంద్రునకుఁ దెలుప వలసినసంగతుల నన్నిటిని బాగుగ బోధించి యతిచతురునిం జేసెను.

ఆదిన మాదివారము. సాయంకాల మైనతరువాత దేవేంద్రుఁడు ముసలిగ్రుడ్డివాని వేషము ధరియించుకొని వెలుపలకు వచ్చెను. తలపై నరసినవెండ్రుకలు మిగుల నొత్తుగానుండెను. గడ్డమును మీసమునుగూడ నరసినట్లే యుండెను. తొడుగుకొనిన యుడుపు లతినిర్మలములై, పరిష్కృతములై యమూల్యములై యుండెను. శ్రీశచంద్రుఁ డాతనిచేయి పట్టుకొని నడిపించు కొనుచు మునుముందు వచ్చుచుండెను. ఆశిష్యుని వేషముకూడ మిగుల నందముగను, యథానురూపముగ నుండెను.

శ్రీశచంద్రునిఁ దనవెంటఁబెట్టుకొని దేవేంద్రవిజయుఁడు రెండంతస్థుల పెద్దమేడయొద్దకు వచ్చి నిలిచెను. ఆమందిరమున గొంచె మెచ్చుతగ్గుగా నిన్నూఱుమంది నివాసము చేయుచుండిరి. వారిలోఁ గొందఱు కొలఁది వేతనములు గల రాజకీయోద్యోగస్థులును, విద్యార్థులును విశేషముగా నుండిరి. కొందఱు వైద్యులు మఱికొందఱు న్యాయవాదులు నుండిరి.

ఆమందిరము నాలుగు భాగములు. ప్రతిభాగమునకును ముందు పెద్దయంగణములు కలవు. అందొకచోట బ్రాహ్మణులకు భోజనములు పెట్టు పూటకూటియి ల్లున్నది. ఆయింటియజమానునిభార్య వంట బాగుగఁ జేయును. న్యాయవాది తులసీదాసున కామెకూరలు చాల నిష్టము. ఆతఁడాపూటకూటియింటనే భోజనము చేయుచుండును.

ఆమందిరమున తులసీదాసుకూడ మూఁడుగదులద్దెకుఁ దీసికొనియుండెను. ఆతఁడు మీఁదియంతస్థు గదిలోఁ గూర్చుండి కక్షిదారులతో మాటలాడుచుండును. అతనికి మఱిరెండు గదులు క్రింద నున్నవి. అందొకటి మూఁడవమహాలునందును, మఱియొకటి నాలుగవమహాలునందును గలదు. మూఁడవమహాలు గదిలో గుమాస్తా కూరుచుండి యుండును. అభియోగపత్రములు, మనవి లేఖలు వ్రాయుట మొదలగుపను లచ్చట జరగుచుండును. నాలుగవ మహాలు గదిలో తులసీదాసు పరుండియుండును. ఆగది మఱి కొన్ని యితరకార్యములకుఁగూడ నుపయోగ పడుచుండును. ఆతఁ డెవ్వరితోనైన నేకాంతముగను, నిరంతరాయముగను రహస్యము లైనవిషయములనుగూర్చి యాలోచింపవలసి వచ్చినప్పుడును గూఢ తంత్రములను నడపవలసి వచ్చినప్పుడు నాగదిలోఁ గూరుచుండును.

గుమాస్తా తనగదిలోఁ గూరుచుండి యేమియో వ్రాసికొనుచుండెను. ముసలివేషము ధరించియున్న దేవేంద్రునిచేయి

పట్టుకొని శ్రీశచంద్రుఁ డక్కడకు వచ్చినిలువఁబడి దేవేంద్రునితో "ఇక్కడ వకీలుగుమాస్తా యున్నాఁడు" అని చెప్పెను.

దేవేంద్రుఁడు గుమాస్తా నుద్దేశించి "అయ్యా! తులసీదాసుగా రిచ్చట నున్నయెడల వారితో, క్రీస్తువాడనుండి గోపాల భట్టాచార్యుఁ డేదియో మీతో మాటలాడవలసినపని యుండి మీదర్శనమునకై వచ్చియున్నాఁ డని చెప్పుఁడు" అనియెను.

గుమా : స్వామీ! వారు చాలఁ దొందరపనులలో నున్నారు.

దేవేం : ఉండవచ్చును. అయిదు నిమిషముల సమయ మిచ్చిన జాలును. మాటలాడి పోయెదను. అయిదునిమిషముల కంటె హెచ్చుకాల మక్కఱలేదు. నాకును జాలఁ దొందరపని యున్నది. మీరు త్వరగాఁ బోయి వారితో మనవిచేయవలెను.

ఈ మాటలను గుమాస్తా తులసీదాసునకుఁ జెప్పుటకయి పోయెను. గుమాస్తా గదిగుమ్మ మొకటి యంగణనమున కెదురుగాను, మఱియొకటి నాలుగవమహలు ముంగిటి కెదురుగా నుండెను. ఆ ద్వారమునుండియే యాఁతడు రహస్యాగారమునం దున్న తులసీదాసును జూచుటకై పోయెను. గుమాస్తా యా తలుపులను దెఱచి పోయినతఱువాత దేవేంద్రుఁడును, శ్రీశచంద్రుఁడును, మందిరమునం దున్నవా రెవ్వరో యని చూచిరి. అప్పు డెవ్వఁడో యపరిచితుఁడు దేవేంద్రునికంటఁ బడియెను. శ్రీశచంద్రుఁడు చెప్పిన ముఖలక్షణములను బట్టి యాఁతఁ డింపగా డాక్టరు నవీనచంద్రుడని తోఁచెను.

౭

శ్రీశచంద్రుఁడు దేవేంద్రుని చెవిలో మెల్లమెల్లగా "ఆ యింటి యం దున్నవారిలో నిద్దఱిని చూచితిని" అని చెప్పెను.

దేవేం : బాగుగా గుర్తించితివా?

శ్రీశ : బాగుగ నానవాలు పట్టితిని. ఎప్పుడు కావలసిన నప్పుడు నిర్దేశింపఁగలను. వారిరువురను రాత్రి గుజ్జములను తోలిన మనుష్యులు. ఎన్ని మారువేషములు వేసికొనియున్నను నా కన్నులయెదుట మోసము చేయఁజాలరు. అందొక్కనికి ముక్కుప్రక్క నల్లని పుట్టుమచ్చ యున్నది. అది ఎన్ని వేషములు వేసినను మారదు. మఱియొక్కనికట్టిమచ్చయే చెవిక్రిందనున్నది. ఒకవేళ వేషములుమారినను మచ్చ లెట్లు మాయము లగును ? వాని నప్పుడే చూచితిని. ఇప్పుడా మచ్చలవలననే వారిని కను పెట్టఁ గలిగితిని.

దేవేం : బాగుగఁ దెలిసినది. ఇంక మాటలాడవలదు.

తులసీదాసునొద్దకుఁ బోయినగుమాస్తా వేగముగా నచ్చి "స్వామీ ! కొంచెమునే పాఁగవలయును. వారిప్పుడే వచ్చెదరు. ఇచటఁ గూరుచుండుఁడు" అని చెప్పి తాను కూరుచుండి తల వంచుకొని యేమో వ్రాసికొనుచుండెను.

దేవేంద్రుఁడాతనియొద్దకుఁబోయి "అయ్యా !నా చేతియం దేమి యున్నదియో చూచితిరా ?" అనియెను.

ఆతడు తలయెత్తిచూచునప్పటికిఁ దన ముఖమునకు సరిగా గుఱిపెట్టియున్న తుపాకి కన్నుఁల బడియెను. గుమాస్తా గడ గడ వడఁకుచు "అయ్యా ! ఇది యేమి ? నన్నుఁ జంపివైచెదవా ! " అనియెను.

దేవేం : మాటలాడ కూరకుండుము. నోరెత్త వలదు. నీ ప్రాణములపై నాశ యున్నయెడల, జీవింపవలయు నను బుద్ధి యున్నయెడలఁ గిక్కురు మనక యుండుము. నేను చెప్పిన మాట లను బాగుగా వినుము. మాటాడకుము. నేను తులసీదాసు కూరుచున్న రహస్యమందిరమునకుఁ బోయెదను.

గుమా : అంత తొందర ఎందులకు ? కొంచెమునే పిచ్చట గూరుచుండుఁడు. వారిప్పుడే వచ్చెదరు.

దేవేం : వారికిఁ తొందర కలిగింపవలయునని నా కిష్టము లేదు. నీకు బ్రదుకుపై నాశ యుండెనేని గందరగోళము సేయ కూరకుండుము.

అని చెప్పి శ్రీశచంద్రుని వెంటఁబెట్టుకొని దేవేంద్రవిజయ మిత్రుఁడు వెలుపలకు వచ్చెను. శ్రీశుఁ డాయింటి తలుపులను మూసి పైనిగొళ్లెమునువైచెను. గుమాస్తా యొంటరిగాఁ గిక్కురు మనక కూర్చుండియుండెను. ఆతని కదియే చెఱసాలగాఁ దోఁచెను.

౧౯

తరువాత దేవేంద్రుఁడు పోయి తులసీదాసు రహస్యమందిరము వెలుపలిభాగమున నిలువబడి లోపలివారు గుజ గుజలుగా మాటలాడుచున్నశబ్దము వినియెను. అతఁడు పిస్తోలు చేతఁ బట్టుకొని యాలోపలఁ బ్రవేశించెను. శ్రీశచంద్రుఁడుకూడ నాతని వెనుకనే పోయెను.

ఆ గదిలో నున్న ముగ్గురును దేవేంద్రునిఁ జూచి తత్తర పాటుతో లేచి నిలువఁబడిరి. ఒకడు తులసీదాసు, మఱియొకడు వైద్యుఁడు గోవిందప్రసాదసేనుఁడు. మూడవవాఁడు డాక్టరు నవీనచంద్రుఁడు.

అప్పుడు తులసీదాసు గంభీరధ్వనితో గర్జించుచు 'ఇది యేటి దారుణవ్యాపారము! ఇది దుష్కృత్యము! బందిపోటు! ఏమి యీ దురాగతము! నీ వెవ్వడవు? ఇక్కడ కెందుకొఱకు వచ్చితివి? తత్క్షణమే యావలకుఁ బొమ్ము. దూరముగాఁ బొమ్ము. పోకిరీ! పొమ్ము'' అనియెను.

దేవేంద్రుఁడు క్రోధాతిరేకమున మండిపడుచుఁ తులసీదాసుకు పిస్తోలు జూపించుచు నుచ్చైస్స్వరంబున "నేను రహస్యాపరాధపరిశోధకుడను. మీ రెల్లరును బందిగమున నుండఁదగిన యపరాధులు. ఉన్నవా రున్నట్లుగా నక్కడక్కడ నిలువఁబడి

యుండుము ! ఒక్కయడుగు ముందఱికి వైచితివో క్రిందఁ బడి పోఁగలవు. ఇదిగో నాచేతిలో పిస్తోలు ! '' అనియెను.

తుల : ఇది యేమిగందరగోళము ! నా యెదుటకు వచ్చి నిలువఁబడిన యెడల నీ పని యేమగునో తెలియఁగలదు. నీ వెవ్వఁడవు ?

దేవేం : నేను—

తుల : ఎవరు నీవు ? తులసీదాసు ననమానించుట కెవ్వరు సాహసింపఁగలరు ?

దేవేం : దేవేంద్ర విజయమిత్రుఁడు—

పత్తేదారుఁ డగు దేవేంద్రుఁడు దర్పముతోఁ బలికిన పలుకులవలన వారి మొగము లన్నియును వాడిపోయినవి. అప్పుడు డాక్టరు నవీనచంద్రుఁ డించుకనవ్వి "దేవేంద్రవిజయా ! మీరా ! ఇదివఱకు మీ నామము వినియున్నాము. ఇప్పుడు కన్నులారఁ జూచి ధన్యులమైతిమి. మీబోఁటి నైపుణ్యముగల పత్తేదారుల కిది తగిన పనికాదు'' అనియెను.

దేవేం : తగినపని కానియెడల దేవేంద్రుఁడు పూనుకొననే పూనుకొనఁడు. నిన్నటిరాత్రి జరిగించిన దుష్కార్యము లన్నియు జ్ఞప్తియందే యున్నయెడల నీపని నాకుఁ దగినదో తగనిదో మీకే తెలియఁగలదు.

నవీ : (ఆశ్చర్యముతో) నిన్నటి రాత్రియా ? ఏమి జరిగినది ? మీమాటలు తెలియుటలేదు. దయచేసి విశదముగాఁ దెలుపవలయును.

దేవేం : శ్రీశా ! ఈ ప్రక్కకు రమ్ము ! ఎట్టఎదుట నిలువబడుము.

శ్రీశచంద్రుఁడు వచ్చి వారికెదురుగా నిలువఁబడియెను.

దేవేం : శ్రీశా ! ఈ ముగ్గురుమనుష్యులలోను రాత్రి నీవు చూచినవా రెవ్వరెవ్వరు ?

శ్రీశ : వీరిద్దఱిని నేనుచూచితిని, ఒక్క చోటనే కూర్చుండి యుండిరి.

దేవేం : ఇప్పుడు నాతోఁగూడ మాటలాడుచున్న యాతని నెఱుఁగవా ?

శ్రీశ : ఎఱుఁగను.

నవీ : అయ్యా ! మీరు మామీద నట్టి యపరాధమును కల్పింపఁబోవుచున్నారు ?

దేవేం : మనుష్యాపహరణము, దొంగతనము:—

నవీం : మనుష్యాపహరణమే ? చాల గొప్ప నేరమే. అట్లయినచో నధికారుల యాజ్ఞాపత్రమును దీసికొని వచ్చితిరా యేమి ?

దేవేం : మా కధికారుల యాజ్ఞాపత్రములతో నిమిత్తము లేదు.

నవీ : అధికారుల యుత్తరువులు కావలయును. మీ రవశ్యముగా నట్టి కాగితమును జూపించవలయును.

దేవేం : మీకు క్షేమముగానుండవలయు ననును ద్దేశమే యున్న యెడల — కాలుసేతుల కినుపసంకెలలు తొడుగకుండ నెట్లయినఁ దప్పించుకొన వలయు ననునభిమానమే యున్నయెడల ససహాయులై యున్నప్పుడు మీరు దొంగిలించుకొని తెచ్చిన యాకాంతలను దక్షణమే నాకు స్వాధీనపఱుపవలయును. అట్లు చేయనియెడల మీకుఁ దరణోపాయము లేదు. ఈసంగతి యాలోచించి నిశ్చయించుకొనుఁడు.

నవీ : మా కీసమాచారము లేవియుఁ దెలియవు.

దేవేంద్రుఁడు పిస్తోలును భద్రముగాఁ బట్టుకొని "మీకుఁ దెలియదా ? బలవంతముగా 'మాయింటఁ జొరఁబడితిరి. మీ ముగ్వురిలో నొక్కఁడు బండివాని వేషమును, మఱియొకఁడు

సేవక వేషమును, ధరియించుకొంటిరి. జబండిలోఁ గూర్చున్న కాంతను నేను బాగుగ నెఱుంగుదును. ఆమె యిప్పు డానంద కుటీరమున కధికారిణి యైన మనోరమ. ఆమె చెప్పిన మాటలను బట్టి మీ రట్టిదుష్కృత్యములకు లోఁబడి పనిచేసి యుంటిరి. మీసమాచార మంతయును దెలిసికొని యున్నాఁడను. ఈపను లనుబట్టి మీమర్యాద లన్నియును దెలిసిపోయినవి. మీరు నా భార్యయు,మనోరమయు, మాయింటఁ బరుండియున్నప్పుడు వారికి మత్తుమందు నిచ్చి మైకము కలిగించి తీసికొనివచ్చి యున్నారు. అంతియకాక నాసేవకుఁ డగుసుబ్బు మిమ్ములను వెంబడించి వచ్చు నేమో యను భయముచే వాని కాలుసేతులను బంధించి నోట గుడ్డలు క్రుక్కి యొక్కచోఁ బడియుండునట్లు చేసితిరి. మీరు వెడలిపోవునప్పుడు మాసేవకునితోఁ జెప్పినమాట లింకను జ్ఞప్తియందున్నవా? మీరు నన్నుఁ దప్పక చంపివేసెద మని నాతోఁ జెప్పు మంటిరి కాదా? నన్నుఁ జంపవలయునని యున్న మీసంకల్ప మెట్లు నెఱవేఱునో చూడవలయుననియే నే నిప్పు డిచ్చటికి వచ్చియుంటిని. సామర్థ్య మున్నయెడల, నావశ్యక మైనయెడల మీయుద్దేశమును నెఱవేర్చుకొనుఁడు! ఎప్పుడైన నేఁటికైన మీచేతులలోఁ బ్రాణములను విడువవలయు ననియే యున్నాఁడను. ఇట్టిమంచిసమయము నేల పాడు చేసికొనియెదరు? మాసేవకుఁ డగుసుబ్బువక్షస్థలమునందలి రక్తమును దీసికొని పోయిన మీకత్తి యిప్పు డెక్కడ నున్నది?

"ఇక్కడ నున్నది. మాసంకల్పము శీఘ్రము సిద్ధించుగాక!" అని పలుకుచుఁ బార్శ్వమునం దున్నగదితలుపులను దెఱచుకొని మేలిముసుఁగు వైచుకొనియున్న కాంత తటాలున వచ్చి కరవాలముతో దేవేంద్రుని వెన్నుపైఁ గొట్టెను. ఆ స్త్రీ మార్వాడ దేశస్థు పోలికవస్త్రములను దాల్చి యుండెను. దేవేంద్రుని వెన్నున ఘాతము తగిలె. అతఁ డాబాధకు సహింపఁజాలక పార్శ్వవాతము

సోఁకినవానిం బోలెఁ గాలుసేతులు కదలింపఁజాలక పోయెను. చూచుచుండఁగనే యప్పుడు దేవేంద్రుఁడు తనశత్రుమండల మధ్యమున నిస్సహాయుఁడై క్రిందఁ బడిపోయెను.

ఆయువతి దేవేంద్రునిఁ గత్తితోఁ గొట్టినతోడనే యాతఁడు కొంచెము వెనుకకు జరగినప్పు డసహాయశూరుఁ డగుతులసీదాసు సారాయము తీసివేసిన గాజుబుడ్డితో నాతనితలపైఁ గొట్టెను. ఆదెబ్బ తలపైఁ దగులుటచే, దేవేంద్రుఁడు స్మృతి తప్పి నేలపైఁ బడియెను.

ఆతఁడు క్రిందఁ బడినతోడనే యందఱును శ్రీశునిఁ గొట్టుటకై వెంబడించిరి. శ్రీశచంద్రుఁడు తనప్రాణములమీఁదియాశను వదలుకొని కాలుకొలఁదిఁ బరుగెత్త నారంభించెను. ఆతఁ డెట్లో తప్పించుకొని రాజవీథిని బడి ''ఇక్కడ నెవ్వ రున్నారు? వేగ ముగా రండు! రండు! హత్యలు జరగుచున్నవి! హత్య హత్య హత్య జరగిపోయినది. పరుగెత్తుకొని రండు.''' అని కేకలు వేయఁ జొచ్చెను.

మేలిముసుఁగు వైచుకొనియున్నయువతి నవీనచంద్రునిఁ జూచి ''ఈతని బాగుగఁ బరీక్షించి చూడుము! మరణించెనో, యింకను ప్రాణములతో నుండెనో, తెలిసికొనవలయును,'' అనియెను.

''నీవు చూడుము! మరణించినట్లే తోఁచుచున్నది. చచ్చి తీరవలయును. నీవే చూడుము! నే నిప్పు డొకచోటికిఁ బోవల యును. నాకు వేఱుపని యున్నది.'' అని చెప్పుచు నవీనచంద్రుఁ డాదారుణరంగమును విడిచి పలాయితుఁ డయ్యెను.

యువతినిమాత్రమే విడిచి తులసీదాసుకూడ నవీనచంద్రునే యనుకరించి గోవిందసేనునితోఁగూడఁ బాఱిపోయెను.

వారి నుద్దేశించి యాకాంత తీక్ష్ణకంఠస్వరముతో ''గాడిద లారా! మీరు పురుషులు కారు. పోయి బ్రదుకుఁడు'' అని

నిందించుచుఁ దరువాత దేవేంద్రవిజయునిశరీరమును జూచి "లేదు. ఇంకను ప్రాణము పోలేదు. ఈసారి చచ్చును." అనిచీరచెఱఁగున దాఁచి తీసికొని వచ్చిన సురియను పైకిఁ దీసెను. దానిపై దీప కాంతులు ప్రసరించెను. ఆకత్తిపిడియందు వజ్రపుఁబొడులు తాపటము చేయఁబడి యుండెను. యువతి జాగరూకతతో నలువంకలను జూచి యాసురియ మొనతో దేవేంద్రునివక్షమును జీల్చివైచుటకు సిద్ధముగా నుండెను.

ఆసమయమునందే వెలుపల "ఏమి సమాచారము! ఆ గందరగోళ మేమి? ఏ మైనది? హత్యచేసినవా రెవ్వరు?" అని యఱచుచున్న జనుల కలకలధ్వనులు విననయ్యెను.

తత్క్షణమే యువతి కత్తిని చీరచెఱఁగున దాఁచివైచి యేమేమో భయపడుచున్నదానివలెను, మిగుల నాశ్చర్యపడుచున్న దానిపోలికను, చాల విచారపడుచున్నదానిలాగునను నభినయించుచు నుపాయాంతరము తోఁపకుండుటచే బిగ్గఱగాఁ గేకలు వైచుచు "ఓపెద్దమనుష్యులారా! మీర లెవ్వరో దయచేయుఁడు! వేగముగా లోనికి రండు! సర్వనాశన మైపోయినది! మించిపోయినది! దారుణవ్యాపారము జరగిపోయినది. రండు! చూడుఁడు" అని పలుకుచుఁ దనకత్తి యొఱుల కగపడకుండ మూసివైచి మేలిముసుఁగును దీసివైచెను.

భయంకరవ్యాపారమును జూడవచ్చినవా రెల్లరును సమ్మోహనమంత్రముగ్ధులవలె నామె యాననమువంకనే చూచుచు నిలువఁబడి పిమ్మట "ఏమి జరగినది? ఈగందరగోళ మంతయు నేమి?" అని యడిగిరి.

ఆ యువతి మొదటివలెనే యూర్పులు విడుచుచు గద్గద స్వరముతో "చూడుఁడు!" అని చెప్పుచు స్మృతి తప్పిపోవ నేలపైఁ బడియున్న దేవేంద్రుని రక్తమయశరీరమును జూపించెను. తరువాత నామె మరల నిట్టూర్పులు విడుచుచు "ఇక్కడ

నొక్క వైద్యుఁడున్నాఁడు. నాయుగనికిఁ జాల జబ్బు చేసినది. నాకుఁ గావలసినబంధుగు లెవ్వరును లేకుండుటచే నేనే వైద్యుని గొఱ కిచ్చటికి వచ్చియుంటిని. దిగి నేలపైఁ గాలుపెట్టుసరి కెవ్వరో నలుగురుమనుష్యులు పరుగెత్తుకొని యిటనుండి పోవుచుండిరి. వారిలో నొకనివద్ద పెద్దకత్తి యుండెను. ఆతని వెంబడించి మిగి లినముగ్గురుమనుష్యులును "హత్య! హత్య!" అనియఱచుచుఁ బరుగెత్త నారంభించిరి. ఇక్కడకు వచ్చుచున్న నే నీలోపలఁ బ్రవేశించి యెవ్వరో మూల్గుచున్నట్లు శబ్దము వినవచ్చుటచే వచ్చి చూడఁగా నిట్టిభయంకరదర్శన మైనది. ఇంతకంటె నా కేమి యును దెలియదు. ఈతఁ డిట్లే యిక్కడఁ బడియుండెను. మీరు దయచేయుటవలన నిప్పటికి నాప్రాణములు గూటఁ బడినవి. పాప మీదీనుఁ డింకను బ్రదికియున్నాఁడా? చచ్చిపోలేదు గద! పరమేశ్వరానుగ్రహము వలన నీతఁడు జీవించుఁగాక!" అని యీవిధముగా మిగులఁ గనికరపడుచున్నదానివలె, జాలి చెందిన దానిపోలిక, నెల్లసంగతులును సత్యముగాఁ జెప్పుచున్నదాని కైవడి నటించెను.

ఆ వచ్చినవారిలో నొకఁడు దేవేంద్రుఁడు పడియున్న స్థల మునకుఁ బోయి యాతని నాసికయొద్దఁ జేయుంచి చూచి "లేదు. ఇంకను జావలేదు. ప్రాణము లున్నవి. ఊపిరి వచ్చుచున్నది. వస్తువు చెడిపోలేదు" అనియెను.

"ఆహా! బ్రదుకునను నాశయున్నదికద! భగవంతుఁడు రక్షించినాఁడు. విపత్తునందు సాహాయ్యము చేయువాఁడును, కష్టకాలమునఁ జేయూఁత యొసఁగి కాపాడువాఁడును పరమేశ్వ రుఁడు గాక మఱియెవ్వరు? మీ రెల్లరు నిచ్చట నుండుడు! నేను జూడవలసిన వైద్యుఁ డిచ్చటనే యున్నాఁడు. చాల సమర్థుఁడు. ఆతనిఁ బిలిచి తీసికొనివచ్చెదను. నేను వచ్చుట కొంచె మాలస్య మయ్యెనేని రానని యూహించుకొని మీ రెవ్వరును

పోవలదు. సాధ్యమైనంత త్వరగానే వచ్చెదను,'' అని చెప్పుచు నామె వెడలిపోయెను. పోవుచున్నప్పుడు గూడ ''కొంచెము సేపు వేచియుండుఁడు; పోవలదు'' అని బిగ్గరగాఁ బలుకుచు చీఁకటిలో నామె మాయమైపోయెను.



ఆమె వెలుపలకు వచ్చి ''ఇప్పు డిచ్చటనుండి బయలుదేరి యెటకైనఁ బోయినయెడల ననేక విపత్తులకు లోఁబడవలసి యుండును. ఆ పిల్లవా డప్పుడే పోయి పోలీసువారి కీసమాచారము దెలియఁజేసి వారి నిచ్చటకు వెంటబెట్టుకొని వచ్చుచుండును. మధ్యమార్గమున నేను వారి యెదుటఁబడుట తటస్థించినయెడల దొరకిపోదును. పిల్లవాఁ డిక్కడకు వచ్చువఱకు నీ మందిరమునందే యుండి తరువాత నెటకైనఁ దప్పించుకొని పోవుటయే మంచిది.'' అని యాలోచించుకొని యాకాంత రెండవ యంతస్తుమీఁదికిఁ బోయెను. అందొక డాక్టరు నివసించి యున్న యింటిలోనికి బోయి తన మేలిముసుఁగు దీసివైచెను.

ఆ డాక్టరు మహాశ్చర్యముతో నతిలోక సుందరంబగు నా రమణీ రమణీయవదన మండలమును గనురెప్ప వేయక తనివారఁ జూచుచుండెను. ఆ కాంత తప్పుపేరు చెప్పి యా డాక్టరు పరిచయము చేసుకొని తన మగనికి వాంతిభేది జాడ్యము సంభవించె ననియు నాతఁడు నిస్త్రాణుఁడై పడియుండెననియు, కావలసినవా రెవ్వరును లేకపోవుటచే నాఁడుది యయ్యుఁ దానే రావలసి వచ్చెననియుఁ జెప్పెను. అసత్యములపై నసత్యములను దనకు లేని కష్టములను పుంఖానుపుంఖములుగాఁ జేర్చి దీనభావముతోఁ దెలుపుటవలన నామె మాటలనుగూర్చి సందేహపడుటకుఁ గారణము లేకపోయెను. భోజనము చేసిన తరువాత వచ్చి యామె మగనిచూచి చికిత్స చేసెదనని డాక్టరు చెప్పెను.

తన గృహమును, వీథి పేరును, తన యింటిపేరును, మగని పేరును, మార్చి యెవ్వరికిని దెలియకుండునట్లు చెప్పి "మీరు నాయందను గ్రహముంచి తప్పక దయచేయవలయు"నని ప్రార్థించెను. ఆ డాక్టరా నామములను తన పుస్తకమునందు వ్రాసికొని యట్లే వచ్చెద నని వాగ్దత్తము చేసెను. తరువాత నా యువతి వెడలి పోయెను.

డాక్టరుకు భోజనము సిద్ధమయ్యెను. ఆతఁడు శీఘ్ర హస్తములతోడను, ద్రుతదంత సంఘట్టనములతోడను, శీఘ్ర జిహ్వాచాలనముల తోడను, నాహారము నెప్పటికంటె నతి వేగముగ భుజియించి చేతులు కడుగుకొని తోడనే దుస్తులవైచుకొని వచ్చి మేనా నద్దెకుం దీసికొని బయలుదేరెను. ఆ దినము మతనికి వైద్యముకొఱకు కాహ్వానము వచ్చియుండలేదు. అందువలనను, రాత్రి రెట్టింపుసొమ్ము తీసికొనవచ్చునను నాశచేతను, సంతోషము చేతను నా యువతి యానవాళ్ళు చెప్పిన గృహమునకు బయలుదేఱిపోయెను. ఆ యింట ముసల్మాను నివసించుచుండెను. బోయవాండ్రా యింటిముంగిటకుఁ బోయి మేనా దింపిరి. డాక్టరు వెలుపలకు వచ్చినతోడనే యచటివారెల్లరును "అయ్యా! మీర లిచ్చట కెందులకు దయచేసితిరి?" అని యడిగిరి. డాక్టరు సంగతి యంతయును వారికిఁ దెలియఁజేసెను. అది విని వారు పకపక నవ్వసాగిరి. డాక్టరు మహాశ్చర్యము నందెను. తుట్టతుదకుఁ దన్నుఁ దానే నిందించుకొనుచు నాతఁడు వచ్చినత్రోవనుబట్టి తిరిగిపోయెను; పల్లకి యద్దెయును, బోయవాండ్రకూలియుఁ దన చేతినుండియే సమర్పించుకొనియెను. ఈ సంగతి డాక్టరు తన జీవితకాలమునందు మఱచిపోలేదు.

## ౧౦

కొంతసేపటికి స్మృతి కలుగుటచే దేవేంద్రుఁడు కన్నులు విచ్చి చూచెను. అచ్చట జనులు గుంపులు గూడియుండిరి. అక్క

డకుఁ జేరినవా రెల్లరు నా మందిరమున నివసించువారే. ఈ సమాచారమును విని యందఱు నచ్చటకు వచ్చియుండిరి. ఇంతలో శ్రీశచంద్రుఁడుకూడఁ బోలీసువారిని వెంటఁబెట్టుకొని యచ్చటకు వచ్చెను.

ఆ కత్తిదెబ్బ బలముగాఁ దగులకపోయినను తులసీదాసు సారాయము పోసిన కాచపాత్రముతోఁ గొట్టిన పెట్టుకు దేవేంద్రుని స్మృతి తప్పిపోయెను. ఆతనికిఁ గత్తిపోటువలనఁ గలిగిన గాయపుబాధ యగపడుటయే లేదు. శరీరమునను భూమి మీఁదను ప్రవహించు రక్తమును జూపింపఁగా దేవేంద్రుఁడు నా శరీరమునం దిట్టిగాయము లనేకము లున్నవనియు, వాని వలన నాదార్ఢ్యమున కెంతమాత్రమును లోపము కలుగలే దనియుఁ జెప్పెను.

గుమాస్తా బందియై యున్నగది యటకు దగ్గరనే యున్నది. నడుమ నంగణముమాత్ర మడ్డముగా నుండెను. ఆ గుమాస్తా కట జరిగిన సంగతు లేవియుఁ గనఁబడకపోయినను వినఁబడు చుండు టచే నాతఁడు భయపడి వివర్ణవదనుఁడై యుండెను. ఆతని కాలుసేతులు కొయ్యబారి యుండెను. గట్టిగాఁ గేకలు వేయుట కైనను నాతనికి ధైర్యము లేదు.

వచ్చినవా రెల్లరును, క్రమక్రమముగా నొక్కొక్కరే వెడలిపోయిరి. దేవేంద్రుఁడు శ్రీశుని బిలిచి గుమాస్తాను విడుదల చేయుమని చెప్పెను. శ్రీశచంద్రుఁ డాగది తలుపులను దెఱచివైచెను. గుమాస్తా వెలుపలకు వచ్చి మరల నమ్మ కడుపునఁ బుట్టినట్లు తలఁచుకొనియెను.

దేవేంద్రుఁ డాతనిఁ బంపివైచిన తరువాత శ్రీశచంద్రునిఁ బిలిచి "నీవు చాలఁ దెలివి కలవాఁడవు. కొన్ని దినములు నా యొద్దఁ బని నేర్చినయెడల నీకుఁ దగినవేతనము నిచ్చెదను. తరు

వాత నీవు నేర్పరి వయ్యెదవు. క్రమక్రమముగా నీకు పదవి లభియింపఁగలదు. గొప్పపత్తేదారుఁడవు కాఁగలవు.

శ్రీశ : అయ్యా! ఇప్పుడు నేనేమి చేయవలసియుండునో, యాజ్ఞాపింపవలయును.

దేవేం : నీవు చేతలామహాలున కిప్పుడే బయలుదేరి పోవలయును. అక్కడ బండ్ల ఘట్టమునందుఁ గాచుకొని యుండవలయును. వేగముగాఁ బోవలయును.

శ్రీశ : చిత్తము. మీ సెలవు ననుసరించి యిప్పుడే పోవుచున్నాఁడను.

దేవేం : ఉండుము! నీవు పోయి యచ్చట నేమి చేయఁ దలంచితివి ?

శ్రీశ : ఈ దుర్మార్గు లచ్చటకు వచ్చెదరేమో కనుపెట్టి చూచుచుండెదను.

దేవేం : మంచిది. కాని వారి కిచ్చట నొకటి రెండు స్థలము లున్నవి. అక్కడ వారు తమతమ వేషములను మార్చుకొని యితరుల కానవాలు తెలియకుండునట్లు క్రొత్త వేషములను ధరియించి యటనుండి బయలుదేరుచుందురు.

శ్రీశ : వా రెన్ని వేసములు వేసికొన్నను, వేసికొననిండు! నా కంటఁబడిన మాత్రమున వారిని గుర్తింపఁగలను. అందుల కెంత మాత్రమును సందేహింపవలదు.

దేవేం : అదియే కావలసినది. ఇప్పుడు వా రందఱును ఖిదరపురమునకుఁ బోయెదరు. అది వారికి ముఖ్యస్థానము. నేఁడు వా రందఱు నొక్కచోఁ జేరి తా మెచ్చ టెచ్చట నుండవలయునో యను విషయమును నిర్దేశించుకొందురు. దక్షిణ మార్గముగా బయలుదేఱినయెడల * (చేతలా) కాళీ ఘట్టమును దాఁటి ఖిదరపురము కడకుఁ బోయెదరు. పశ్చిమ మార్గముగా

* ఈ కార్యములు జరగుచుండుకాలమునకు (చేతలా) కాళీఘట్టము నొద్ద గంగానదికి సేతువు లేదు.

పోయినయెడల ఆలిపురము మీఁదుగాఁ బోవలసియుండును. ఆ పుర సేతువుకొద్ద నేను కాచికొనియుండెదను. వారీ రెండు త్రోవలలో నేదే నొక త్రోవను బట్టిపోవుట నిశ్చయము.

ఇట్లు మాటలాడుకొని వారిరువురును వేఱు మార్గము లను బట్టి పోయిరి.

౧౧

దేవేంద్రుఁడు పోయి ఆలిపుర సమీపమున నున్న వంతెనమీఁద నొక్కచో దాఁగియుండెను. తన తలమీఁదఁ దగిలిన దెబ్బవలన మిగుల బాధపడుచుండెను. ఆ బాధను సహించుకొనఁ గలిగి నవాఁడయ్యును మనోవ్యథ మాత్రము సహింపజాల కుండెను. దురవస్థ జ్ఞప్తికి వచ్చుటచే చాల మనోవ్యథ కలిగెను.

కొంతసేపటి కచ్చటికి బండివచ్చి యా వంతెనపై పోవు చుండెను. దేవేంద్రుఁడా బండివెనుక సేవకుఁడు గూర్చుండుట కేర్పడియున్న స్థలమున నిశ్శబ్దముగాఁ గూరుచుండెను. బండి తలుపు లన్నియు మూసియున్నను గవాక్ష రంధ్రములగుండఁ జూడఁగా నా బండిలోఁ గూర్చున్నవా రిద్దరని పొడకట్టెను. అం దొకఁడు ముసలివాఁడు నోటఁ బొగచుట్ట పెట్టుకొని పీల్చు చుండెను. ఆ చుట్ట నిప్పువలన నప్పుడప్పు డాబండిలో నించుక వెలుతురు కలుగుచుండెను. ఆ వెలుతురులో జూడఁగా బండిలో గూరుచున్నవా రిరువురును వేషములను ధరియించి యున్నట్లు దేవేంద్రునకుఁ దోఁచెను. నిదానింపఁగా నా ముసలివాఁడు నవీనచంద్రుఁడై యున్నట్లును, ముసలిది మేలిముసుఁగు వైచి కొని తన్నుఁ గత్తితోఁ గొట్టినయువతి యైనట్లును దృఢపడియెను.

బండిలోని వారా మార్గముననే యానంద కుటీరమునకుఁ బోయెదరనియు, వైద్యుఁడు గోవిందప్రసాదును, న్యాయవాది

తులసీదాసును మఱియొక మార్గమును బట్టి పోవుటవలన వారిని శ్రీశచంద్రుఁడు తప్పక కనుపెట్టఁగలడనియు నొకవేళ నాతఁడు తప్పిపోయినను బాధలేదనియు, చూడవలసినవారిని తాను చూడ గలుగుట తటస్థించెననియు నింతకంటె నిఁకఁ గావలసినది లేద నియు భావించెను.

ఇట్లు నిశ్చయించుకొని దేవేంద్రుఁ డాబండివెనుకనే కూర్చుండి లోపలివారి మాటల నాలించుటకై ప్రయత్నించు చుండెను.

౧౭

చాలసేపటివఱకు డాక్టరు నవీనచంద్రుఁడు గాని, జమల గాని (ఆకాంత పేరు జమల) యేమియును మాటాడ లేదు. బండి యూవంతెన దాఁటి చాలదూరము జోయెను. దేవేంద్రుఁ డింకను చెవి యొగ్గి యట్లే యాలకించుచుండెను. కొంతసేపటికి నవీనచం ద్రుఁడు "జమలా! ఇప్పుడు నీవలన నొకసంగతి తెలిసికొనవలసి యున్నది" అనియెను.

ఆయువతి మెల్లమెల్లగా "ఊరకుండుము! మాటలాడ కుము!" అనియెను.

నవీ: మన కింక భయ మెందులకు? ఆనందకుటీర సమీపముననే వచ్చియుంటిమి" అనియెను.

జమ: నే నెఱుఁగుదును. నీవు చెప్ప నక్కఱ లేదు. కొంచెమునే పాఁగుము. మన మానందకుటీరమునందుఁ బ్రవే శించునంతవఱకును నీవు మాటలాడ వలదు.

నవీ: నీవప్పు డక్కడకు మంచిసమయముననే వచ్చితివి సుమా! ఆతనికి కత్తిదెబ్బ తగిలినను చావకుండుట వింతగాను విచారముగాను నున్నది.

జుమ : ఊరకుండఁజాలవా? మాటలాడకు మని చెప్పు చుండుట నీకుఁ గాదా? వినఁబడుట లేదా?

నవీ : పోనిమ్ము! మఱియొకమాట యడిగెదను, అంతకంటె మఱి మాటలాడను.

జుమ : అడుగుము.

నవీ : నీవు కత్తితో వెన్నునఁ గొట్టినదెబ్బవలన నాతనికిఁ బెద్దగాయమై యుండవలయును, అందువలన నాతఁడు కొన్ని దినములవఱకు మంచముపట్టి యుండవలయును.

జుమ : ఔను.

కొంతసేపటివఱకు వా రిరువురు మాటలాడ కూరకుండిరి. తరువాత నవీనచంద్రుఁడు మరల జుమలను బిలిచి "మన మిఁక ముందుఁ జేయవలసిన పని యేమి?" అని యడిగెను.

జుమ : నీకుఁ దెలియలేదా?

నవీ : ఔను.

జుమ : మరల నన్నేల యడిగెదవు?

నవీ : లేదు, అంతటి సుందరులైన యాయిరువురు యువతులను చంపివేయవలయును గాదా? నా కావిషయమునఁ జాల విచారము కలుగుచున్నది.

జుమ : ఊరకుండుము.

నవీ : ఔను, సుందరీమణులే యగుదురు, కాని, జుమలా! నీయంతటి శృంగారవతులు కారు.

జుమ : నామనసును గలఁచివేయుటకై నీ విందుఁ గూర్చుంటివి కాఁబోలు! ఎంత చెప్పినను వారి కీదినమే తుదిదిన మని తెలిసికొనుము! మఱియిరువురకుఁగూడ నదియే గతి!

నవీ : అలాగా? ఇంకను నిరువు రున్నారా? వా రెవ్వరు? ఎక్కడివారు?

జుమ : ఇక్కడివారే, మనవారే, తులసీదాసు, గోవింద ప్రసాదు——

నవీ : ఈరాత్రియేనా ?

జుమ : ఈరాత్రియే జరగిఁపవలయును.

నవీ : ఏల ?

జమ : రేపటిదినము వారిపేరుమీఁద వారంటు పుట్టఁగలదు. అందువలన వారీదేశమును విడిచి పాఱిపోయెదరు. ఇక్కడనే నిలిచియుండుటకు వారికి ధైర్యము చాలదు. నేను లేకపోయినయెడల వారీసరికే నెమ్మదిగా నెవ్వరికంటఁ బడకుండఁ బాఱిపోయియుందురు.

నవీ : జుమలా! నీయొద్ద మహామంత్ర మేదియో యున్నట్లు తోఁచుచున్నది. ఏదియో లోకమోహనకరమైన వశీకరణశక్తి నీకడ నుండవలయును.

"జుమల" యనుపేరు దేవేంద్రుని చెవికి స్పష్టముగా వినఁబడియెను. ఆతఁ డీదివఱకు దొంగలలో మేలుచేయి వడసిన వాఁడును, లోకాతీతమైన వంచనమునందు నేర్పుగలవాడు నగుఫూల్‌సాహే బనుచోరుని బట్టుకొనుటకుఁ బ్రయత్నించినప్పుడీమెయే దేవేంద్రుని ప్రాణాపాయస్థితికిఁ దీసికొనివచ్చినది. ఆ దొంగ యీజుమల నుంచుకొని యుండెను. అప్పు డామెయాఘాతము పొందియు దేవేంద్రుఁ డాదొంగను బలవంతముగాఁ బట్టుకొనియెను. ఇప్పుడు మరల నాపేరు విని దేవేంద్రుఁడు చకితుఁడై "ఓహో! ఈమెయా? కావచ్చును. నాస్నేహితుఁడగునరిందమునితో నున్నప్పుడు నష్టే చేసినది. నన్నుఁగూడ నట్లు చేసినది. నేఁటి కింక నన్నుఁ జంపఁదలఁచి యున్నది. ఈమె చాల సాహసము కలది. ఈమె ఫూలుసాహే బంత వానిని వశపఱచుకొన్నది. నవీనచంద్రుఁ డీమెను దేవిగాఁ దలంచు టేమి

వింత ? ఈఁ డీమె యింటికి కొక్కు_గా నున్నాఁడు. నే నీమె నింత వఱకును కంటితోఁ జూడ లేదు. ఈమె మనోరమవలెనే యుండు ననుటకు సందేహము లేదు. జుమలా! సాక్షాత్కారము కాఁగ లదు. 'చూతము'' అని యనుకొనియెను.

నవీనచంద్రుఁడు కొంతసే పేమియును మాటాడ కూరకుండి తరువాత ''జుమలా! ఈయొక్కరాత్రే యీపనుల నన్నిటిని నెఱవేర్పఁగలవా ?'' అని యడిగెను.

జుమ : నేనే యట్టిపని నెఱవేర్తునని యెవ్వరు చెప్పిరి? అట్లు జరుగఁగూడదా ?

నవీ : నేను బాగుగ నెఱుంగుదును. ఆసీమూర్ఛరోగుల సమాచార మంతయును వినియుంటిని. కాని, యిప్పుడు కావలసినపని యొకటి కాదు. ఒక్కసారిగా నలుగురైదుగురు మూర్ఛరోగులైనచో నితరు లే మనుకొందురు? ఇంతమంది యేకకాలమునం దొక రోగముననే చచ్చిపోయి రని చెప్పుట మిగుల ననుమానమునకుఁ గారణము కాకపోదు. ఇట్టిది యసంభవ మని ప్రజలకుఁ దోఁచదా, జుమలా !

జుమ : ఈసారిమాత్రము మూర్ఛరోగము కాదు. మఱియొకవిధ మైనరోగము. ఈరాత్రి జరుగఁబోవు పనులవలన ననేకు లొక్కనిమిషమునందే చచ్చిపోయి యుందురు. ఎవ్వరు ననుమానించుటకైన నాధార ముండదు.

నవీ : కావచ్చును. అంతటి సాహసకార్యములు చేయవలసి వచ్చినయెడల నీవే చేయవలయును. నీయొద్దనున్న సంఘమరణకారణంబు లగువస్తువు లెట్టివో, వానియం దెట్టి మహత్వ మున్నదియో నాకుఁ దెలియదు. నీవు పదార్థతత్త్వమును బాగుగ నెఱింగినదానవు. నీయుద్ద ననేక మంత్రతంత్రములుకూడ

నుండును. అంతవఱకు నాకుఁ దెలియును. కాని నీవీదినము చేయఁ దలఁచిన సాహసకృత్యములనుగూర్చి యోచించి చూడఁగా—

జుమ: ఊరకుండుము! కార్యములను నే నేవిధముగా నెఱవేర్చుకొనవలయునో నాకుఁ దెలియకపో లేదు. ఆకార్యనిర్వహణవిషయంబునఁ దగినయేర్పాటు లన్నియుఁ జేసికొనియే యుంటిని.



# నాలుగవ భాగము

## ౧

ఆనందకుటీరమునకు వెనుక భాగమున నున్న చిన్నసందులో బండి నిలిచియుండెను. అప్పుడే యిరువురు దిగిరి. నవీనచంద్రుఁడు, జుమలబండినిలిచినస్థలమున కెదురుగా దిడ్డివాఁకిలి యున్నది. ఆద్వారమున కొకయిత్తడిపిడి యున్నది. దానిని బట్టుకొని బలముగా ముందఱికి నొక్కినతోడనే తలుపులు తెఱచుకొన్నవి. మాఱువేషములను ధరియించిన జుమలయు, నవీనచంద్రుఁడును నాద్వారమునుండి లోపలకుఁ బోయిరి.

దేవేంద్రుఁ డాప్రక్కను దాఁగి యుండి యాద్వారమును తెఱచువిధానమును బాగుగఁ గనుపెట్టి యుండెను. తరువాత నాతఁడుకూడ మిగుల జాగరూకతతో నాయుద్యానమునఁ బ్రవేశించెను. కాలి చెప్పులు ధ్వని చేయకుండున ట్లిదివఱకే వాని యడుగున రబ్బరు వేయించెను.

అభేద్య మగు నాయంధకారమునఁ బోవుచున్న దేవేంద్రునకు ముందుగ నెవ్వరో పోవుచుండిరి. అడుగులచప్పుడు విని యనుసరించి దేవేంద్రుఁడును పోవుచుండెను. క్రమక్రమముగా నాచప్పు డాగిపోయెను. వారు ముందరికి దూరముగాఁ బోయిరి. దేవేంద్రుఁడు చుఱుకుగా నడవ నారంభించెను. కొంఁతదూరమున నున్నయానందకుటీరపు వెనుకద్వారమున మెఱపుపోలికనే యగపడినవెలుతు రాయంధకారమును ఘనీభూతముఁ జేసివైచెను. అవెలుతురులో నవీనచంద్రుఁడు పొగచుట్ట కాల్చుకొనుటకై యగ్గిపుల్ల వెలిఁగించెను. ఆ వెలుతురునుబట్టి చూడఁ వారు వేషములను తీసి వేసిన ట్లగపడియెను.

మరల నిమిషమాత్రముననే యా గాఢాంధకారమున నవీనచంద్రుని ఘొగచుట్టతుది నిప్పుమాత్ర మించుక మెఱయుచుండెను. అట్టిసమయమున నవీనచంద్రుఁడు గంభీరస్వరముతో "సైతాన్, సైతాన్" అని పిలిచెను.

తోడనే పెద్దపులివంటి పెంపుడుకుక్క మొఱుగుచు సమీపమునకు వచ్చి నిలువఁబడియెను. ఆకుక్క నక్కడనే యుంచి నవీనచంద్రుఁడు జమలతోఁగూడ లోపలఁ బ్రవేశించి తలుపులను మూసి గడియ వైచికొనియెను.

"మీయిష్టము వచ్చినరీతిని పనిచేసికొనుఁడు! కొంచె మాలస్యమైన నగుఁగాక! మీ రెంతజాగరూకులై చరియించుచున్నను దేవేంద్రవిజయుఁడు మీయానందకుటీరమునఁ బ్రవేశించినాఁడు. ఆతఁడు మీకుక్కను చూచి భయపడి మరల నింటికిఁ బోవువాఁడు కాఁడు. మీ రెన్ని యాటంకములను గల్పించినను కార్యము సాధించుకొనకుండఁ బోవువాఁడుగాఁడు" అని దేవేంద్రుఁ డనుకొనెను.

ఆతనిభార్యయు, మనోరమయు నిప్పుడు శత్రువులచేతులలో నున్నారు. దేవేంద్రుఁ డూరకుండునా ? రెండుస్త్రీహత్యలు జరగిపోనున్నవి! ప్రప్రథమమున నీకుక్క నెటులైనఁ దప్పించుకొనవలసి యున్నది. సందడి చేయఁగూడదు.

దేవేంద్రున కాలోచించుకొనుటకుఁ గాని, యూరకుండుటకుఁ గాని, యూరక కాలహరణము చేయుటకుఁ గాని నిమిషమైన నవకాశము లేకుండెను. తన ప్రాణేశ్వరిని, శరణాగతురాలగుమనోరమను మృత్యువదనమునుండి యుద్ధరింప నాలస్యము చేయకుండఁ దప్పక ముందఱికే పోవలయును. దేవేంద్రవిజయుఁడు ధైర్యము వహించి చప్పుడు గాకుండ నడుగులను వైచుచు ముందఱికి జరుగుచుండెను.

౨

ఒక్కయడుగు ముందఱికి వైచినప్పు డెల్ల రక్తప్రియ యగు నాశునకము వచ్చి తనపైఁ బడునేమో యనుశంక కలుగు చుండెను. అవిధముగా నాతఁడు చాలదూరము పోయెను. ఆతని కెట్టిశబ్దమును వినవచ్చుట లేదు. ఆత్మ సంరక్షణముకొఱ కాతనియొద్ద నెట్టియాయుధమైనను లేదు. ఒకవేళ నున్నను దానిని పైకిఁదీయుట కది తగినసమయమును గాదు. ఆతని కేమియు నాలోచనముతోఁచుట లేదు. మఱికొంతసేపటి కాతఁడు పోవుచుండఁగనే యా కుక్క వచ్చి సింగమువలె నాతనిపైఁ బడియెను.

నిజముగా నాకుక్క సైతానే (పిశాచమే) యై యున్నట్లు తోఁచెను.

అదృష్టము బాగుగ నుండుటవలన నాతఁడు రెండుచేతు లతో కుక్కకుత్తుకను భద్రముగా నొక్కి పట్టుకొనియెను. దేవేంద్రవిజయుఁడు బలవంతుఁడే కానియెడల నీసరి కాకుక్క కఱపులవలన నాతనిశరీర మంతయు నింతింత ముక్కలై పోయి యుండును. ఆతఁడు పట్టినపట్టువలనఁ గంఠ మొత్తుకొనిపోవుటచే నాకుక్క యఱచుటకుఁగూడ శక్తి లేనిదై యాయాసముతో మెల్లమెల్లగ మూలుగ నారంభించెను. కఱచుటకు మెడను త్రిప్పనైనఁ ద్రిప్పలేకుండెను. నోరు తెఱచి పంటితోఁ గొఱుకుటకైన దానికి వలనుగాకుండెను. అట్లయినను కుక్క చాలవఱ కాతని కాయాసమును కలిగించెను. కాళ్ళతోఁ గొట్టుచు నాతని పట్టు వదలించుకొనవలయు నని యాకుక్క యెంతయో ప్రయ త్నించెను. అది కఱచుటకై దరిగినప్పుడెల్ల దాని నవ్వలకుఁ ద్రిప్పుచు దేవేంద్రుఁ డాకుక్క నట్లే పట్టుకొని ముందఱికిఁ బోవు చుండెను. కొంతదూరము పోవునప్పటికి దాని కెంతమాత్రము నూపిరి యాడకుండుటచే బలమంతయు క్షీణించి పోవుచుండెను.

దేవేంద్రుఁ డంతమాత్రముచే దానిని విడువక దానికుత్తుకను మఱింతగట్టిగా నదుముచుండెను. తరువాతఁ దన యొద్దనున్న కత్తితో దాని పొట్ట జీల్చివైచెను. ఈ విధముగా సైతాను ప్రాణములను వదలివైచెను.

దేవేంద్రుఁ డా కుక్క నొకప్రక్కకుఁ ద్రోచివైచి గుఱ్ఱపు లాయము నొద్దకుఁ బోయి శచీంద్రుఁడు పరుండియున్న యింటి గుమ్మమునొద్ద నిలువఁబడి సంకేతవిధానమున నా యింటి తలుపు తట్టినతోడనే శచీంద్రుఁడు లేచి వచ్చి తలుపులను దెఱచెను. దేవేంద్రుఁడు లోపలకుఁ బోయి చేతిలాంతరు వెలిగించెను. ఆ వెలుతున పరస్పరము గుర్తించుకొనిరి.

శచీం : మీ రిచ్చటి కెట్లు వచ్చితిరి? ఆ సైతానును తప్పించుకొనివచ్చుట దుస్సాధ్యమే.

దేవేం : దాని నుపాయముచేఁ దప్పించుకొని బయలుదేరి వచ్చితిని.

శచీం : (ఆశ్చర్యముతో) ఎట్లు?

దేవేం : సైతాను చచ్చిపోయినది.

శచీం : చచ్చిపోవుటయే! అది మిమ్ములను కఱవలేదా? వింతగానే యున్నది.

దేవేం : నా పట్టిన పట్టువలన దానిపల్లు తెఱచుట కయిన సాధ్యముకాక పోయినది.

శచీం : మీరు వచ్చి యెంతసేపైనది? నే నింతవఱకును పెద్దయింటిలోనే యున్నాను, ఇప్పుడే వచ్చి యీ యింటఁ బ్రవేశించి తలుపు వైచికొన్నంతలోనే వచ్చి నన్నుఁ బిలిచితిరి.

దేవేం : శచీంద్రా! ఇప్పు డానంద కుటీరమునం దెంత మంది యున్నారు?

శచీం : ఏడుగురు.

దేవేం : వారి సంగతిని గూడ నీ వెఱుగుదువా ?

శచీం : ఎఱుఁగుదును, డాక్టరు నవీనచంద్రుఁడు, జమల, కుముదిని-వారిలో జమల యెవ్వతెయో, కుముదిని యెవ్వతెయో తెలిసికొనుట చాలఁ గష్టము.

దేవేం : ఆ ఇరువురు తరుణలను స్వయముగా చూచి యుంటివా ?

శచీం : వారిని నా కన్నులతో బాగుగఁ జూచియున్నాడను.

దేవేం : అం దొకదాని పేరు జమలయా ? జమల ఎవ్వతెయో నీకు జ్ఞప్తియున్నదా ?

శచీం : లేదు.

దేవేం : ఫూలుసాహేబును పట్టుకొన్నప్పు డీ జమలయే నా ప్రాణములమీఁదికి దెచ్చినది. నీ విప్పటికి ముగ్గురు పేరులను మాత్రము చెప్పుచుంటివి, తక్కినవారు నలుగురు యెవ్వరు ?

శచీం : ఇద్దఱు పురుష సేవకులు, మఱి ఇద్దఱు పరిచారికలు.

దేవేం : వారు మన కార్యముల కంతరాయములను గల్పించునంతటి సమర్థులా ?

శచీం : ఇరువురు పరిచారకులు, నొక పరిచారికయు వారికిఁ గావలసినవారు. వా రొకవేళ మన కార్యముల కడ్డము వచ్చినను రావచ్చునని తోఁచుచున్నది.

దేవేం : శచీంద్రా ! వారు మఱి యిరువురను బలవంతముగాఁ బట్టి తీసికొనివచ్చిరి గదా ? వారి సమాచార మేమైన నీకుఁ దెలిసినదా ?

శచీం : తెలియలేదు. వా రిరువురు నెవ్వరు ? ఎప్పుడు తీసికొనిరాఁబడిరి ?

దేవేం : నీకన్ను లెక్కడ నున్నవి ?

శచీం : క్షమింపవలయును. నన్నీదిన మదయమున కుమ దిని కలకత్తాకుఁ బంపించినది. నే నిచ్చట లేను. అట్టి సమయమున వారు వారిని తీసికొని వచ్చియుందురు. వా రెవ్వరు ?

దేవేం : ఒకతె నీ మేనత్త—మఱియొకతె మనోరమ.

శచీంద్రుని హృదయము చెదరిపోయెను. రేవతి యాతనిఁ జిన్నతనమునుండియుఁ దల్లివలెఁ బోషించినది. ఆత డామెను దల్లికంటె నెక్కుడుగఁ బ్రేమించుచుండెను — ఆతడు మనోరమ నొక్కసారి మాత్రమే చూచినను నామె సరళహృదయమును, శాంతస్వభావమును, దీనగతియు నాతనికి జాలియో, దయయో, ప్రేమయో కలిగించియుండెను. అట్టి ప్రేమాస్పదురాండ్రగు మేనత్తయు, మనోరమయు నిట్టి కష్టములకు లోనైరని వినుట వలన నాతని మతి చెదరిపోయెను. "మామా ! ఏమది ? ఏమి జరగినది !" అని యడిగెను.

దేవేం : ఇప్పుడు చెప్పుటకుఁ దగినసమయ కాదు. సుబ్బ వచ్చి నిన్నుఁ గలిసికొన లేదా ?

శచీం : లేదు. ఆతఁ డెప్పుడు వచ్చినాఁడు ?

దేవేం : ఓహో ! ఆలాగా ! అట్లయినచో సుబ్బు కూడ వారి చేతులలోఁ బడిపోయెను.

శచీం : సుబ్బు నా యొద్దకు రాలేదు. నే నాతనిఁ జూచి యుండలేదు.

దేవేం : డాక్టరు నవీనచంద్రుఁడును జమలయు నిప్పు డిచ్చుటకు వచ్చియున్నారు కాదా ?

శచీం : అవును. వారు వచ్చి కొన్ని నిమిషములకంటె నెక్కువసేపు కాలేదు.

దేవేం : ఆ సంగతి నే నెఱుంగుదును. నేను వారివెంటనే వచ్చితిని. వారికి బట్టువడిన యిరువురుస్త్రీలను వా రీ రాత్రియే చంపివేయవలయు నని నిశ్చయించుకొని యున్నారు.

శచీం : అత్తనే! మనోరమనే? అట్లెన్నటికిని జరుగదు. వారి యభీష్టము సిద్ధింపకుండునట్లు నే నెల్లవిధముల నభ్యంతరము కలిగించుటకయి ప్రయత్నము చేసెదను.

దేవేం : అట్లయినచో నీ విప్పు డిటు రమ్ము. వారి కార్యము నెఱవేఱకుండఁ జేయవలసియున్నచో నికఁ నాలస్యముచేయఁ గూడదు.

శచీం : కొంచెముసేపు కూరుచుండవచ్చును. గంటసేపటి వఱకు నెట్టిప్రయత్నములు చేయరని తోచుచున్నది.

దేవేం : నీ కెట్లు తోచినది?

శచీం : వారి స్వభావములు బాగుగా నెఱుంగుదును.

దేవేం : వారు మీ మేనత్తను, మనోరమను నెచ్చట దాచియుంతురో నీ వూహించి చెప్పఁగలవా?

శచీం : ఆనందకుటీరమునకు నైరృతి దిక్కునం దుంచి యుందురు. ఆ దిక్కునందే బందీకృతుల నుంచుట కనుకూలమైన యేకాంతగృహ మున్నది.

దేవేం : ఆ గృహమునకుఁ బోవుదారి నీకు బాగుగఁ దెలియునా? మన మిప్పు డచ్చటికిఁ బోవుట కుపాయముఁ జెప్ప గలవా?

శచీం : అక్కడకుఁ బోవుట కేర్పడియున్న మార్గ మొక్కటియే. ఆ త్రోవ యీ మందిరము లోపలనుండియే యున్నది. ఇప్పుడు వారందఱును చేరి సభచేసియున్న గదిలో నుండియే యచ్చటకుఁ బోవలయును.

దేవేం : అయినచో మన మచ్చటఁ గొంతసేపటివఱకు వేచి యుండవలయును. ఇంతలో నీకుఁ దెలియవచ్చిన క్రొత్త సమాచారము లేవైన నున్నయెడలఁ జెప్పుము.

శచీం : మీకు మనవిచేయఁ దగినంతటి ముఖ్య సమాచారము లేవియును లేవు.

దేవేం : మంచిది! నవీనచంద్రుఁ డెవ్వరు?

శచీం : ఆతఁడు జమలకో, కుముదినికో మగఁడని చెప్ప వచ్చును. ఆ యిరువురి భేదమును నాకుఁ దెలియలేదు.

దేవేం : కుముదిని చచ్చెనను మాట యసత్యమే. నవీన చంద్రుఁ డెవ్వఁడో నీకు బాగుగఁ దెలియదా?

శచీం : ఆతఁడు కుముదినినే పెండ్లి చేసికొనియుండునని తోఁచుచున్నది.

దేవేం : తోఁచుఁచున్నది యని చెప్పుట యెందుఁలకు? అదియే నిశ్చయము. కాని, యాతఁడు జమలనే యెక్కువగాఁ బ్రేమించుచున్నాఁడు. ఈ దుష్కార్యముల కన్నిటికిని జమలయే మూలకారణము. ఆమె మూలముననే యిట్టి దుస్తంత్రము లన్నియును నడచుచున్నవి. కుముదిని చాల నమాయకురాలు. కాని, యామెకుఁగూడఁ గాలము సమీపించినది.

శచీ : అది యేమి? కారణమున్నదా?

దేవేం : అన్నిటికిని గారణము జమలయే. జమలయు నవీనచంద్రుఁడును నామె నీ లోకమున లేకుండఁ జేసి తమ మార్గమును నిష్కంటకముగఁ జేసికొనఁ దలచిఁయున్నారు. నాకుఁ దెలిసినంతవఱకు వారామె నీరాత్రియే—

శచీం : నిజమే?

దేవేం : మన మిప్పు డిచ్చుట లేకపోయిన యెడల— నిస్సందేహముగ, నిరంతరాయముగ నీ రాత్రియే యామె మృత్యుముఖమునఁ బడిపోగలదు.

శచీం : మన మిచ్చటనే యుంటిమి గాదా?

3

దేవేంద్ర విజయుఁడు శచీంద్రునితో మెల్లగా "ఆలకింపుము!" అని చెప్పెను. ఇద్దఱును గొంతసేపటివఱకు చెవియొగ్గి వినిరి.

అట్లు వినుచుండఁగనే యాకస్మికముగా దేవేంద్రుఁడు లేచి వేవేగ ముగ నా కుందిరమునుండి వెలుపలకు వచ్చి చీకటిలోఁ జేరి పోయెను.

ఆతఁడు వెలుపలఁ బ్రవేశించి మరల నాలకింపఁగా నెవ్వరో మనుష్యులు వచ్చుచున్న ట్లడుగుల చప్పుడు వినవచ్చుచుండెను. ఆ వచ్చువా రెవ్వరను నాలోచనముతో నాతఁడు కొంచెము ముందటికిఁబోయి పెద్ద మామిడిచెట్టు వెనుక దాఁగికొనెను. అక్కడకు నాలుగైదు గజములదూరమున నానందకుటీరపు రెండవ యంతస్తునందలి కిటికీలద్రోవను లోపలనున్న దీపముల వెలుతురు ప్రసరించుచుండెను. ఆవెలుతురుమూలమున నక్కడకు వచ్చు వారిని సులభముగా గుర్తింపవచ్చు నని యాలోచించుకొని యచ్చటనేయుండి వారి రాక కెదురుచూచుచుండెను.

తరువాత గొంతసేపటికి వా రిరువురు నా మార్గముననే యానందకుటీరమునకుఁ బోవుచుండిరి. దేవేంద్రుఁడు వారి నాన వాలు పట్టెను. అందొకఁడు న్యాయవాది తులసీదాసు, మరి యొకఁడు వైద్యుఁడు గోవిందప్రసాదసేనుఁడు. అప్పుడు వా రిద్ద ఱును మాఱువేషములను దాల్చియుండిరి. ఆ వేషములు సరిగా నొప్పియుండక పోవుటచే మొట్టమొదట వారిని చూచినవా రా వేషము వేసికొన్నప్పుడును కనుపెట్టఁగలరు. వారు కాలక్షేపము చేయక యానందకుటీరమునకుఁ బోవుచుండిరి. చేతలామహాలు నకు వచ్చుట కెంతసేపుపట్టునో యంతసేపటిలోనే వా రానంద కుటీరమునకు వచ్చిరి.

అప్పుడు దేవేంద్రుడు "ఈ వచ్చువారితోఁగూడ నానంద కుటీరమునందుఁ దొమ్మండ్రు జనులున్నారు. వారిలో మూవురు మాత్రమే చాల భయంకరులై యున్నారు." అని తన మనసులో ననుకొని మరల శచీంద్రుని ఇంటివైపునకుఁ బోవుచుండెను. కొంత దూరము పోవుసరి కాతనికి మరల నడుగులచప్పుడు వినబడ్డెను.

ఆ శబ్ద మంత హెచ్చుగా వినబడుటలేదు గాని తదేకదృష్టి తోనున్న దేవేంద్రునకు వినబడుటచే నాతఁడట నాగిపోయెను.

కాని యంతలో నా శబ్దము కూడ నాగిపోయెను. నాలు గైదు నిమిషములవఱకు నచ్చటనే నిలువఁబడి యాలకించినను వినఁబడుటలేదు. అందువలన దేవేంద్రుఁడు ముందటికిఁ బోవ నారంభించెను.

మరల నట్టిశబ్దమే వినవచ్చుచుండెను. ఆ శబ్ద మస్ఫుట మైనను దేవేంద్రుని చెవికి స్ఫుటముగనే బోధ యగుచుండెను. అప్పు డాతఁ డెవ్వరో తన్ననుసరించి వచ్చుచుండి రని యూహిం చెను.

దేవేంద్రుఁడు మరల నడచుట కారంభించెను. మరల నాతని వెనుక నదియేశబ్దము— కాని యాతడు మాత్రము నిలువఁ బడ లేదు, చప్పుడును నిలువలేదు. దేవేంద్రుఁడు వేగముగా నడచుచు నొకయడుగు వెనుకకు వైచెను. ఆ శబ్దము సమీ పించినట్లయ్యెను. అప్పు డాతడు వెనుకకు దిరిగి యా చప్పుడు వినవచ్చు దిక్కున కభిముఖముగాఁ బోయెను. చప్పుడు చేయు చున్న వ్యక్తియు నటనుండి పాఱిపోక యాతనిచేతికి దొరకి పోయెను. దేవేంద్రుఁడు పరీక్షింపఁగా వాఁడు పిల్లవాఁడు. అప్పు డాతనికి శ్రీశచంద్రుఁడు జ్ఞప్తికి వచ్చెను. ఆతఁడు శ్రీశచంద్రునకుఁ దులసీదాసును, గోవిందప్రసాదును వెంబడించి పోవలయునని యాజ్ఞాపించియుండెను. కావున నాతఁ డా పిల్లవాని చేయి పట్టు కొని "నీవు శ్రీశచంద్రుఁడవు కావా?" అని యడిగెను.

"ఔను."

దేవేం: అటులైన నీ విప్పుడు నాతోఁ గూడ రావల యును. నెమ్మదిగా నా వెనుక రమ్ము.

శ్రీశ: మీరుపట్టిన పట్టువలన స్వస్థానమును బాసి ప్రాణమే పోవునట్లు తోఁచెను.

దేవేం : మాటలాడ వలదు. నిశ్శబ్దముగా నీవు నా వెను వెంటనే రమ్ము.

దేవేంద్రుఁడు శ్రీశచంద్రుని వెంటఁబెట్టుకొని శచీంద్రుని యొద్దకు వచ్చెను. శచీంద్రుఁడు శ్రీశచంద్రునిఁ జూచి యాశ్చర్య పడియెను. దేవేంద్రవిజయుఁడు వారిరువురకును పరస్పరము పరిచయము కలిగించి శ్రీశచంద్రుని వంకఁ దిరిగి "శ్రీశా! నీ విచ్చటకు వచ్చులోపల నేమేమి పనులను చేసితివి?" అని యడిగెను.

శ్రీశ : మీరు సెలవిచ్చినరీతిగా వా ఱిద్దరిని వెంబడించి యిటు వచ్చితిని.

దేవేం : నీకు వారెక్కడ దొరకిరి?

శ్రీశ : త్రోవలోనే.

దేవేం: నీవు గంగానది నేవిధముగా దాఁటి రాఁ గలిగితివి?

శ్రీశ: ఆ మార్గమున వారిని చూచినతోడనే నేను ముందఱికిఁ బోయి పడవలరేవు చేరితిని. అక్కడ నావ యుండుటచే వారా నావయందే యానదిని దాటుదు రని యూహించుకొని పడవవాండ్రందఱు నవ్వలిమొగమై యుండి మాటలాడుకొనుచుండఁగా నా పడవ పైభాగమున నున్న గది ప్రక్క నడ్డముగ వైచియున్న బల్లక్రిందకుఁ బోయి దాఁగికొనియుంటిని. తరువాత వారిరువురును వచ్చి యా నావ నధిష్ఠించిరి. పడవవాండ్రకూలి మొట్టమొదటనే యిచ్చివేయుటవలనఁ బడవ కొలదిసేపటిలో నవ్వలియొడ్డునకుఁ జేరెను.

దేవేం : ఏమి యీ సాహసము! వారితోఁ గూడ జేరి నదిని దాటుచున్నప్పుడు వారు నిన్ను కనుపెట్టలేకుండుట నీ యదృష్టమనియే చెప్పవలయును. వారిలో నెవ్వరైన నిన్నుఁ జూచుటయే తటస్థించినయెడల నీ వేమైపోయెదవో కొంచెమూహించుకొంటివా?

శ్రీశ: నన్నుఁ గట్టిగఁ బట్టుకొని యెత్తి నఱ్ఱేట బాఱవైచి యుందురు.

దేవేం : అట్లుకాదు, ముందుగా నీ పొట్ట చీల్చి ప్రేవులను పైకిఁదీసి పాఱవైచిన వెనుక నిన్ను నదిలో విసరివేయుదురు. ఏమైనఁ గానిమ్ము. నీవు బ్రదికివచ్చితివి చాలును. నేను చెప్పిన రీతిని నీవు పనిచేసి యుండలేదు.

శ్రీశ : నేను వెనుకకుఁ బోలేను. మీరు వెడలిపోయితిరి. మిమ్ములను చూడవలయు నని నే నిచ్చటికి వచ్చితిని.

దేవేం : నే నిచ్చటకు వచ్చియుందు నని నీ కెట్లు తెలియ వచ్చినది ?

శ్రీశ : తులసీదాసును, గోవిందప్రసాదును మాటాడు కొనిన మాటలనుబట్టి తెలిసికొని యుంటిని. వారి మాటలలో మఱి యిద్ద ఱాలిపుర్ఖమార్గముగాఁ బోయిరని యనుకొనిరి. వా రిరువురితోఁ గూడ మీరును పోయియుందు రని యూహించి నే నిచ్చటకు వచ్చితిని.

దేవేం : మంచిపని చేసితివి. చాల బుద్ధిమంతుఁడవు. పని వచ్చినప్పు డి ట్లుండవలయును.

శ్రీశ : నా కెవ్వరిదయయు నక్కఱ లేదు. నే నెవ్వరికిని భయపడు వాఁడను గాను.

దేవేం : ఈ రాత్రివేళ నిక్కడ భయంకర కార్యమునఁ బ్రవేశింపవలయును.

శ్రీశ : మీలో నేనుఁగూడ నొకడను. నేనేమి పని చేయ వలయును ?

దేవేం : దానినిఁగూర్చి చెప్పటకు వలనుపడదు. నీయొద్ద నాయుధమున్నదా ?

శ్రీశ : కత్తి యున్నది.

దేవేం: దానిని నీ యొద్ద నుండనిమ్ము. అంతియకాక యీపిస్తోలునుకూడ నీ యొద్ద నుంచుకొనుము.

శ్రీశ: దీనిని నాకిచ్చినయెడల మీ యొద్ద మఱియొకటి యుండునా ?

దేవేం: ఉన్నది.

ఇట్లని చెప్పి దేవేంద్రుఁడు శచీంద్రుని తనతోఁగూడ రమ్మని పిలిచెను.

శచీం: ఇంకను కొంచెమునే పాఁగవలయును. చాల రాత్రి యున్నది.

దేవేం: రాత్రి యుండిన నుండనిమ్ము. మన మింక నాలస్యము చేయఁగూడదు. అనావశ్యకంబు లగు పనులతోఁ బ్రొద్దు గడుపుట మంచిది కాదని తోఁచుచున్నది. ఈ యింటి లోనికిఁ బోవుటకు సరియైనమార్గము నీకుఁ దెలియునా ?

శచీం: తెలియును.

దేవేం: ఈయింటఁ బ్రవేశించినయెడల వేఱుగా నైరృతి దిక్కునకుఁ బోవచ్చునా ? మనపని పూర్తి యగునంతవఱకు నెట్టిగందరగోళమును బుట్టదు గదా ?

శచీ: మన మింటిలోనికిఁ బ్రవేశించుమార్గమునం దట్టి భయమేమియు నుండదు.

దేవేం: శచీంద్రా! కాలిచెప్పులను దీసివేయుము. శ్రీశా! నీజోడుకూడఁ దీసివైచి యా యింటిమూల నుంచుము. శచీంద్రా! నీయొద్ద తలకట్టు, కుళ్లాయి మొదలగు వేషపరికరములు నుంచితివిగదా ? అవి యన్నియు నిప్పు డున్నవా ?

శచీంద్రుఁడు కొన్నిటిని దీసికొని వచ్చెను. వానిలోఁ గొన్నిటిని దేవేంద్రుఁడు తీసికొని "మిగుల జతనముతో నుండవలయును. ఎట్టిశబ్దము చేయఁగూడదు. మనకార్యము సిద్ధించు

వలెను నూపిరికూడ గట్టిగా విడువఁగూడదు. ఇచ్చట యమదూ తలకంటెను పిశాచములకంటెను భయంకరు. లైదుగురున్నారు. కొంచెము పరాకుగా నున్నచో వారు మనపైఁబడి చంపివేయుదురు. ఆయైదుగురిలోను నలువురు పురుషులు; ఒక్కతె మాత్రము స్త్రీ. ఆపురుషులకంటె నాకాంతకే మన మెక్కువగా భయపడవలసియున్నది. ప్రాణములకుఁ దెగించితిమేని మనము జమలయెదుట నిర్భయముగా నిలువఁ గలుగుదుము. నీవు సిద్ధముగా నుంటివా? శ్రీశచంద్రా! నీవో?'' అని పలికెను.

శచీంద్రుఁడు శ్రీశచంద్రుఁడు సంగీకార సూచకముగా తలల నల్లాడించిరి. నిమిషమైనను వ్యర్థము చేయఁగూడ దని చెప్పి దేవేంద్రుఁడు వారిచేతులను బట్టుకొని ''వేగముగా రండు!'' అనియెను.

శచీంద్రుఁడు దేవేంద్రుని శ్రీశచంద్రుని వెంటఁబెట్టుకొని గాఢాంధకారమును భేదించుకొని ముందై బయలుదేరెను. ఆముప్వురు నానందకుటీరపు వెలుపలిభాగము చేరిరి. అక్కడ గవాక్షములు వరుసలు తీరి యుండెను. శచీంద్రుఁడా గవాక్షములలో నొకదాని యినుపయూచలను సులభముగా విఱిచి తీసి పాఱవైచెను.

దేవేం: (మెల్లగా) శచీంద్రా? ఏమి చేసితివి?

శచీం: ఎప్పటికైన సమయము వచ్చినప్పు డుపయోగపడు నని యూహించి నే నీకిటికీ కమ్ములను విఱిచివైచి యెప్పటి యట్లే యుంచితిని.

మాటాడక వారు ముప్వురు నా గవాక్ష మార్గమున నానందకుటీరమునఁ బ్రవేశించిరి.

౪

మునుముందు శచీంద్రుఁడు, నాతనివెనుక శ్రీశచంద్రుఁడు వారిద్దఱికి వెనుకను దేవేంద్రుఁడు, నీవిధముగా ముగ్గురును బయలు

చేరిరి. ఏగోఁగదినుండి యెక్కడెక్కడకుఁ బోవచ్చునో శచీంద్రుఁడు బాగుగఁ దెలిసికొనియుండెను. వారు గవాక్షములనుండి ప్రవేశించినది యుగ్రాణము. అక్కడ నుపయోగింపఁదగిన పదార్థము లన్నియు సంగ్రహింపఁబడి యుండును. దాని పార్శ్వమున గదియున్నది. అం దేమియును లేదు. వారు మువ్వురు నాయుగ్రాణమునుండి యాగదిలోఁ బ్రవేశించిరి. ఆయింటిలోనుండి నంట యింటికిఁ బోవచ్చును. ఉత్తరభాగమున నింకొకగది యున్నది. ఆగదిప్రక్క నున్న వేఱొకగదియందు వెలుఁగుచున్న దీపముల కాంతు లాగదిలోఁ బడి నడవయింటివఱకును బ్రసరించుచుండెను. వారు వచ్చునప్పటికి జుమల నవ్వు వినవచ్చెను.

దేవేంద్రుఁడు శచీంద్రుని వెనుకభాగమునం దుండక యాతనిముందఱికి వచ్చి నిలువఁబడియెను. ఆయిరువురను దన వెనుకనే రం డని చెప్పి దేవేంద్రుఁ డా వెలుతురు ప్రసరించుచున్న గదిలోనుండి కొనగాళ్ళతో మెల్లగ నడుగు లిడుకొనుచు ముందఱికి వచ్చెను. అక్కడ మఱియొకనడవ యున్నది. ఆనడవకు దక్షిణమున నున్నయింటియందు దీపము వెలుఁగుచుండెను. ఆ నడవ తలుపులు సగమువఱకును తెఱచియున్నవి. దీపము వెలుఁగుచున్నగదియందే శత్రువులు చేరి సభ చేయఁదలఁచి యుందు రని దేవేంద్రుఁ డూహించెను.

దేవేంద్రుఁ డాసగము తెఱచిన తలుపునకు వెనుకభాగమున నిలిచి చూచెను. సభ కెదురుగా నిరువురు కాంతలు కూర్చుండి యుండిరి. వారిరువురు మనోరమలవలె నగపడుచుండిరి. వారి యాకారమునందు నించుకయైన భేదము కానవచ్చుట లేదు. వారు ధరించినయుడుపులు నలంకారములు నొక్కరీతినే యుండెను. ముత్యాలజాలరు వైచిన యాకుపచ్చ పట్టుపావడలు ధరించియుండిరి. రాత్రి తారకాగణవిరాజితం బగు నీలాకాశమువలె నాపావడలు విరాజిల్లుచుండెను. సమున్నత

వక్షోభాగంబుల నలంకరించియున్న పచ్చపట్టుకొప్పసములు చిత్రవిచిత్రము లగు సరిగకుట్టుపనులతోడను, అమూల్యంబులై యతిసూక్ష్మంబులగు మేలాకులతోడను విలసిల్లుచుండెను. వారి కర్ణయుగళంబుల నలంకరించిన నొఱపుమానికములతమ్మంట్లు మలయవాయుసంచాలనంబున విరళితంబు లగు కప్పుముంగురుల నడుమనుండి ప్రసరించుచున్న దీపకాంతులవలన మిలమిల మెఱయుచుండెను. వాని నొఱసికొనుచు నవరత్నఖచితంబు లగు కర్ణాభరణములు వింతవింతకాంతులతోఁ దూఁగియాడుచుండెను. పోకబోదెలంబోని కోమలకంఠములం దాణిముత్తెముల సరులు ప్రకాశించుచుండెను. తిలపుష్పములనో, కాంచనపుష్పములనో, నిందింపఁజాలు నొఱపు గలనాసికలయందు మిలమిలమెఱయు రవలముక్కెరలు సొంపు మీరి యుండెను. కుసుమకోమలంబగు నాసిక ముక్కెరబరువున కోపఁజాల దను భయమున నాముక్కెరకుఁ గట్టిన నల్లపట్టుదారము చెవిసందుకుఁ జేర్పఁబడియుండెను. మణిబంధముల మణిమయకంకణములును, కరాంగుళుల వజ్రపుటుంగరములు నలరారుచుండెను. ఆకస్మికముగఁ జూచినయెడల నాకాంతులవలనఁ గన్నులు మూసికొనిపోవును.

ఆసుందరీమణు లిరువురిలోన నొకతె జమల; మఱియొక్కతె కుముదిని.

అక్కడ నాయువతీరత్నము లిరువురేకాక యింకను ముగ్గురు పురుషులుకూడఁ గూర్చుండి యుండిరి. కొంతసేపటికి ముందు వారికిని దేవేంద్రునకు నొకవిధమైనయుద్ధము జరగియున్నది. వారందఱును జేరి యచ్చటఁ దుష్టసభయందలి సారాంశములను విని తెలిసికొనుటకై దేవేంద్రుఁ డాసగము తెఱచిన తలుపునొద్ద నిలువఁబడి చూచుచుండెను. మొట్టమొదట డాక్టరు నవీనచంద్రుఁడు మాటాడుచున్నశబ్దము విననయ్యెను. ఆతనికి వినఁబడినది వారిప్రసంగమునందలి కడపటిభాగము.

నవీ.: అట్లే కావచ్చును. కాని. నామాట బాగుగ నాల కింపవలయును. కేవలము చంపివేయఁగూడదు.

ఒకస్త్రీ : మంచియాలోచన చెప్పితివి. నీవు నాప్రాణ మిత్రుఁడవు కాదా? ఆలోచన యున నిట్లుండ వలయును! అహాహా!

దేవేంద్రుఁ డామాటలయర్థమును బట్టియు నాసవ్వులో భావమునుబట్టియు నామె జమలయని నిశ్చయించుకొనియెను.

జమ : విపత్తు సంభవించునా? ఆకార్యమునం దెందు వలన విపత్తు కలుగునో నీ కేమైనఁ దెలిసినదా?

నవీ : దేవేంద్రవిజయమిత్రుఁ డింకను బ్రాణములతో నిలిచియున్నాఁడు గాదా?

జమ : ఆతఁ డింతలోనే మన యుద్యమముల నన్నిటిని బాగుగ నూహించి తెలిసికొని యుండు నని నీకుఁ దోఁచుచున్నదా?

నవీ : ఊహించుట యెందులకు? ఆతనికి నిజమైన సమా చారమే తెలిసియుండవచ్చును.

జమ : ఏకారణమునుబట్టి యూహించి నీ వింత ఖండిత ముగాఁ జెప్పుచుంటివి?

నవీ : ఆతఁ డనుమానించి వచ్చినందులకుఁ దగినఫలము ననుభవించియే యున్నాఁడు.

జమ : ఆతఁడు సేవకుఁ డగుసుబ్బు నిచ్చుటకుఁ బంపి యుండెను కాదా?

నవీ : ఔను.

జమ : ఆతని కెట్టియవస్థ తటస్థించినదో నీకుఁ దెలియ లేదా?

నవీ : ఆతని కంతమాత్రము చాలును.

జమ : అది యనుమానమాత్రమే యని తెలిసికొనుము,

నవీ : ఆ యనుమానమునే నిజము చేసికొని కూర్చుండి యుంటిమి.

జుమ : ఎట్లు ?

నవీ : ఆతని సేవకునిఁ బట్టుకొని బంధించి యుంచితిమి కాదా ?

జుమ : ఔను. అప్పటికి మఱియొక యుపాయము లేక పోయినది.

నవీ : ఆ యుపాయమువలననే యిప్పుడుకూడ నుపాయము లేనివార మైతిమి ?

జుమ : ఏల ?

నవీ : సుబ్బు మరల దేవేంద్రవిజయునియొద్దకుఁ బోలేదు కాదా ?

జుమ : పోలేదు.

నవీ : అందువలననే దేవేంద్రుఁ డన్నిసంగతులను తెలిసికొనఁ గలఁడు. తనసేవకుఁ డెక్కడ నుండె ననియు, నాతఁ డింకను వెనుదిరిగి యేల రాలే దనియు, నాతని కెచ్చటపో నెట్టి యభ్యంతరమో కలిగియుండు ననియు నాలోచించుకొని క్రమముగా దేవేంద్రుఁ డన్నిటిని గ్రహింపఁ గలఁడు ?

జుమ : సరియే. అట్లు గ్రహించుననియే యనుకొందము. అంతమాత్రమున నే మగును ?

నవీ : ఆతని కింతవఱకు నున్న యనుమానము నిశ్చయముగాఁ బరిణమింపఁగలదు.

జుమల యూరక నవ్వసాగెను. భయంకరమై యమంగళ సూచకం బగు వికటహాస మామెముఖమండలమునఁ దాండవించుచుండెను.

నవీ : ఏమి ! ఇట్లు నీవు నవ్వుట కేమి కారణము ?

జుమ : హా! ప్రాణసఖా! నీ వేమియు నెఱుఁగవు. కేవలము పిఱికివాఁడవు. ఊరక భయపడుచుందువు.

నవీ : భయంకరంబు లగు కార్యములయం దవశ్యముగ భయపడుటయే యుచితము.

జుమ : నవీనచంద్రా! సుబ్బును పునర్జన్మ మెత్తునట్లుగాఁ జేయఁగల ననుసంగతి నీకుఁ దెలియదా?

నవీ : మరల నది యేమి?

జుమ : ఏ మందువా? ఒకబొట్టుమందు. మీరు డాక్టరులు అనేకుల కౌషధముల నిచ్చుచుందురు గాదా? మీ రొకసీసా యందలి యౌషధము నంతను నుపయోగించి చేయఁజాలని కార్యమును నేను బొట్టువలనఁ జేయఁగలుగుదును. బిందుమాత్ర మౌషధము నిచ్చి యాతని నిర్బంధమును వదల్చివైచెదను. అప్పు డాతనికిఁ దా నెక్కడ నె ట్లున్నదియు, నెక్కడ నేమైనదియు, నెక్కడ నేమి చూచినదియు, నేదియు జ్ఞప్తియందుండ నేరదు. పత్తేదారు దేవేంద్రవిజయుఁడు తనభార్య యెచ్చటఁ జచ్చిపోయినదో తెలిసికొనలేకుండును.

నవీ : అందువలన నప్పు డాతని యనుమానము మఱింత వృద్ధియగును కాదా?

జుమ : ఆతఁ డనుమానపడి చావనిమ్ము! అంతమాత్రమున మన కేమి నష్ట మున్నది?

నవీ : మనల ననుసరించుటకే ప్రయత్నించుచుండును.

జుమ : మనల ననుసరించియే వచ్చినయెడలఁ దప్పక మరణము పొందఁగలఁడు! భార్య పోయినమార్గమునే పట్టి పోవలసివచ్చును.

నవీ : ఆతని యనుమానము నిజముగాఁ బరిణమించి స్థిరపడుటచే నాతఁ డిక్కడకే వచ్చును.

జుమ : రానిమ్ము! అందువలన మనకు లాభమే కాని నష్ట మెంతమాత్రమును లేదు.

నవీ : ఆతఁ డొకవేళ నాకస్మికముగా నిచ్చుటకు వచ్చిన యెడల నేమి చేయుదువు ?

జుమ : ఏమి చేయుదునా ? ఆతఁడు కష్టపడి యిచ్చుటకు వచ్చినయెడల నిఁకఁ దిరిగిపోలేఁడు.

నవీ : జుమలా ! నీవు రమణీశిరోమణివి ! నీవంటికాంతను నే నెచ్చటను జూడలేదు !

జుమ : జుమల యెప్పుడైన నెవ్వరిమూలముననైన నోడి పోయినది కాదు.

నవీ : అవును. నా కది యంతయును దెలియును. కాని యిఁకముందుఁ జేయవలసినపని యేమి ?

జుమ : ఈ రాత్రియే మనమార్గమును నిష్కంటకము చేసికొనవలయును.

ఇట్లు చెప్పుచు జుమల తన తీవ్రకటాక్షములను నవీన చంద్రునిపైఁ బ్రసరింపఁ జేసెను. ఆ కటాక్షములు నిరర్థకములు కావు. వానియం దేదియో భయంకరభావము లీనమై యుండెను. ఆ భావమును నవీనచంద్రుఁడు గ్రహియించెను.

తులసీదాసు : జుమలా! ఏవిధమున నీ మార్గమును నిష్కంటకము చేసికొందువు? నేను వినఁగూడదా ?

జుమ : (ప్రశాంతస్వరముతో) ఇప్పుడో, మఱికొంతసే పైనతరువాతనో వార లందఱును చచ్చితీరవలయును!

తుల : వా రిరువురను నెట్టియుపాయమున సంహరింపఁ దలఁచితివి ?

జుమ : ఔషధమున. ఔషధమున. ఏకబిందుమాత్ర మగు నౌషధమూలమున——

తుల : ఎట్లొసంగెదవు ?

జుమ: అతిసులభముగనే వారు త్రాగునుదకముతోఁగలిపి-

తుల : వారు నీ వొసంగిన యుదకమును పరిగ్రహింపక పోయినయెడల ?

జుమ : మఱియొక మంచి యుపాయ మున్నది.

తుల : అది యేది ?

జుమ : నాపనిని సంపూర్ణముగ నెఱవేర్చుకొనువఱకు నా ప్రస్తావము వలదు.

తుల : ఎంతసేపటిలో నీపని యంతయును ముగియింపఁ జాలుదువు ?

జుమ : ఒకగంటలో, ఒకగంటలోనే వారందఱును చావ వలయును,

తుల : ఈపనిలో నీకు నేనుగాని, గోవిందప్రసాదుగాని యేదైనసాహాయ్యము చేయవలసియుండునా ?

జుమ : అక్కఱ లేదు. మీ రిరువురును పైయంతస్తున మీగదులలో స్వస్థచిత్తులై పరుండుఁడు. మీ రిద్దఱు నీకార్యము నందుఁ చేయి చేసికొనవలసిన యగత్యము లేదు.

గోవిం : ఇది యేమి ? అంత పెద్దపని కాదు. ఇందు మాకు కష్టమును లేదు.

జుమ : డాక్టరు నవీనచంద్రుఁడును నేనును గలసి మీపని యంతయును ముగియించెదము !

గోవిం : మాపనియా ? మాపనిని ముగియించెదరా ? ఆ మాట కర్థ మేమి ?

జుమ : అవును, మీపనియే.

గోవిం : ఆమాటయందలి యర్థము మాకు బాగుగ బోధ పడునట్లు—

జుమ : (ఆగ్రోక్తియం దే) అర్థ మేమసంగా మిమ్ములను గూడఁ జంపివై చెదను. ఏ మందువు ?

గోవిం : ఆమాట యెంతవఱకు నిజ మని మేము నమ్మ కొనవలయును ?

జుమ : (నవ్వుచు) అట్లే చేసెదను. నమ్మెదవా ? (జుమల తన చంచలకటాక్షములను పరగించెను.)

తుల : మేము చాల నలసిపోయితిమి. మే మెచ్చ టెచ్చట శయనింపవలయునో కొంచెము తెలిపితివేని పోయి పరుండెదము. నే నింకఁ గూరుచుండఁజాలను.

జుమ : సోపానములయొద్ద నున్న గదిలో నీవు పండు కొనుము. (గోవిందప్రసాదునుగూర్చి) నీవు దానిప్రక్క గదిలోనికిఁ బోయి శయనింపుము.

నవీ : (కుముదినితో) కుముదా ! మేము చేసిన యాలో చనవిషయమున నీయభిప్రాయ మేమి ?

కుము: జుమల యభిప్రాయమే నాయభిప్రాయము. వేఱుగ నన్నడుగు టెందులకు ? మనోరమ చచ్చిపోయిననే గాని నాకు సంతుష్టి కలుగదు.

నవీ: నీవు పోయి నీ గదిలో శయనింపుము. పనిపూర్తియైన తరువాత వచ్చి చూచెదను.

తులసీదాసును, గోవిందప్రసాదును, కుముదినియు నట నుండి నియమిత స్థలములకు వెడలిపోయి శయనించిరి.

౨౪

అక్కడ నవీనచంద్రుఁడు, జుమల మాత్రమే యుండిరి. ప్రక్క నున్నగదిలో దేవేంద్ర విజయుఁడున్నాఁడు. అతఁడు వారి సంభా షణముల నాలకించుచు వారు నిర్వహించుచున్న కార్యకలాపము లను గాంచుచు మొదటివలెనే నిలిచియుండెను.

కొంతసేపైన తరువాత జుమల నవీనచంద్రుని కూరుచుండుమని చెప్పి లేచి వెంటనే చిన్నపెట్టెను తీసికొని వచ్చెను.

నవీ : ఈ రాత్రియే యూపని యంతయును ముగించినై చెదవా? నిజముగా నందఱను జంపినై చెదవా?

జుమ : అందఱను జంపెదను.

నవీ : కుముదినిని కూడనా?

జుమ : ఆ.

నవీ : కుముదిని నా భార్య. దానిని నీవే నా కిచ్చి పరిణయము చేసితివి.

జుమ : అవును. ఆమె నీ భార్యయే. ఆమెను నేనే నీకిచ్చి పెండ్లి చేసితిని.

నవీ : అట్టి నీవిప్పుడాసంగతి యంతయును మఱచి పోయెదవా, జుమలా!

జుమ : లేదు, మఱచిపోలేదు. ఏమైన నేమి? ఈ దినమున నీవు తప్పక విధురుఁడు వయ్యెదవు.

నవీ : అది యేమి జుమలా! కుముదినీ నీకు——

జుమ : (అర్థోక్తియందే) నా కామె యెట్టియుపకారమును చేసియుండ లేదు. ఇది నా యిష్టము——నాయాశ——నామనసు—ఆమెను నీకిచ్చినదానను నేను. మరల నేనే తీసికొనుచున్నాను. ఇంతకంటె విశేషించి చెప్పనలసిన దేమున్నది?

నవీ : ఇది యేమి? ఈ నీయాశ భయంకరము కాదా, జుమలా?

జుమల పకపక నవ్వసాగెను. ఇష్టము లేకపోయినను నవీనచంద్రుఁడుకూడఁ గొంచెముగా నవ్వెను. అనగవు జుమల సంతోషముకొఱకు. తరువాత జుమల నవీనచంద్రునిఁ జూచి "నా యభిప్రాయమే నీ యభిప్రాయము కాదా!" అని యడిగెను.

నవీ : దానితాత్పర్యమును నీవు నాకు సరిగా బోధపఱచినయెడల—

జుమ : ఊఁ! తరువాత నేమో చెప్పుము.

నవీ : చాలకాలమువఱకు విధురుఁడనై యుండవలసిన యవస్థ నాకుఁ గలుగకున్నయెడల—

జుమ : అలాగా? అదియా నీ విచారము!

నవీ : ఔను జుమలా! అదియే నా విచారము. నీ సంకల్పముజ్ఞప్తియందున్నదా?

జుమ : జ్ఞప్తియున్నది. ఆ సంకల్పము నెఱవేఱుటకు సమయమువచ్చి నీవు సంసిద్ధుఁడవై యున్నప్పుడు నీకు నాయభిప్రాయము బోధపడఁగలదు.

నవీ : జుమలా! నీయమానుష కృత్యములను, నీనిషిద్ధకార్య కలాపములను, నీయసాధారణదారుణ తంత్రములను, నీయమూల్య మోహనకటాక్షమాలికలను, నీయగాధ హృదయభావములను నెన్నిసారులుచూచిన నన్నిసారులును నాకు నీయందలి ప్రీతివిశ్వాసములు వర్ధిల్లుచునే యుండెను. వానితోఁగూడ నాకోరికలును వర్ధిల్లుచునే యుండెను.

జుమ : నీకా? నిజముగనే! నీయీ మనోరథమును సిద్ధింపఁ జేయుటనుగూర్చి మఱవవలదు.

నవీ : ఏల మఱచిపోయెదను?

జుమ : ఈ దినమున నీ భార్యపై జరపుచున్న కార్యము నీపైనిగూడ జరపఁగలను.

నవీ : ఓహో! అదియా? నా కట్టిభయ మెంతమాత్రమును లేదు.

జుమ : భయము లేకపోవుట యేమి?

నవీ : నీవు నన్ను నీప్రాణముకంటెను విశేషముగఁ

ప్రేమించుచుంటివి. అంతియకాక నావలన నీకుఁ బ్రయోజనము కూడ నున్నది. నేను లేకపోయినయెడల నీకు——

జుమ : (అర్థోక్తియందే) నవీనచంద్రా! నీవు లేనియెడల నాకు జరుగదనియా నీయాలోచనము!

నవీ : ఔను. కాని నేనొకవిషయమునఁ జాల యోచించుచున్నాఁడను.

జుమ : ఏమది ?

నవీ : ఈరాత్రి గడచి తెల్లవారునప్పటికొక స్థలమునందే యైదుశవములు పడియుండును. సుబ్బునుకూడఁ జేర్చుకొన్నయెడల నాఱుశవములు!

జుమ : అవును. ఆఱుశవములు.

నవీ : ఈ యాఱుశవముల నగపడకుండఁజేయుట కుపాయమేమున్నది ? ఏమిచేయుదువు ?

జుమ : ఏమియును చేయ నక్కఱలేదు.

నవీ : అక్కఱలేదా ?

జుమ : నిజముగా నేమియునక్కఱలేదు.

నవీ : కాని, జుమలా!

జుమ : ఏమి, నవీనా ?

నవీ : బాగుగ నాలోచించి చూడుము! ఈ పని సామాన్యమైనదియు సహజమైనదియుఁ గాదు. ఆఱుశవములు! ఆఱుశవముల నొక్కసారిగాఁ గప్పివేయుటకుఁ దగిన గోతిని త్రవ్వుట యొక్కనికి సాధ్యమగునా ? పోనిమ్ము! గంగలోఁ బాఱవేయుటకైన నొక్కఁడు చాలఁడు. ఒక మనుష్యుఁడు——

జుమ : (ఆమాట ముగియకుండగనే) ఒక మనుష్యుని వలన సాగదని నే నెఱుగుదును.

నవీ : అట్లయినచో నీ విప్పు డేమి చేయవలయు నని నిశ్చయించితివి ?

జుమ : నిశ్చయించుట కేమి యున్నది? ఆశవము లన్నియు నిచ్చటనే పడియుండఁగలవు.

నవీ : అప్పుడు మన గతి యేమగును ?

జుమ : మనగతియా ? మనమిచ్చటనుండి నెమ్మదిగా జరగి పోయెదము.

నవీ : ఎక్కడకుఁ బోవుదము ?

జుమ : ఒక్కసారిగా నంతర్ధానమై మాయమై యంతరాళమునఁ జేరిపోయెదము.

నవీ : అట్లుకాదు, తప్పక మనము దొరకిపోవుదుము— సందేహము లేదు.

జుమ : నీవు దొరకిపోయెదవేమో ? కాని, నేనుమాత్ర మెన్నటికిని దొరకుదానను గాను.

నవీ : నీవు దొరకకుండఁ దప్పించుకొనుట కేదియైన నుపాయమున్నదా ?

జుమ : నేను చచ్చి పడియుందును. అప్పుడెల్లరును నేను మరణించితినని యనుకొందురు.

నవీ : అది యెట్లగును ?

జుమ : నీవు కేవలము మూర్ఖుఁడవు. కొంచెమైనను గ్రహించఁజాలవు. కుముదిని చాల దినములక్రిందటనే చచ్చిపోయెనని యెల్లరకును దెలియును. నేనామె నింతకాలమువఱకు గూఢముగా దాఁచియుంచి సమయమువచ్చినప్పుడు నామార్గమును నిష్కంటకముగాఁ జేసికొనవచ్చునని యూహించుకొని యామె మరణించిన ట్లసత్యమైన ప్రవాదమును పుట్టించితిని. నేనిట్లు కల్పించితినని యెవ్వరికిని దెలియదు. అందఱు నామె కాలధర్మము

నొందినదనియే నమ్మియుండిరి.  రేపటియుదయమున నొక్కచో యాకారముగల యిరువురుసుందరులు అనఁగా, కుముదినియు, మనోరమయు, నొక్కచోఁ బడియుండుటను జనులెల్లరను జూడఁ గలరు. ఆశవములలో నొకశవము నాదియై యుండునని యందఱకును నమ్మకము కలుగఁగలదు.

౬

దురాత్ముఁ డగు డాక్టరు నవీనచంద్రుఁడు పాపాత్మురాలగు జుమల మాటలయందలి భావార్థములను సంపూర్ణముగ గ్రహించిన తోడనే కాలసర్పముచేఁ గఱవఁబడి తలకెక్కిన విషజ్వాలచేఁ దీవ్రవేదనల ననుభవించుచున్న వాఁడునుంబోలె సర్వాంగములును గడగడ వడఁకుచుండ "ఓహో! అదియా? తెలిసినది" అని పలికెను.

జుమ : తెలిసినదా? బాగుగఁ దెలిసినదా? ఎంతటి సులభమైన యుపాయము! ఎంత నేర్పఱితనము!

నవీ : అట్లయినయెడల నేను బ్రదికి యుందును. నేను తప్పించుకొని పాఱిపోయితి నని యెల్లరకును సులభముగాఁ దెలియఁగలదు.

జుమ : అవును. ఎట్లు తెలియకుండును? అట్లేకాకపోయినయెడల నింత కౌశలమును వ్యర్థము కాఁగలదు.

నవీ : కావున నేను.

జుమ : అవును. నీకట్లయినచో నప్పుడు నీవు ప్రేమించుచున్న కాంతను నిరంతరము ప్రేమించుచుందువు. మఱియు నామె కూడ నిన్నువిశేషముగ వశపఱచుకొనఁగలదు. నాకుఁ గావలసినదే యది. అంతే నాకోరిక. నేను చెప్పినవిధమున నడచుకొనుము. అట్లయినచో నాయాశయును వర్ధిల్లఁగలదు.

నవీ : జుమలా! నీవు నన్ను నిజముగా బ్రేమించెదవా! మఱియొకసారి చెప్పుము!

జుమ : నవీనచంద్రా! నీవా విషయమున సందేహపడు చున్నావా ? అక్కఱలేదు.

ఇట్లు చెప్పి జుమల నవీనచంద్రునిమోముపై మోముచేర్చి ముమ్మారుముద్దు పెట్టుకొనియెను. నవీనచంద్రుఁడును జుమలను తనబాహువులతో బిగించి బిగ్గఁ గవుంగిలించుకొనియెను. మంత్ర ముగ్ధహృదయుఁడై పోయిన యా నవీనచంద్రుఁ డప్పుడు దారుణ నరకమున క్షణిక స్వర్గసుఖము ననుభవించెను. తమాలభూరు హము నాశ్రయించియున్న మాధవీలత పోలిక రూపలలితయు, సౌందర్యకలితయు, విలాసభరితయు, నైయున్న యా జుమల దేహలత డాక్టరు నవీనచంద్రుని వక్షోభాగమునఁ జాలసేపు చేరియుండెను.

నవీ : జుమలా! హత్య చేసినవాఁడను నేనేయని యను మానించి పోలీసువారు నన్ను వెంబడించి పట్టుకొనఁ బ్రయత్నించి నప్పుడు నీ వేమి చేసెదవు?

జుమ : అట్లయినచో నప్పుడు నిన్నింతకంటెను విశేష ముగఁ బ్రేమించెదను.

నవీ : మఱియొక సమాచారమున్నది. ఆ ధనము విషయమై యేమి యాలోచించితివి ?

జుమ : ఆ సంగతి మఱచిపోయితి ననుకొంటివా ?

నవీ : లేదు.

జుమ : దానిని గూర్చి యేమియు చేయలేదని నీ వూహించుచుంటివి కాఁబోలు!

నవీ : ఏమి చేసితివి ?

జుమ : ధనముగా దొరకినదాని నంతను భద్రముగా సంగ్రహించుకొని యుంటిని.

నవీ : ఆ ధన మెంత యున్నది ?

జుమ : కొంచె మెచ్చుతగ్గుగా నేఁబదివేల రూపాయలై యుండవచ్చును.

నవీ : అంతయును రొక్కమేనా ?

జుమ : రొక్కమే. అదిగాక ముప్పదివేల రూపాయల విలువగల వస్తువులుకూడ నున్నవి.

నవీ : ఆలాగా ? ఆ వస్తువులును రొక్కమునుగూడ నిప్పుడిక్కడనే యున్నవా ?

జుమ : అవును.

నవీ : ఈ గృహమునందే యున్నవా ?

జుమ : ఈ యింటియందే.

నవీ : నీయొద్దనే ?

జుమ : నవీనచంద్రా ! తెలివిలేని దాననని భావించుచున్నావు కాఁబోలును !

నవీ : లేదు, లేదు.

జుమ : నేను కేవల మవివేకముగా నెప్పుడే కార్యమును జేసియుంటిని ?

నవీ : లేదు.

జుమ : నా సంగతినిగూర్చి నన్నడుగుట యెందులకు ? ఆ సంగతు లన్నియును నీతోఁ జెప్పినయెడల నేను తెలివితక్కువదానను గాక మఱి యేమగుదును ?

నవీ : జుమలా ! అది యేమి ? నేను మాత్రము లాఁతివాఁడనా ? అది యేమి యట్లనుచున్నావు ?

జుమ : అట్లు చెప్పకపోయినయెడల నింతటి యనుకూలసమయమున నీవు నన్ను విడిచిపెట్టెదవా ?

నవీ : నీ హృదయభావము లేవియు నాకు బాగుగఁ దెలియుట లేదు. విశదముగాఁ జెప్పవలయును.

జుమ : ఆ ధనము నీచేతికి దొరకినయెడల నీ వితర శవములను విడిచి పాఱిపోవునట్లే నన్నుఁగూడ శవముగాఁజేసి పాఱవైచి పోవుటకు వెనుదీయుదువా ?

నవీ : ఓహో! జుమలా! జుమలా! నా విషయమున సందేహమెందుకుఁ గలుగవలయును ?

జుమ : నవీనచంద్రా! నా ప్రాణప్రియా! నీ వింతటి మూర్ఖుఁడ వైపోయెదవేల ?

నవీ : అట్లయిన బాగుగ యోచించి చూడుము!

జుమ : యోచింప నక్కఱలేదు. ఇఁక యోచనమాట చెప్పవలదు. కార్యము! కార్యము! మొట్టమొదట కార్యము నెఱవేర్పవలయును.

నవీ : ఏమి చేయవలయునో చెప్పుము!

జుమ : మఱి యేమియును లేదు. నేను చేయుపనికి సాహాయ్యము చేయవలయును.

నవీ : అందుకొఱకు నే నెల్లవిధముల నెప్పుడును సంసిద్ధుడనై యున్నాఁడను.

జుమ : ఈపని పూర్తియైన తరువాత మన మిరువురము స్వతంత్రులమై సుఖముగఁ గాలక్షేపము చేయుచుందము.

ఇట్లు చెప్పి జుమల చిన్నపెట్టెనుండి సీసా పైకిఁదీసెను. అందు మిగుల నెఱ్ఱని ద్రావకముండెను. జాగరూకతతో దానిపై మూతను దీసి వాసన చూచుదానివలె నట్లే యాసీసాను తన ముక్కుపుటములయొద్దఁ బెట్టుకొనియెను.

నవీనచంద్రుఁ డప్పుడు కొంచెము ముందఱికి జరగి వచ్చి మిగుల నాశ్చర్యముతోఁ గనుఱెప్ప వాల్పకుండ నా జుమలవదనమును తదేక దృష్టితోఁ జూచుచుండెను. జుమల యా సీసాను తన ముక్కునొద్దనుండి తీసి కొంచె మేమియో యాలోచించుదానివలె నటియించెను. మరల నొకసారి వాసన చూచుటకుఁ

ప్రయత్నించెను. తరువాత నాసికను కొంచెముగఁ గుంచించుచు "ఏమి యీ దురదృష్టము! పడిసెమువలన ముక్కు మూసికొనిపోయినది! వాసనయే తెలియుట లేదు" అనియెను.

నవీ : ఏమి యీకష్టము! ఇప్పు డేమి చేయవలసి యుండును ?

జుమ : చేయవలసిన పని యేమియును లేదు. ఇది సరియైన మందగునో, కాదో చూడవలయును. నీవు చూచెదవా? నాగసంపెఁగ పూవు పరిమళము వచ్చుచున్నదేమో నీవు వాసన చూచి చెప్పవలయును. నా ముక్కు మూసికొనిపోయినది. వాసన తెలియుట లేదు.

నవీ : సరియే. ఎట్టి వాసనయున్నదో చెప్పఁగలను.

జుమ : చెప్పఁగల నన్నంతమాత్రమునఁ జాలదు. ఇప్పుడే చూచి చెప్పవలయును. దీనిని నీవు తీసికొనుము. భద్రము! ద్రావకము నీచేతికొక బొట్టయినను తగులఁగూడదు.

నవీ : చేతికిఁ దగిలినంతమాత్రమున నష్టమేమి? అంత యపాయకరమైనదా ?

జుమ : ఏ మనుకొనుచున్నావు? ఆ ద్రావకము చుక్క నీచేతికిఁ దగిలినయెడలఁ ద్రాచుపాము కఱచినదానికంటె నెక్కుడుగా బాధింపఁగలదు.

నవీ : జుమలా! నీవెంత భయంకరమైనదానవో నీమందు కూడ నట్లే యున్నది. కానిమ్ము. నీవు సంగ్రహించినవస్తువు లన్నియును భయంకరములై నవియే! వాని గుణముకూడ నసాధారణమైనదే.

జుమ : అవును. నేను వీని నన్నిటిని ఫూలుసాహేబు నొద్దనుండి సంపాదించితిని.

నవీ : ఈ యౌషధపు వాసన కేవలము నాగసంపెఁగ పూవు పరిమళమువలెనే యుండునా ? వాసన చూచుటవలన

నేమియు నపాయము లేదుగద ?

జుమ : ఎట్టి యపాయమును లేదు. అట్లున్నయెడల దీనిని నీచేతి కిచ్చియుందునా ?

నవీనచంద్రుఁ డాసీసా మూఁతదీసి ముక్కునొద్ద నుంచుకొని బాగుగ నాఘ్రాణించెను. తత్క్షణమే యతి దారుణంబును, నతి వికటంబు నగునార్తనాదము చేయుచు లేచి నిలువఁబడి రెండడుగులు ముందటికిఁ బోయి సీసాను విసరి పాఱవైచెను.

జుమల వేగముగఁబోయి యాసీసా దీసి మూత భద్రముగా వైచి పట్టుకొనియెను. ఆ సీసాలో ప్రస్సిక్ ఆసిడ్డుకంటెను తీక్ష్ణమైన ద్రావకముండెను. నవీనచంద్రుఁడు గ్రుడ్డివానివలెనా యింటిచుట్టును దిరుగాడుచుండెను. అఁతడు బిగ్గరగాఁ గేకలు వైచుటకుఁ బ్రయత్నించెను గాని సాధ్యము కాలేదు. రెండు గడియ లగునప్పటి కాతని శరీరము జోగి పడిపోవుటకు సిద్ధముగా నుండెను. సారాయము ద్రావినవానివలె జోగుచు తన రెండు చేతులతోడను తల భద్రముగాఁ బట్టుకొని జుమల ముందరఁ గూలఁబడియెను. తరువాత రెండు నిమిషములకు నేలపైఁ బడి కొట్టుకొన నారంభించెను.

జుమల మరల వికటహాసము చేసెను. నవీనచంద్రుఁడు కొట్టుకొనుచున్నంత సేపు జుమల యాతనివంకఁ జూచుచుఁ బిశాచివలె నవ్వుచుండెను.

నవీనచంద్రుఁడు కొలఁది సేపటిలోననే మృత్యుదేవత కాహారమై పోయెను.

"ఒక్కఁడు కడతేరినాఁడు" అని యా కఠినహృదయ జుమల పిశాచమువలె నతిభయంకరముగ నవ్వుచుండెను.

౨

జుమల నిలువుటద్దము నెదుటకుఁ బోయి తనప్రతిబింబము జూచుకొనుచు గట్టిగా నవ్వుచు "జుమలా! మరల నీ కింతటి పర్వదినము

దొరకదు. ఇప్పుడు నీకు మహోత్సవము! కేవలము హత్యలు; హత్యలుచేయవలయునని యున్న నీ యభిలాష మింకనువర్ధిలుచునే యున్నది! ఒక్కటి మైనది - రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆఱు, ఏడు, ఎనిమిది, తొమ్మిదిహత్యలు. కొన్నిమాత్ర మింకను మిగిలియున్నవి. నవీనచంద్రుని గడతేర్చుట మైనది. రెండవది కుముదిని; మూడవవాఁడు తులసీదాసు; నాలుగవవాఁడు గోవింద ప్రసాదు; నేను తప్పులెక్కపెట్టుట లేదుగద! ఈపని పూర్తియైన యెడల నీసరికి వారందఱును పోయి యమదూతలకుఁ బనులఁ గల్పించుచుందురు. ఇఁక మిగిలినవారు రేవతి, మనోరమ, సేవకులు మాత్రమే. వారి పని యెంతసేపటిది? యమరాజా! ఈ దినమున జుమల నీ సేవకురాలు'' అని బిగ్గరగా ననెను.

ఆ ప్రక్కగదియందుండిన దేవేంద్రవిజయుఁడు జుమల వాక్కులనుండి వెడలిన హత్యల వివరణము వినియెను. అప్పు డాతనికిఁ గలిగిన కోపమువలన నాతని యాపాదమస్తకమును వడఁక నారంభించెను. ఆ పాపాత్మురాలి వచనములనుబట్టి కుముదినికిని, తులసిదాసునకును, గోవిందప్రసాదునకు నప్పుడే విష ప్రయోగము చేసి వైచిన దని యాతఁడు తెలిసికొనియెను. వారు తమ తమ శయనమందిరముల శయనించియుండియుఁ దమ తమ మృత్యుదేవతల నాలింగనము చేసికొనియే యుందు రని నిశ్చ యించుకొనియెను.

దేవేంద్రవిజయున కప్పుడా పాపకార్యములను నివారణ చేయుటకుఁ దగిన యవకాశమే యున్నయెడల నవశ్యముగ నాతఁడు నివారించి యుండును. మించిపోయినది. జాగరూకుఁడై జుమలను కనుపెట్టుచుండి యామెమూలమున మఱియెట్టి యనిష్ట మును గలుగకుండునట్లు చూచుకొనవలయును. తత్క్షణమేపోయి యా రాకాసిని పట్టుకొని బంధింపవలయు నని యాలోచించెను; మరల నిదానించి యిప్పుడే యామెను పట్టుకొనుటంత మంచిది గాదని నిశ్చయించుకొనియెను.

జుమల మేజాబల్లపైన సారాయము నింపిన కాచపాత్రము దీసి యందలి సారాయమును దనివారఁ గ్రోలెను. తరువాత గంజా యని కూడఁ బీల్చి ఆనందముచే నామె యేమేమియో పాడ నారంభించెను.

అట్లుపాడుచుండఁగా నామెకు సమీపమున నవీనచంద్రుని మృతకళేబరము కంటఁబడి యామె మైకమునకును, నానంద మునకును, నుత్సాహమునకును కొంచెముగ విఘాతముకలిగించెను.

అప్పు డామె గవాక్షమునకు వ్రేలవైచిన యడ్డుతెరను దీసి యా శవముపై వైచి మూసెను. మరల గంజాయి బీల్చి పాట పాడెను. అట్లుపాడుచునే మిగిలిన గంజాయినికూడఁ బీల్చి మైకము కలుగుటచే మరల బుడ్డి సారాయమును ద్రావి గానము చేసెను.



జుమల యావిధముగా గానము చేయుచుఁ జేయుచు నాకస్మిక ముగ నేమో యూహించి చకితయై పాట నిలిపి గది గోడయం దున్న యినుపపెట్టె తెఱచి యందున్న చిన్నపెట్టెను బైకిఁ దీసెను. ఆ పెట్టెయం దమూల్యమణిమయంబు లగు నలంకార ములు నిండియుండెను. అందొక యరలో కాగితములకట్టుండెను.

జుమల నవ్వుకొనుచు "నా పరిశ్రమకుఁ దగిన ఫలమిదియే. ఇంతటిధనము, ఇన్నిరత్నములును కైవస మైనవి. ఈ ధనమంత యును దీసికొని యిచ్చటనుండి పోయినయెడల సుఖయింతునా? నేను సంకల్పించుకొన్న మారణవ్రతము నుద్యాపన చేయకుండ నీ ధనమునుమాత్రము కొనిపోయిన యెడల నా మన సెంత మాత్రమునానందింపఁజాలదు. హోలీపండుగ చేయుచున్నదానను. ఓహో! సారాయి మైకమువలన ముఖ్యవిషయము మఱచిపోతిని. '17, క' గుఱుతు గల కాగితములకట్టను గూర్చి మఱచితిని. దానిని తెచ్చుకొనవలయును" అనెను.

జుమల మరల నినుపపెట్టెను దెఱచి కట్ట పైకిఁ దీసెను. "దీనిని మొట్టమొదట బాగుగఁ జూడవలయును. ఇందు రామగులాము ప్రమాణపత్రిక యున్నది. ఇంకను నమూల్యపదార్థము లుండవచ్చును. నా కిప్పు డవకాశము లేదు. వెనుకనుండి చూచుకొనవచ్చును. దీనిని కనిపెట్టుట మఱియెవ్వరికిని సాధ్యము కాదని రామగులాము నమ్మియుండెను. వాఁడు దీనిని గూర్చి నాతోఁ జెప్పనే లేదు. కానిమ్ము. దీనివలన నెట్టిప్రయోజనము నున్నట్లు తోఁచుట లేదు. ఇటనుండి వెడలిపోవునప్పుడు దీనినిగూడఁ దీసికొనిపోయి సమయము దొరకినప్పుడు బాగుగఁ జదివిచూచెదను"! అనెను.

కట్ట నెప్పటిచోట నుంచి తిరిగి బుడ్డిసారాయమును త్రావియీనిన పులి యాడుకొనుచున్న తన బిడ్డలను చూచునట్లే దానివంకఁ జూడనారంభించెను. అట్లు చూచిచూచి యతిభీషణముగ నవ్వెను. దేవేంద్రవిజయుఁ డదరిపడియెను.

జుమల యింకొక సారాసీసా తీసి చేతఁబట్టుకొని యల్లాడించుచు " ఇది నాకు ముఖ్యమైన యాయుధము !" అని త్రావితూలుచు దేవేంద్రుఁడు నిలిచియున్న గదిలోనుండి వెలుపలకు వచ్చెను. సారాయపు మైకమువలనఁ దన యెదుటనున్న దేవేంద్రుని కనుపెట్టలేక పోయెను.

దేవేంద్రుఁడు తనసామర్థ్యమును బాగుగ నెఱింగినవాఁడే కావున నారాకాసి రహస్యముగాఁ జేయుచున్న దుష్కృత్యములను విశేషించి తెలిసికొనవలయునను నుద్దేశముతో నప్పటికేమియును చేయక యూరకుండెను. ఆమె పోవుచున్న మార్గమున కడ్డపడక యొదిగి యుండి సమయము వచ్చినప్పుడు డామెను పట్టుకొనవచ్చు నని యెంచుకొనియెను. కుముదినియు, తులసీదాసును, గోవిందప్రసాదును నిదివఱకే చచ్చిపోవుట వలన వారి నుద్ధరించుట కవకాశము లేకపోయినది. ఇఁక ముందు రేవతి,

మనోరమ, సుబ్బు—ఈ ముగ్గురి ప్రాణములను గాపాడుటకుఁ దగిన ప్రయత్నము చేయవలయు నని దేవేంద్రవిజయుఁడు నిశ్చయించు కొనియెను.

జమల నోటికి వచ్చిన తిట్లఁ బాడుచు నాగాఢాంధకార మున వేవేగముగ నడవయింటిని దాఁటి పోయి మేడమెట్ల నెక్కు చుండెను.

దేవేంద్రుఁడు కూడ నామె వెనుకనే పోయెను.

---

# ఐదవ భాగము

## ౧

జుమల సోపానములమీఁదుగా నామేడ రెండవయంతస్తు మీఁదికిఁ బోవుచు నోటికి వచ్చినరీతిని పాడుచుండెను.

అంతలో నాకస్మికముగ నామె పాట మాని యదరిపడి భయముతో నలువంకలను బాగుగఁ బరీక్షింపసాగెను. ఆమె హృదయమునం దప్పు డేదియో భయము కలిగెను. తన్ను మన సారఁ బ్రేమించి దనచేఁ జచ్చిన నవీనచంద్రుఁ డప్పటికిని దన్ను విడువక వెనువెంటనే తిరుగుచున్న ట్లామె భావించెను!

అంతలోనే జుమల "ఛీ! జుమలా! నీ విట్లుభయపడు చున్నావా" యనుకొనుచు మరల నుత్సాహమును ధైర్యమును దెచ్చుకొని ముందఱికిఁ బోవుచుండెను. అప్పుడుగూడఁ బాట పాడుట మానలేదు.

జుమల క్రమక్రమముగా దక్షిణపు మొగమై పోవుచుండెను. దేవేంద్రవిజయుఁడుకూడ నామె ననుసరించియే పోవుచుండెను. శచీంద్రుఁడును, శ్రీశచంద్రుఁడును, దేవేంద్రవిజయునకుఁ గొంతదూరముగ నాతనివెనుకనే పోవుచుండిరి. అట్లు తన్ను వెంబడించి రావలయు ననియే దేవేంద్రుఁడు వారికిఁ జెప్పియుండెను.

జుమల యారెండవయంతస్తులో నొకగదిచెంతకుఁబోయి ద్వారముచెంత నిలువఁబడి తోడనే చేతిరుమాలు దీసికొని ముక్కును, నోరును మూసికొనిపోవునట్లు భద్రముగా బిగించి కట్టుకొని తరువాత నాద్వారమును తెఱచెను. ఆచిన్నయింటిలో విష వాయువులు వెడలి తనలోపలఁ బ్రవేశింపకుండుటకై యామె యట్లు కట్టుకొనియెను.

ఆ రెండవయంతస్తునందలి యుత్తరభాగమంతయు నంధకార బంధురమైయుండెను. తూరుపుదిక్కునను్న వసారాలో వెలుఁగుచున్న చిన్నదీపపుకాంతులు జుమల వచ్చి నిలచియున్న ప్రదేశము నించుక ప్రకాశింపఁజేయుచుండెను. ఆకారణమువలన దేవేంద్రవిజయునకు జుమల సమీపమునందే నిలిచియుండుటకు వలనుపడలేదు. కాని, జుమల యాచిన్నగదిలోనికిఁ బోవునప్పటికిఁ దేవేంద్రుఁడు చాలదూరమునం దుండలేదు.

జుమల యాగదిలోనికిఁ బోయి యట వెలుఁగుచున్న దీప సాహాయ్యమున మైనపువత్తిని వెలిఁగించెను.

అంతలో విషవాయుపరిపూరితమైన యాగది యాకస్మికముగా దీపకాంతులవలన బ్రకాశమాన మయ్యెను.

ఆగదియందే కుముదిని శయనించియుండెను. మెట్ల కెదురుగా నేలపైఁ గుముదిని పడి యుండెను. ఆకస్మికముగా మృత్యువునకు గుఱియైపోయిన నవీనచంద్రునివలెనే కుముదినియును పడియుండెను.

“రెండు!” అని జుమల మహాహ్లాదముతోఁ బలికెను. ఆ రెండక్షరములశబ్ద మాపిశాచి వికట హాసముతోఁ జేరి మిగులఁ గర్కశమై కర్ణకఠోరమై వినఁబడియెను. జుమల తోడనే యాగది కిటికీల నన్నిటిని తెఱచివైచెను. కొంతసేపటికి వాయుప్రసారము వలన నందలివిషవాయువులు బయటికి వెడలిపోయెను. తరువాత జుమల తనముక్కునకును నోటికిని గట్టుకొని యున్న వస్త్రమును తీసివైచి కుముదిని మృతకళేబరమును బాగుగఁబరీక్షించి “కుముదినీ! నీవు మిగుల సుందరివే యగుదువు. నీసౌందర్యమంతయును నీమరణముతో ముగిసిపోయినది. ఎప్పటికైన నొక్కప్పటికి నేనుఁగూడ నీవెనువెంట వచ్చుదాననే, నీవును, నేనును, మనోరమయు, ముగ్గురము నొక్కరూపము కలవారమే యగుటకుఁ గారణమేమై యుండును? నీకును, నీయక్కయైన మనోరమ

కును రూపసాదృశ్యముండుటకుఁ గారణ మున్నది. మీ యిద్దఱను బోలి నే నుండుటయే మిగుల నాశ్చర్యము! ఇది యత్యద్భుతమైన సంఘటనము కాదా!'' యనెను.

తరువాత జుమల కొంతసేపటివఱకు నేమియును మాటలాడక యేమేమో యోచించుకొనుచుఁ బిమ్మట పార్శ్వసోపానములపై కెక్కి వేవేగముగఁ బోవుచు నంతలోనే మరల వెనుదిగి యొక్క చోట నిలువఁబడియెను. అప్పు డామెహృదయమునఁ గుముదిని మరణించినదో, లేదో యను సంశయము కలిగి రొండియందున్న కత్తిని బైకిఁ దీసి చేతఁ బట్టుకొని తత్తరముతో దిరిగి వచ్చి కత్తి మొనతో కుముదిని వక్షోభాగమునఁ బొడిచెను.

అప్పుడే దీపముకూడ నారిపోయెను. జుమల మఱి యచ్చట లేదు. ఘనీభూతమై యున్న యాయంధకారమున జుమల యెచ్చటనో మాయమై పోయెను. అప్పుడు దేవేంద్రవిజయుఁ డాయింటఁ బ్రవేశించి కుముదిని శరీరమునఁ జేయివైచి చూచెను. ఆశరీరము కట్టెవలెఁ గఠినమై మంచువలెఁ జల్లనై పడియుండెను. చాలసేపటికి ముందే ప్రాణవాయువు లాశరీరమును విడిచి యనంతవాయు సముద్రమునఁ గలిసిపోయినవి.

దేవేంద్రుఁడు చప్పుడుగాకుండ నడుగులు వైచుచు శచీంద్రుఁడు, శ్రీశచంద్రుఁడు నిలిచియున్నస్థలమునకు వేగముగాఁ బోయి శచీంద్రునితో నాలోచించి నిర్ణయింప నచ్చటఁ బ్రవేశించెను.

శచీం : మామా! సమాచార మేమి ?

దేవేం! ఇప్పటి స్థితిగతులనుబట్టి యాలోచింపఁగా ముందు సంగతు లతిదారుణములుగా నుండునట్లు తోఁచుచున్నది. మన మిప్పుడు చాలఁ గష్టస్థితియం దున్నాము. మీమేనత్తయు, మనోరమయు నిప్పు డెచ్చట నున్నారో సులభముగాఁ దెలిసికొని చూచివచ్చుట కేదియైన నాధార మున్నదా ?

శచీం : ఉన్నది.

దేవేం : పాపము ! కుముదిని చచ్చిపోయినది.

శచీం : ఎక్కడ ? ఇప్పు డామె యెట నున్నది ?

దేవేం : ఆమె శయనించు చిన్నగదియందే చచ్చిపడి యున్నది.

శచీం : ఎట్లు చచ్చిపోయినది ? ఎప్పుడు మరణించినదో తెలియ వచ్చినదా ?

దేవేం : ఆమె శయనాగారమునకుఁ బరుండుటకై పోయిన తోడనే మరణించినది. నీ విప్పు డామందిరమునకే పోవలయును. తరువాత కుముదినిమృతకళేబరము నెత్తుకొని నీమేనత్తయు, మనోరమయు నున్న మందిరమునకుఁ బోవలయును.

శచీం : మంచిది. అట్లే చేసెదను. నే నచ్చటకుఁ బోయిన తరువాత నేమి చేయవలయును ?

దేవేం : కుముదినిమృతికళేబరము నాగదియందలి శయనముపై నుంచవలయును. బాగుగఁ బరీక్షింపగాఁ బరున్నదనియే తోఁచునట్లు శయనింపఁజేయవలయును. అక్కడ దీపము వెలుఁగుచున్నయెడల నావత్తి తీసివేయవలయును. అనంతరము నీ మేనత్తను మనోరమను కుముదిని పడిపోయిన చిన్నగదిలోనికిఁ దీసికొని రావలయును. వారిరువురు నచ్చట కాచికొని యుండవలయును. బాగుగ బోధపడినదా ? ఇప్పుడే యీపని యంతయును పూర్తికావలయును. పొమ్ము ఆలస్యము చేయవలదు. జమల యిప్పుడే యీవంకకు రాఁగలదు.

శచీం : జమల యీవంకకు వచ్చి నన్నుఁ జూచినయెడల నేమిచేయను ?

దేవేం : అట్లు చూడఁజాలదు.

శచీం : ఏమి ?

దేవేం : అట్లు చూడకుండునట్లు నేను కనిపెట్టియుండె దను. ఆభారము నాది. నీవు పొమ్ము.

తూఁగుచుఁ దూలుచు జుమల యచ్చటకు వచ్చెను. ఆమె మెట్లవఱకును బోవుదాఁక దేవేంద్రుఁడు శచీంద్రుఁడు నచటను న్నస్తంభమువెనుక దాఁగికొనిరి. ఆమె ముందఱికిఁ బోయిన తరువాత దేవేంద్రుఁడు శచీంద్రునితో సీపనికిఁ బోవలయు నని సంజ్ఞ చేసెను. శచీంద్రుఁడు వెడలిపోయెను. దేవేంద్రుని యానతిప్రకారము శ్రీచంద్రుఁడుకూడ నాతని వెనువెంటనే బయలుదేరి పోయెను.

౨

జుమల మెల్లమెల్లగా సమీప శయనమందిరద్వారమునొద్దకు వచ్చి నిలువఁబడి మరలఁ దనముక్కును నోరును, వస్త్రముతోఁ గట్టి మూసికొని యాగదిలోఁ బ్రవేశించెను. లోపల బల్లపైఁ దైలదీపము క్షీణకాంతితో వెలుఁగుచుండెను. జుమల దీపము మొదట నార్పి తరువాత మైనపువత్తిని వెలిఁగించి వేవేగముగాఁ గిటికీలను తలుపులను దెఱచివైచెను.

ఆగది నేలపై రెండు మృతకళేబరములు పడియుండెను. అందొకటి తులసీదాసునిశరీరము, మఱియొకటి గోవిందప్రసాదుని శరీరము. జుమల తనయతిలోకసామర్థ్యమువలనను, నసాధారణ బుద్ధివైపద్యమువలనను నాపురుషు లిరువురు నట్లు పడిపోయి రను నానందముతో నాదేహములను గాంచుచు "ఓహోహో!" అనుచు నవ్వుచు "అందఱు నిట్లే చావవలయును. అందఱకు నిట్టి యవస్థయే కలుగుఁగాక! నామార్గమున కడ్డముగ నుండు వారల కందఱకు నిదియే గతి: ఎవ్వరును తమ్ముఁ దాము గాపాడుకొనఁజాలరు" అని.

కొంతసేపటివఱకు చనిపోయినవారలను కన్నాఱఁ జూచు చుండెను.

తరువాత జమల రేవతియు, మనోరమయు నున్నమందిర ముసకుఁ బోవఁగల దని దేవేంద్రుఁడు తెలిసికొని జమల యించుక వంగి యాశవములను బరీక్షించుచున్న సమయమునఁ బరుగుపరుగున వచ్చి యొకగదిలోఁ బ్రవేశించి తలుపు వైచికొని యెను. గడియమాత్రము వేయలేదు. తలుపు వైచినశబ్ద మామందిరమునందంతటను మాఱుమ్రోసెను. దేవేంద్రుఁ డీట్లు తలుపు మూసికొని జమలకుఁ గానఁబడకుండ నిర్విఘ్నముగా ముందువైపునుండి మెట్లు దిగి పోయెను. తలుపు మూయుట కాతనియుద్దేశ మదియే. తలుపు పడినశబ్దమును విని జమల స్తంభితయై పోయెను. ఆమె కింకను నారాయపుమైకము వదల లేదు. ఆమైకపు బలమువలననే యామె పరుగెత్తుకొనివచ్చి తలుపు తెఱచి వెలుపలకు వచ్చి " ఏ మిది! సామాన్యశబ్దము నకే భయపడిపోతిని! అధైర్యపడితిని! గాలివిసరునఁ దలుపు పడిపోయియుండు నని తోఁచుచున్నది. ఇంతమాత్రపుదానికే భయపడవలయునా ?" యనుకొనియెను.

తరువాత జమల యటునిటుఁ బరీక్షించి చూచుచుండెను. మఱియేపనియు చేయలేదు.

శచీంద్రుఁడు రేవతిని మనోరమను తప్పించి నెంభఃశించి వెంటఁ బెట్టుకొని పోవువఱకును జమల యావంకకుఁబోవకుండు నట్లు చేయు నుద్దేశముతో దేవేంద్రుఁ డాక్షణమందే యోచించి యీయుపాయమును చేసియుండెను.

దేవేంద్రుని సామాన్యకౌశలమువలననే యాతఁ డుద్దేశిం చిన కార్యము సఫల మయ్యెను. అతఁడు తలుపు మూయుట వలనఁ గలిగిన శబ్దమును వినినది మొదలుకొని నరఘాతకురా లైన యాజమల హృదయము కలఁగి దుర్బలము కా నారం భించెను.

పిమ్మట జుమల సోపానములనుండి క్రిందికి దిగివచ్చి మొదట సారాయమును దీసికొనిన మందిరమునకుఁ బోయి వెదకి చూడఁగా నచ్చటఁ దనకుఁ గావలసినవస్తువు దొరకలేదు. ఆప్రక్క నున్నమఱియొక గదిలోనికిఁ బోయెను. అచ్చట సారాయమునకు లోపము లేదు. అక్కడి సీసా తీసికొని యచ్చటనే కూరుచుండి యాసారాయమును దనివారఁ గ్రోలెను. ఆమందిరమున దీపము వెలుఁగుచుండెను. అందు విశేషముగాఁ జమురు లేకుండుటచే నాదీపకాంతులు తగ్గిపోవుచుండెను.

జుమల మొట్టమొదటఁ బ్రవేశించినగదియందే నవీన చంద్రునిమృతదేహము పడియుండెను. ఆగదియందే దేవేంద్రుఁడు ప్రవేశించి "ఈమె సాధారణురాలు కాదు. నేనొక్కఁడనే యీమెను కొలఁదికాలములో జయింపఁజాలను. ఏదే నుపాయము వలన నీపాపాత్మురాలి దుష్కార్యమున కించుక విలంబము చేయవలయును."

అని యోచించి నవీనచంద్రుని మృతశరీరము మూసిన వస్త్రమును దీసివైచి యాతనియుడుపులను విచ్చి తాను దొడిగి కొనియెను. ఆతని కంచుకమునం దున్న సులోచనములను దీసి తాను ధరించెను. తరువాతఁ దనముఖమునకు నల్లరంగు పూసికొని వికటాకారమును దాల్చెను. ఆ రూపమును చూచిన యెడల నెంతటి ధైర్యవంతున కైనను గుండె జల్లు మనక మానదు. జుమల యిదివఱకటనుండి పోవునప్పుడం దొక మేజాపై పిస్తోలు పెట్టి పోయియుండెను. అందు గుండ్లువైచిన యాఱుతోటాలు బారుచేయఁబడియుండెను. దేవేంద్రుఁడు దానిని బరీక్షించి తూటాలను దీసివైచి వట్టిమందుతూటాలను బారు చేసి యాపిస్తోలు నచ్చటనే యథారీతిగా నుంచెను.

3

జుమల సారాయమును సీసానుండి కాచపాత్రమునఁ బోసికొనుచు నదే పనిగఁ ద్రావుచుండెను. దేవేంద్రుఁడు వేషమును వేసికొనుచున్నప్పుడు శ్రీశచంద్రుఁ డా మందిరమునకు వచ్చెను. దేవేంద్రుఁ డాతనిని వెలుపలకుఁ దీసికొని వచ్చి "నేను చెప్పినట్లుగాఁ గార్యమును నెఱవేర్చితివా?" అని యడిగెను.

శ్రీశ : యథావిధిగ నెఱవేర్చితిని.

దేవేం : ఈ మృతదేహమును దీసికొనిపోయి పై యంతస్తువసారాలోఁ బడమటిమూల నుంచవలయును.

దేవేంద్రునియానతి ననుసరించి యాకార్య మప్పుడే జరగిపోయెను.

తరువాత నవీనచంద్రుఁడు పడిపోయినమందిరమున జుమల ప్రవేశించెను. దేవేంద్రవిజయుఁ డాపార్శ్వపు గదిలోఁ గాచికొని యుండెను.

"అంతయును ముగిసినది. పని యంతయును పూర్తియైనట్లే. ఇఁక మిగిలినది స్వల్పమాత్రమే. అదికూడ నిమిషములో ముగియఁగలదు. ఇప్పుడు నే నొక్కతెనే యీ ధనమునకును రత్నాలంకారములకును నధికారిణి. భాగహారులనందఱను లోకాంతరమునకుఁ బంపివైచితిని. ఫూలు సాహేబు మిగుల సామర్థ్యముకలవాఁడే యగును. నేను స్త్రీనై యుండియు నాతఁడు చేయఁ జాలని కఠినకార్యమును చేసితిని. నే నాతనికిఁ దగిన శిష్యురాలను" అని జుమల పలికెను.

అంతలో జుమలదృష్టులు నవీనచంద్రుఁడు పడిపోయిన ప్రదేశమువైపునకు మరలెను. చూడఁగా నవీనుని మృతశరీరముచ్చట నగపడ లేదు. జుమల కంపిత భగ్నకంఠస్వరముతో "ఏ మిది! ఇది యెక్కడకుఁ బోయినది?" అని యటు నిటు

జూచి "ఆతఁడు చచ్చి పడిపోయెను గాదా! బాగుగాఁ జూచి యుంటినే. ఆతఁడు స్వయముగా నిటనుండి యెట్లు లేచిపోవఁ గలఁడు? అట్లయినచో శవ మేమైపోయినది? అంతయు వింతగా నున్నది! ఆతనిశరీరమును పాడిచివేయకపోవుటయే దీనికిఁ గారణ మని తోఁచుచున్నది. కాదు, కాదు. ఆతఁడు నిశ్చయముగా మరణించినాఁడు. చచ్చుటలో సందేహ మెంత మాత్రమును లేదు." అని యూహించుకొనుచు జుమల "నవీన చంద్రా!" అని పిలిచెను.

అప్పు డామె వెనుకవైపునుండి "ఏమి ప్రియతమా!" అనుపలుకు వినఁబడియెను. జుమల చకితయై మెఱుపువలెఁ జలించుచు వెనుదిరిగి నిలువఁబడియెను.

## ఇది యేమి యాకారము!

ఆ మూర్తిని చూచిన నిమిషమునందే జుమల నోట మాట రాకుండుటచేఁ దడఁబడుచు బల్లపై పిస్తోలు నందుకొని యావ్యక్తి కెదురుగ గుఱిచేసి కాల్చెను.

కాని, యావ్యక్తి కపాయము కలుగకుండుటచే నెప్పటి యట్లు సుస్థిరభావముతో నామెయెదుట నిలువఁబడియుండెను.

పిస్తోలు ప్రేల్చినశబ్దము వినవచ్చినతోడనే యావ్యక్తి పకపకనవ్వుచు "జుమలా! వృథాశ్రమము! ఇప్పుడు నే నాయుధములకు లొంఁగుబడువాఁడను గాను" అని నవీనచంద్రుని కంఠస్వరము ననుసరించి గంభీరభావముతోఁ బలికెను. ఆవ్యక్తి పలికిన పలుకు లిహలోకసంబంధములైన వచనములవలె లేవు. ఒక్కొక్క మాట వేఱువేఱుగ విచ్చి యూది పలికిన ట్లుండెను.

జుమల యాశ్చర్యోత్ఫుల్లనేత్రములతో నాముఖము వంకఁ జూచుచు స్థిరకంఠస్వరముతో "నీ వవధ్యుఁడవా?" అని పలికెను.

"ఔను. నే నవధ్యుఁడనే. ఇప్పుడు నేను జీవములతో నున్న మనుష్యునివంటివాఁడను గాను."

"ఆహాహా! ఇది యేమి?"

"జమలా! నీ వతికఠినహృదయవై నన్నుఁ జంపివైచితివి కాదా?"

"నిన్నా? నేను చంపితినా?"

"అవును. నీవు నన్నుఁ జంపితివి. నీవు పాపాత్మురాలవు. నరఘాతినివి, నీవు—"

"అట్లు నిన్ను నేను చంపుటయే నిజమైనయెడల నీ వెట్లు మరల వచ్చితివి?"

"నే నకాలమృత్యువువాత బడుటవలన నాకుఁ బిశాచ జన్మము కలిగినది."

"పిశాచజన్మమా?"

"నీవు నమ్మకపోయినయెడల నీచేతి పిస్తోలున్నది కాదా? దానిని మఱియొకసారి, యింకొకమాఱు, మరల మరల నింకొక సారి, కావలసినయెడల వేయిపర్యాయములు నాపై గుఱి చూచి కాల్చిచూడుము. పిశాచజన్మము సత్యమైనదియో, యసత్యమైనదియో పరీక్షించి తెలిసికొనినట్లగును. శవము మఱియెట్లును మరలఁ జావ దని నిశ్చయముగాఁ దెలిసికొనుము."

జమల హృదయమునఁ దోఁచినభయమువలన బెదరుచున్నను పైకి ధైర్యమును సూచించుచు నావ్యక్తి వక్షోభాగమున కెదురుగా గుఱిపెట్టి పిస్తోలు పట్టుకొని "నీవు ప్రేతమైయున్నను, పిశాచమై యున్నను, భూతమై యున్నను, కాకపోయినను, మఱియేమైయున్నను నిన్నిప్పుడే పొడిచి చంపివైచెదను" అని బిగ్గఱగాఁ బలికెను.

ఆమూర్తి యెంతమాత్రమును కదలక సుస్థిరమై, నిశ్శబ్దమై, నిశ్చలమై చిఱునగవు నవ్వుచు నిలువఁబడియెను.

జుమల పిస్తోలు గాల్చెను. ఆ శబ్దమువలనఁ బ్రతిమందిర మును మాఱుమ్రోగెను.

అప్పు డామూర్తి "మరల నొకసారి కాల్చి చూడుము! మరల నింకొకసారి" అనియెను.

జుమల యత్యుచ్చస్వరముతో "నీవు నిర్భాగ్యుఁడవై యన్యలోకమునకుఁ బొమ్ము. నీవు పిశాచి వని నే నెంతమాత్రమును నమ్మువాఁడనుఁ గాను. నా కట్టినమ్మకము లేనే లేదు" అనియెను.

"నీవు నమ్మకపోయినను నేను పిశాచమునే."

"ఇక్కడ కెందులకు వచ్చితివి? నీ కేమిపని యున్నది?"

"శత్రుత్వమును సాధించుకొనుటకు"

"శత్రుత్వమా? ఆహా! నీవు పిశాచమవు. మనుష్యులకు నీవలన నేమియు నపాయము కలుగఁబోదు.

"నన్నుఁ జూచి నీవు భయపడుట లేదా?"

"లేదు."

"నీవు భయపడునట్లు నేను తగినపని చేయఁగల నని నీ వెఱుఁగవు."

"నీవు చేయఁజాలవు."

"నిశ్చయముగాఁ జేయఁగలను."

"నీచేత నైనచో నట్లే చేయుము."

"నే నిప్పుడే నీగుండెలలోని రక్తమును బీల్చివైచెదను."

"నారక్తమే! నీవు నాయొడలిపైఁ జేయైన వేయఁజాలవు."

"జుమలా! భద్రముగా నుండుము!"

"నీవు జాగరూకతతో నుండుము. మరల నిన్ను గుండుతోఁ గొట్టుచున్నాను. భూతమవై యున్నను, ప్రేతమవై యున్నను, మానవుఁడవే యైయున్నను, నీ వెవ్వరవై యుండినను జుమల

చేతులయం దుండి తప్పించుకొని పోఁజాలవు. చేత నైనచోఁ దప్పించుకొని బ్రతుకుము. చూతము! ఈనాఁటి నీగుండెల కెదురుగ గుఱిచూచి గుండుతోఁ గొట్టుచున్నదానను.''

౪

దేవేంద్రుఁడనేకస్థలములలో ననేకచిత్రవిచిత్రములైన సంఘటనములను చూచియుండెను. అనేకజనుల యనేకచరిత్రములను చూచియుండెను. ఆతఁడు పుట్టినదిమొదలు నేఁటివఱకు నింతటిసాహసము గల మనుష్యులను చూచియుండలేదు. ఇంతటి యతిలోకచరిత్రము గల కాంత నెన్నఁడును జూచియుండ లేదు. జుమలవలె నతిసాహసికయు, నద్భుతచరిత్రయు, ననుపమాన ధైర్యహృదయయు, నిర్భయాంతఃకరణయు నగు కాంత నెన్నఁడును చూచియుండలేదు.

జుమల కప్పుడు మృత్యుదేవత యెదురుగా నిలువఁబడి యున్నట్లు తోఁచెను. వర్ణనాతీతమైన సందేహ మామెవదన మండలమునఁ బ్రకటీకృతమగుచుండెను. కానియామెయతిధైర్యముతో నా మూర్తి కెదురుగా పిస్తోలు పట్టుకొనినిలువఁబడియెను.

తరువాతఁ దనయెదుటి యాపిశాచమున కెదురుగా గుఱి పెట్టిపిస్తోలు కాల్చెను. ఆ పెట్టు నిరర్థకమై పోయెను. ఆలక్ష్యము వ్యర్థమై పోయినంతమాత్రమున నామె యూరకుండలేదు. మరల మొగమునకు సరిగా గుఱిచూచి ''నిలువఁబడినట్లే నిలువఁబడుము. ఒకవెంట్రుకయైనఁ గదలకుండ నట్లే యుండుము. కదలవలదు. నీవు పిశాచమవే యైనడల – (ఆధ్వని భయప్రకంపితమై యున్నను నతికర్కశమై యుండెను.) నీవు నిజముగా మానవుఁడవు గాకపోయినయెడల నీసారికూడ నాప్రయత్నము వ్యర్థమై పోఁగలదు. నీవు మనుష్యుఁడవే యైయున్నయెడల నీగుండు నీకుఁ బిశాచజన్మము కలిగించుటకు సహకారియై యుండును. నిశ్చయముగాఁ జచ్చిపోయెదవు'' అనియెను.

మూ_ర్తి : ఈ దినమున మరణించిన తక్కినవారివలెనే నేనుఁగూడ మరణింతునా, జుమలా ?

జుమల హాహాయని నవ్వుచు "కాదు కాదు! వారివలెఁ గాదు. వారు మరణించునప్పుడు తాము కాలధర్మము నొందు చుంటి మనుసంగతి నెఱుంగనే యెఱుంగరు. నీమరణమును బ్రత్య క్షముగాఁ జూడఁగలవు. నీచావు నా పిస్తోలుకొన నున్నది. నీవు దానిని చూచుచునే యున్నావు" అనియెను.

మూ_ర్తి : జుమలా! అయినయెడల నీవు కొంచెమునే పాఁగవలయును.

జుమ : ఏల! కారణమేమి ?

మూ_ర్తి : నీ పీసారి గుఱిబాగుగాఁ జూచుకొని మఱి కాల్పవలయునని నాయుద్దేము.

జుమ : ఆవిషయమై నీవు బోధింప నక్కఱ లేదు.

మూ_ర్తి : సరియే, కొట్టుము. ఇఁక నీగుఱి వ్యర్థము కాకుండునట్లు గుండున కెదురుగా వక్షముంచి నేనే నిలువఁబడి యెదను.

జుమ : అది యేమి ? నాయందింత దయయేల కలిగినది? గుండుదెబ్బ యనిన నీకంత యానందమా యేమి ?

మూ_ర్తి : అవును. జుమలా! నీవు నాయంతరాత్మను విషముచేఁ గాల్చివైచితివి. ఈ గుండు దెబ్బవలనం గలిగినయా తననుగూడ ననుభవింప నిమ్ము. జుమలా! నీవుకూడ నొక్క ప్పుడు చావకపోవు. అప్పుడు నీ యాత్మకూడ నింతటియాతన ననుభవించుఁగాక !

జుమ : (నవ్వుచు) నన్ను భయపెట్టుదువా ?

మూ_ర్తి : నాకు నిన్ను భయపెట్టునంతటి సామర్థ్యము లేదు.

జుమ : ఇప్పటికిని నీవు ప్రేతాత్మ వనియే చెప్పెదవా ?

మూర్తి : ఔను.

జుమ : ఈసారి నాగుండుదెబ్బవలన నీకెట్టి యపాయమును కలుగకున్నయెడల నీ వట్టివాఁడవని నేను నమ్మెదను.

మూర్తి : జుమలా ! అయినచో నీవు నన్నుఁ గొట్టుటకు సిద్ధముగా నున్నావా ?

జుమ : సిద్ధముగ నే యున్నాను.

మూర్తి : నేను డాక్టరు నవీన చంద్రుఁడ నే యని నీకు నమ్మకమున్నదా ?

జుమ : నేను నమ్మజాలను.

మూర్తి : నే నెవ్వడనై యుందునని నీయభిప్రాయము ?

జుమ : నాకుఁ దెలియదు.

మూర్తి : జుమలా! ఇప్పు డిక్కడ కీవిధముగా రాఁదగినవా రెవ్వరు? నీ వింతవఱకును గావించిన దుష్కృత్యముల నన్నిటిని బాగుగఁ గనుపెట్టగలవా రెవ్వరు ? నీవు కుముదిని మృత కళేబరమును తెప్పపాల్పకచూచి నిర్జీవమైయున్న యా దేహమున నీకరవాలముతో గ్రుచ్చుచుండ నీకుఁ దెలియకుండునట్లు నీయొద్ద నే యుండి చూడఁగలవా రెవ్వరు ? నీవు తులసీదాసుని దేహమును, గోవిందప్రసాదుని దేహమును వంగి చూచుచు నవ్వుచుండఁగా నీయెదుట నే నిలువఁబడి చూడఁగల వారెవ్వరు ? ఇట్లంతయును చూచినవా రెవ్వరో నీ వెఱుంగుదువా జుమలా ? నేను ! నేను మరణించుటవలన వలసినచోటి కెల్లఁ బోవఁగలిగి యుంటిని. నేను పోవఁజాలని ప్రదేశమే లేదు. జుమలా ! ఇప్పుడు నీకు నమ్మకము కలిగినదా ?

జుమ : లేదు.

మూర్తి : అయినచో నే నెవ్వఁడను ?

జుమ : ఈ ప్రపంచమునందు నేనొక్కనికిమాత్రమే భయపడుచుంటిని.

మూర్తి : ఆతఁడెవ్వరు ?

జుమ : దేవేంద్ర విజయమిత్రుఁడు.

భూతవేషధారి యగు దేవేంద్రవిజయమిత్రుఁడు నవ్వసాగెను. అట్లు నవ్వుచు "అయినయెడల నేనే యాతఁడనని నమ్మియుంటివా?" అని యడిగెను.

జుమ : నీ వాతఁడవే యైనను కావచ్చును.

మూర్తి : అవును. నీ వీదినమున నాతనికిఁ బ్రతిపక్షమునందుండి పనిచేయుచుండుటవలన నిప్పుడాతఁడే నేనై యుందునని యనుకొను చుంటివి కాదా?

జుమ : కాదు.

మూర్తి : దేవేంద్ర విజయుఁడును గాఁడు, పిశాచమును గాదు. మంచిది. నీపిస్తోలు కాల్చుము. బాగుగా గుఱిచూచుకొనుము. తొందరపడవలదు. చేతుల నెంతమాత్రమును కదలింపవలదు. నా మొగమునకు గుఱిచూచి కొట్టవలయునని కదా నీ యుద్దేశము ? మొట్టమొదట సరిగాఁ జూచుకొనుము! నేను మూడంకెలను లెక్కించెదను. "మూఁడు" అని పలికినప్పుడు కొట్టవలయును. ధైర్యముతోఁ బనిచేసినయెడల నిష్ఫలము కాజాలదు.

"ఒకటి—"

జుమల పిస్తోలు దేవేంద్రుని మొగమున కెదురుగా గుఱిచూచి పట్టుకొనియెను.

"రెండు—"

జుమల భ్రూయుగళమునుండి ప్రసరించుచున్న దృష్టితో లక్ష్యమును సరిచేసికొని నిలువఁబడియెను. ఆమెలక్ష్యము సరిగనే యున్నదని దేవేంద్రుఁడు తెలిసికొనియెను.

"మూడు—"

తత్క్షణమే పిస్తోలు "ఢామ్" అని ధ్వని చేసెను.

అప్పుడుగూడ జమలయెదుట నామూర్తియే నిలుచఁబడి యున్నది! ఆమూర్తి యెప్పటివలెనే నిశ్చలముగా నున్నది! ఎప్పటివలెనే ఱెప్ప వాల్పకుండ నిశ్చలదృష్టులతోఁ జూచుచుండెను. ఎప్పటివలెనే నవ్వుచు నామెకృత్యములం గూర్చి పరిహసించుచుండెను.

జమల యత్యాశ్చర్యద్యోతకంబులగు చూపులతోఁ జాల సేపటివఱకు నామూర్తివంకనే చూచుచుండెను. అప్పుడామెవదన మండలము వాఁడిపోయెను.

అయినను నిశ్శబ్దముగా నుండెను. భయసూచకంబులగు పలుకులేవియు నామెనోటినుండి వెడలలేదు. అంతలో నామె ప్రాణములు పోయిన దానివలె నేలపైఁ బడి మూర్ఛిల్లెను.

దేవేంద్రుఁ డప్పుడీపాపాత్మురాలి, కిప్పటినుండియే శిక్షకుఁ బ్రారంభ మైనదనియు, ఇంతలో మఱియొక కార్యము చేయవలయు ననియు యోచించుకొని యామందిరమునుండి వెలుపలకు వచ్చెను. అప్పటికి శ్రీశచంద్రుఁడు ద్వారమునొద్ద నిలువఁబడి యుండెను. ఆతనిని దనతోఁగూడఁ దీసికొని దేవేంద్ర విజయుఁడు నవీనుని మృతకళేబర మున్నచోటికిఁ బోయి తాను ధరించుకొన్న యాతనియుడుపులను దీసివైచి మునుపటివలెనే యాశవమునకు ధరింపఁజేసి తాను మఱియొక సామాన్య వేషమును దాల్చి పిమ్మట నవీనచంద్రుని మృతదేహమును దీసికొని వచ్చి మునుపటిస్థలమునందే యుంచి యెప్పటివలెనే కిటికీతెరను దానిపైఁ గప్పివైచెను.

తరువాత దేవేంద్రవిజయుఁ డొకచో దాఁగియుండెను,

౨౩

కొంతసేపటికి జుమల మూర్ఛనుండి మేలుకొనియెను. ఆహాపా త్ర్కురాలు కన్నుదెఱచి యాశ్చర్యముతో నలువంకలనుచూచెను. అప్పుడు నవీనచంద్రుని శవదేహముపై మూయఁబడినవస్త్ర మామెకంటఁ బడియెను. దానిని జూచి యామె యదరిపడుటచే సర్వాంగములును వడఁకుచుండెను. అయినను సాహసించి ధైర్యము తెచ్చుకొని లేచి వెంటనే యాశవముపై వస్త్రమును దీసిపాఱవైచెను.

పిమ్మట జుమల యత్యాశ్చర్యముతో "సరి సరి! నేనేమి పిచ్చిదాననై పోయితినా? నాబుద్ధియును, జ్ఞానమును లోపములై పోయెనా యేమి?" యనుకొనెను.

జుమల మృతదేహమును బాగుగఁ బరీక్షించి చూచెను. చేతివ్రేళ్ళతో స్పృశించి యెత్తిచూచి యంతలో నదరిపడి రెండడుగలు వెనుకకు జరిగెను. ఆ దేహము మంచుగడ్డవలెఁ జల్లగా నుండెను. అప్పుడామె గట్టిగాఁ గేకలువైచుచు "చచ్చిపోయి నాఁడు, పూర్తిగాఁ జచ్చిపోయినాఁడు! అయినచో నిప్పుడు రెండు గడియలకుముం దీతఁడు నాయెదుట నిలువబడి యుండుట చూచితినే!" అని పలుకుచు నించుక ధ్వని తగ్గించి "నిజముగా నీతఁడు భూతమే యైయుండునా?" అని యనుకొనియెను. భయముతో నలుదిక్కులను జూచుచు "నన్నుఁ బట్టుకొంటివా?" అనియెను. తోడనే యాభయము వదలి గట్టిగా "ఏమిది! శరీరము నందించుక గాయమైనను లేదే! నేను జీవించియున్న మనుజులలో నొక్కనికిమాత్రము కొంచెముగా భయపడుచుండెదను. ఈతఁడో నిక్కముగఁ జచ్చిపోయినాఁడు. చచ్చినవానికి నేనెంత మాత్రమును భయపడుదానను గాను" అని యనుకొనియెను.

తరువాత జుమల పొట్ట యుబ్బిపోవునట్లు. గట్టిగా నవ్వసాగెను. ఆనగ వామందిరమునం దంతటను ప్రతిధ్వనించెను.

ఆమె తనలోఁదానే "ఇప్పుడే యిటనుండి తప్పించుకొని పోవుట మంచిది. అందఱి పనియును పూర్తియైనట్లే ఆ ముసల్మాను యువకుఁడగు కరీమును బట్టుకొనినయెడలఁ జాల బాగుగా నుండును. పోనిమ్ము! అదృష్టవశమున బ్రదుకిపోయినాఁడు," అనుకొనియెను.

జుమల దృష్టులు వాకిలివైపునకుఁ బ్రసరించెను. చూడగా నామె యెవ్వరికొఱకు కాలోచించుచుండెనో యాతఁడే యట నిలువఁబడియుండెను. అతఁడు కరీమ్.

అప్పుడు జుమల పిశాచమును గొట్టుటయందు వ్యర్థమైయిన పిస్తోలు తీసికొని కరీమునకు గుఱిపెట్టి కాల్చెను. ఆ గుఱి కూడ మొదటివలెనే వ్యర్థమైపోయెను. జుమల దానిని నేలపై విసరి పాఱవైచి తులసీదాసుని గృహమునం దేకరవాలముతో దేవేంద్ర విజయుని గొట్టియుండెనో యా కరవాలమును దక్షిణ హస్తమున బలముగా సంధించి యతి జాగరూకతతో ముందఱికి వచ్చెను.

అప్పుడును కరీము స్థిరభావముతో నచ్చటనే నిలిచియుండెను. ఆతని భావభంగులంబట్టి యెప్పు డాతనికి భయమున్నట్లే తోఁచలేదు.

జుమల యాతనివంకఁ జూచి కొంచెము ముందఱికి జరగి యతి కోపముతో "నీ వెక్కడనుండి వచ్చితివి?" అని యడిగెను.

శచీం : గుజ్జపు లాయమునుండి—

జుమ : ఇక్కడ కెట్లు వచ్చితివి?

శచీం : అవ్వలివైపు సోపానములపై కెక్కి యివ్వలివైపు సోపానములనుండి దిగివచ్చితిని.

జుమ : ఎప్పుడు?

శచీం : నీ మారణ వ్రతారంభమునందు—

జుమ : ఓహో! నీవు ముసల్మాను జాతివాఁడవు కావా? నీ మాటవలన నట్లే యగపడుచున్నది.

శచీం : కాదు.

జుమ : నీవు పత్తేదారుఁడవా!

శచీం : అవును.

జుమ : దేవేంద్ర విజయుఁడవా?

శచీం : కాను.

జుమ : మూర్ఖుఁడా! నీవు మరణించిన జనులసంఖ్య నభివృద్ధి చేయుటకై వచ్చి యుంటివా? నీవు నన్నెఱుఁగుదువా?

శచీం : ఎఱుఁగుదును. నీ విటనుండి ప్రాణములతోఁ దప్పించుకొని పోఁజాలవు.

జుమ : (నవ్వుచు) నీ కంతకోరికయే యున్నయెడల నన్నేల పొడిచివేయ కూరకుంటివి? నీకు మొదటినుండియు నిట్టి యభ్యాస మున్నది కాదా?

శచీం : ఉన్నది. ప్రకృతమున నేను కొంచెముగ యోచించుకొనవలసియున్నది.

జుమ : ఏ విషయమునుగూర్చి యోచించుచుంటివి?

శచీం : ఆ కరవాలము తక్క నీయొద్ద మఱియెట్టి యాయుధమును లేదు కాదా?

జుమ : అందువలననా నీవింత నిర్భయముగా మాటలాడుచున్నావు? సమయము దొరకినప్పుడు దేవేంద్రా! నీవు నాచేతులలోఁ బ్రాణములను విడువఁగలవు. నే నిచ్చటఁ గూరుచున్న దానను కూరుచున్న యట్లే యడుగైన ముందఱికి జరుపకుండ నిన్ను యమసదనమునకుఁ బంపఁగలను.

శచీం : నేను దేవేంద్రవిజయుఁడను కానని నీకు మొట్టమొదటనే చెప్పియుంటిని కాదా?

జుమ : వహా వా!

"దేవేంద్ర విజయుఁడను నేను" అని పలుకుచు నప్పుడు దేవేంద్రుఁడు స్వయముగా ముందఱికి వచ్చి నిలువఁబడియెను.

జుమల చకితయై యాశ్చర్యముతో "హా!" యని యఱచి మరల నంతలో మనసు కుదుటపఱచుకొని "మంచిది! ఇంతమాత్రమున నష్టమేమున్నది? ఇప్పుడైన దేమున్నది?" అనియెను.

దేవేం : నీ విప్పుడు నాకు బందివైతివి.

జుమ : నేనా? ఎవరన్నారు?

దేవేం : నీవే! నేనే యనుచున్నాను.

జుమ : కాదు కాదు! దేవేంద్రా! నీ వసత్యము పలుకుచున్నావు. ఎప్పుడు నట్టిపని కాఁజాలదు.

దేవేం : నీవీ దినమున నా చేతులలోనుండి తప్పించుకొని పాఱిపోఁజాలవు.

జుమ : తప్పించుకొని పోఁజాలనని నీతోఁ జెప్పినవా రెవ్వరు? పోయెదను. తప్పక యట్లే పోవఁగలను.

దేవేం : జుమలా! ఇదివఱ కేమైన నయ్యేనుగాని యీ రాత్రి మాత్ర మట్లు కాఁజాలదు.

జుమ : ఈ రాత్రి ఇప్పుడే పాఱిపోయెదను. దేవేంద్రా! జుమలను చెఱసాలయం దుంపఁజాలిన పత్తేదారుఁ డెవ్వఁడు నింతవఱకు పుట్టియుండలేదు. జుమల నుంపఁదగిన చెఱసాల యింతవఱ కెన్నఁడును గట్టియుండ లేదు.

దేవేం : జుమలా! నీవు మా సేవకుఁడగు సుబ్బు నేమి చేసితివి?

జుమ : సుబ్బెవ్వఁడు?

దేవేం : నీ వాతనిని బాగుగ నెఱుంగుదువు.

జుమ : నాకు జ్ఞాపకశక్తి కొంచెము తగ్గిపోయినది.

దేవేం : ఆతని నీవు చంపివైచితివా?

జుమ : ఆ మాటకు నేను ప్రత్యుత్తర మిచ్చినయెడల నీవు నమ్ముదువా ?

దేవేం : నమ్మెదను.

జుమ : ఆతఁడు చావలేదు.

దేవేం : ఎక్కడ నున్నాఁడు ?

జుమ : ఇక్కడ నున్నాఁడా ? నే నాతని విడుదల చేయక పోయినయెడల నీసరిఁ కాతఁ డున్నచోటనే పడి తిండిలేక చచ్చిపోయియే యుండును.

దేవేం : అట్లయినచో నాతని నేను వెదకి కనుఁగొందును.

జుమ : నీవు వెదకఁజాలవు. నిశ్చయము.

దేవేం : నే నెటులైనఁ బ్రయత్నించి కనుపెట్టెదను.

జుమ : నీ ప్రయత్న మంతయును వ్యర్థమై పోఁగలదు.

దేవేం : దేవేంద్రుఁ డతి ప్రయత్నముతోఁ జేపట్టిన కార్య మెన్నఁడును వ్యర్థము కాలేదు.

జుమ : నీ వింత గొప్పవాఁడవై యుండియు నీ భార్యనే మఱచిపోతివి. ఆమె విషయమై యొక్క మాటయైన నడుగలేదేమి?

దేవేం : ఆవశ్యకము లేదు.

జుమ : ఆమె నీకు దొరకినదా ?

దేవేం : ఔను. దొరకినది.

జుమ : వెఱ్ఱివాఁడా ! అయినచో నీ వంతయును బాగుగనే విచారణచేసి తెలిసికొంటివే !

దేవేం : నే నేవిషయమునుగూర్చి బాగుగ విచారించి తెలిసికొనుట లేదు ?

జుమ : నీ భార్య చచ్చిపోయినది.

దేవేం : జుమలా ! ఇది నీ తప్పుగాదు. నీ సారాయమైకపు తప్పే.

జుమ : కాదు కాదు ! నేను నిశ్చయముగా ముమ్మాటికిని చెప్పుచున్నాను. ఆమె చచ్చిపోయినది.

దేవేం : కాదు కాదు. నేను నిశ్చయముగా ముమ్మాటికిని చెప్పుచున్నాను. ఆమె బ్రతికియే యున్నది.

జుమ : నీ వసత్యము చెప్పుచున్నావు.

దేవేంద్రుఁ డామాటకుఁ బ్రత్యుత్తరము చెప్పకయే మఱియొక దిక్కునకు ముఖము త్రిప్పుకొని "రేవతీ!" అని పిలిచెను.

తోడనే రేవతియు వచ్చి యా వాఁకిలిముంగిట నిలువఁబడియెను. చూచినతోడనే జుమల గుండె యదరిపోయెను. ఆమె యప్పుడు రెండడుగులు వెనుకకు జరిగి నిలువఁబడియెను.

జుమల నోటినుండి మాట వెడలుట లేదు. కొంతసేపైన తరువాతఁ దెలివి తెచ్చుకొని "దేవేంద్ర విజయా! నీ శక్తి యత్యాశ్చర్యకరమైనది. నీవు చచ్చిపోయినవారిని మరల బ్రతికించు సంజీవన మంత్రమును నేర్చికొనియుంటివి!" అనియెను.

దేవేం : ఔను. ఈ సందర్భమునం దట్లే.

జుమల నవీనచంద్రుని మృతదేహమును చూపించి "యీతఁ డింకను బ్రదికియున్నాఁడా ?" అని యడిగెను.

దేవేం : లేదు. చచ్చిపోయినాఁడు.

జుమ : ఆఁ! బ్రతికియే యున్నాఁడు. నీ మాట వినుట వలన నా మనసునకుఁ గొంచెము సమాధానము కలిగినది కాని నీభార్య బ్రదికియుండుట నిజమే యని తోఁచుచున్నది. అయినచో మనోరమయో ? ఆమెకూడ బ్రదికియే యున్నదా ?

దేవేం : మంచిది. ఆమె పేరు మనోరమయే యైనట్లు నీ వంగీకరించితివి కాదా ?

జుమ : అంగీకరింపక పోవుటవలనఁ బ్రయోజన మేమి యున్నది ?

దేవేం : ప్రయోజన మేమియును లేదు.

జుమ : ఆమెకూడ బ్రదికియున్నదా ?

దేవేం : బ్రదికియే యున్నది.

జుమ : కుముదినియో ?

దేవేం : చచ్చిపోయినది.

జుమ : గోవిందప్రసాద సేనుఁడును, తులసీదాసును మరణించియే యుందురా ?

దేవేం : వారిరువురును మరణించిరి.

జుమ : ఎవ్వరెవ్వరు బ్రదికియుండుట నీ కిష్టమో వారి నందఱను నీవు బ్రదికించితివి. మిగిలినవారు బ్రదికియుండుట నీ కిష్టము లేదు.

దేవేంద్రుఁడు నిరుత్తరుఁడై నిలువబడియెను.

జుమ : వారి నందఱను చంపినదానను నేనే యని నీవు నాపై నపరాధమును మోపెదవు కాదా ?

దేవేం : ఔను.

జుమ : ఎట్లు ?

దేవేం: నా కన్నులతోఁ జూచియుంటిని. (నవీనుని మృతదేహమును చూపించుచు) ఈతనిని నీవు చంపివైచితివి. నీవు వకీలు తులసీదాసును, వైద్యుఁడు గోవిందప్రసాదసేనుని గూడఁ జంపితివి. ఆ సంగతులను ఋజువుపఱచుటకు నా యొద్ద నాధారము లున్నవి.

జుమ : దేవేంద్రవిజయా ! నీవు కేవలము మూర్ఖునివలె నగపడుచున్నావు.

దేవేం : ఏల ?

జుమ : ఆధారములనఁగా నెట్టివి చెప్పుము.

దేవేం : నా రెండుకన్నులును – నా కన్నులు రెండును పిశాచస్వభావముగల నీ దుష్కృత్యముల నన్నిటిని చూచియున్నవి.

జుమ : నీ సాక్ష్యము నంగీకరించుదానను గాను. అప్పు డేమి చేసెదవు?

దేవేం : నేను ప్రమాణముచేసి చెప్పినప్పుడు నీ వంగీకరింపక పోయినంతమాత్రమునఁ బ్రయోజనము లేదు.

జుమ : నిజముగాఁ నెంతమాత్రమును బ్రయోజనము లేనే లేదా ?

దేవేం : నిశ్చయముగాఁ బ్రయోజనము లేదు. ముమ్మాటికిని లేదు.

జుమ : నీ ప్రత్యక్షప్రమాణము పనికిరాదు. హత్య చేసిన గుఱుతు లేమియును లేవుగదా ? కుముదిని శరీరమునందుఁ గాక మిగిలిన యెవ్వరి దేహములం దైనను నెట్టిదెబ్బలగుఱుతులు నగపడుట లేదు. కాని యింతమంది యొక్కస్థలముననే యొక్కరాత్రియందే మరణించుట మాత్ర మనుమానమునకుఁ గారణముగా నుండును. అప్పు డది యాకస్మిక మరణమనిగాని, యేదే నొక రోగమువలనఁ గలిగిన మరణమనిగాని నిర్ధారణమగును.

దేవేం : ఏమి రోగము ?

జుమ : మూర్ఛరోగము !

దేవేం : ఔను. ఆ రోగము నీకుఁ జాలదినములనుండి సాహాయ్యము చేయుచున్నదిగాదా ? చూతము !

౬

జుమల యా చిన్న గదిలో నెంతవఱకు ముందుగా జరగి వచ్చియుండెనో యక్కడనే కదలకుండ నిలువఁబడి యుండెను. ఇన్ని మాటలాడుచున్నను నొక్క యడుగైన వెనుకకు జరుగలేదు, ముందఱికిని జరుగలేదు.

ఆమె భావచేష్టితములయందు భయవ్యంజకమైనచిహ్నమొక్కటియైనను గానవచ్చుట లేదు. ఎట్ట యెదుటఁ బ్రతిపక్షు

లగు నిరుపుర పురుషులు నిలువఁబడియున్న నామెకు లేశమైనను భయము కలుగలేదు; నిర్భయముగా నెప్పటివలెనే నిలిచియుండెను.

దేవేంద్రుఁడు తనలో నామె తుట్టతుదవఱకును తనకుఁ బ్రతికూలముగానుండి యంత్యకాలమున విషపానమువలనఁ బ్రాణములను విడువగల దని భావించుకొనియుండెదను. కాని జుమల యిట్లు నిర్భయముగా నిలువఁబడియుండుటకు మఱియొక రహస్య కారణ ముండితీరవలయును. అది దేవేంద్రునకును దెలియలేదు. అప్పుడు జుమల నవ్వుచు "మనము వ్యర్థసంభాషణలవలన వృథా కాలక్షేపము చేసితిమి" అని పలికెను.

దేవేం : ఔను. నిజమే.

జుమ : దేవేంద్రా! నీవు నన్ను బందిగాఁ బట్టుకొనుటకు సంసిద్ధుఁడవై యుంటివి కాదా?

దేవేం : ఔను. అందులకు దగినసమయము కూడ దొరకినది. ఇఁకఁ దప్పదు.

జుమ : అయినచో నీవు నాచేతులకు సంకెలలను దగిలెంచెదవా?

దేవేం : నీ చేతులకు బలమైన యుక్కుగొలుసుల నుపాయనముగ నీయవలయు నని మనసుపడుచున్నాను.

జుమ : ఉక్కుగొలుసులా? చేతిగొలుసులు! సుందరులకు చేతిగొలుసులా?

దేవేం : సుందరిచేతులకుఁ గాదు— పిశాచము చేతులకు!

జుమ : మంచిది. నీ చేతనైనయెడల నా చేతులకు గొలుసులను దొడుగుము.

ఆమె యామాట పూరించులోపలనే యాశ్చర్యకరమైన వ్యాపారము జరగిపోయెను. జుమల యచ్చటలేదు. ఆమె మాట

లాడుచునే యంతర్ధానమై పోయెను. కన్నుమూసి తెఱచునంతలో నామె శరీరము పృథ్వీభూతమున లీనమైపోయెను.

౭

జూమల యంతర్ధానమై పోవుచున్న సమయమున జర జర యని శబ్దమయ్యెను. ఆ శబ్దము దేవేంద్రుని చెవికి స్పష్టముగా వినఁబడియెను. అతఁ డానిమిషమునందే జూమల నిలిచియున్న స్థలమునకు వేగముగా వచ్చి కూరుచుండి పరీక్షింపఁగా నచ్చట గుప్తమైన చౌకపుగట్టడ ముండెను. దాని పార్శ్వమున యినుపకీలు కాన వచ్చుచుండెను. దానిని రెండు మూఁడు సారులు త్రిప్పి చేతితో నొత్తి నతోఁడనే ద్వారము తెఱవబడియెను. లోపల గాఢాంధ కారముగా నుండెను. దిగుటకు సోపానములు లేవు.

దేవేంద్రుఁడు శ్రీశచంద్రుని పిలిచి "ఖిదరపురమునందలి మోహల్లా సమీపముననున్న నదీతీరమునకు వేవేగముగఁబోయి యక్కడ నా పిశాచి నీకంటఁబడినయెడల నామె యొద్ద నున్న యాయుధము నడిగియో, బలవంతముగనో తీసికొనుము. ఇప్పు డామె యొద్దనున్నది కరవాలము మాత్రయే. మఱియే యాయుధ మును లేదు. నీమాట విని యామె నీకాయుధము నీయకపోయిన యెడల తోడనే యామెను గుండుతోఁ గాల్చివేయుము. కత్తి నిచ్చివేసినయెడల నే నచ్చటకు వచ్చువఱకు నామె నక్కడ నిలిపి కాచుకొని యుండుము" అని చెప్పెను.

శ్రీశ : చిత్తము.

దేవేం : పరుగెత్తుము. నిలువవలదు.

శ్రీశచంద్రుఁడు వెంటనే పరుగెత్తుకొని వెడలిపోయెను.

దేవేం : శచీంద్రా !

శచీం : ఇక్కడనే యున్నాను.

దేవేం : నీ విప్పుడే నీమేనత్తయు, మనోరమయు నున్న చోటికిఁ బొమ్ము. నేను మరల వచ్చువఱకు నెక్కడకును పోవలదు.

ఇంతవఱకుఁ జెప్పి మఱియేమియును యోచింపక పిచ్చి వానివలె దేవేంద్రవిజయుఁ డాసారంగమున దుమికి జుమలవలెనే యంతర్ధానుఁడై పోయెను.

౧

దేవేంద్రుఁ డెనిమిదిమూరల లోతు గల పల్లమున బడియెను. కాని కాలికి దెబ్బ తగులలేదు. మెత్తని పఱుపుపైఁ బడియెను.

అప్పుడాతఁడు తాను పాతాళమునఁ బ్రవేశించితినని భావించు కొనియెను. అది యంధకారమయమై యుండెను. నలుదిక్కుల గాఢాంధకారము. తనశరీరమే తన కగపడుటలేదు. దుర్భేద్యమై ఘనీభూతమై యున్న యా యంధకారమునందు దేవేంద్రవిజయుఁడు తన కంచుకమునందలి చేతిలాంతరు దీసి వెలిగించి చూడఁగా వెలుపలికిఁబోవుటకు మార్గము కానబడలేదు. గవాక్షమైన లేదు. నీరంధ్రమైన మట్టిగోడ మాత్రమె.

జుమల యచట నగపడలేదు. అయినచో నామె ఎచ్చటకుఁ బోయియుండును? అటనుండి వెడలిపోయియే యున్న యెడల నావశ్యముగా నామె యా యంధకూపమునుండి వెడలి పోవుటకు మార్గ ముండి తీరవలయును.

దేవేంద్రుఁ డాగోతిలో నడుమ నిలుఁవబడి లాంతరు వెలుతురును నలువంకలకును బ్రసరింపఁ జేసి చూచెను. ద్వారములు గాని గవాక్షములుగాని ఏమియును లేవు. ఆగోడలో రంధ్రమైనను లేదు.

ఈ విధముగా కొంతసేపు గడచిపోయెను. మూలఁ జిన్నకఱ్ఱ పెట్టెపడియున్నట్లు కానవచ్చెను. ఆతఁడు దాని నెటులైనఁ దెఱవ వలయునని ప్రయత్నించిచూచెను. కాని, కదలలేదు. అది మిగుల

భారముగా నుండెను. ద్వారమున్నయెడల నందే యుండవలయు నని యూహించి దేవేంద్రుఁ డా పెట్టెను నాలుగైదు సారులు బలముగాఁ దన కాలితోఁ దన్నెను. ఆ పెట్టెమూత వీడిపోయెను. కాలి యందేమియును లేదు. అం దొకఁడు మాత్రము కూరు చుండుట కనుకూలముగా నుండెను. దేవేంద్రుఁడు దానిలోపలకు లాంతరు వెలుతురును ప్రసరింపఁజేసి చూడఁగా దానికి వృక్షశాఖ చేర్పఁబడియున్నట్లు పొడగట్టెను. దాని ననుసరించి యాతఁడు క్రిందికి దిగిపోయి చూడఁగా నక్షత్రములు కనవచ్చెను. ఆ రాత్రియు గంభీరమై నిశ్శబ్దమై యుండెను.

దారి దొరకినది. దేవేంద్రుడు వేవేగముగ నా మార్గము ను బట్టి పోయెను. కొలఁదిసేపటిలోనే యా మందిరమునకు ముం దర నున్న యంగణమునొద్దకు వచ్చెను. అక్కడ నొక నిమిషము మాత్రము నిలువఁబడి యోచించి వెంటనే గంగానదీతీరమునకుఁ బరుగెత్తుకొని పోయెను.

శ్రీశచంద్రుఁడు తనయొద్దనుండి సెలవుగైకొని పోయి యేదేనొక యుపాయమువలన నాథాకినిని ఆజుమల నొకటిరెండు గడియలవఱకు నిర్బంధించి యుంచినయెడలఁ దాను సరియైన సమయమునకుఁ బోయి చేరఁగల నను నుద్దేశముతో దేవేం ద్రుఁడు గంగానది కభిముఖుఁడై యూపిరి విడువకుండఁ బరు గెత్తుకొని పోయెను.

౩

దేవేంద్రుఁడు ఖిదరపురమునకు వచ్చువఱకు నాకసము మబ్బు గ్రమ్మియుండెను. తరువాత మేఘ మంతయును విడిపోయి యాకాశము నిర్మలమై యుండెను. నక్షత్రముల కాంతుల వలనఁ బదార్థము లన్నియు నిస్పష్టముగఁ గానవచ్చుచుండెను. శ్యామలశరీర యగునా యామి నీరమణీమణి యాకారము మనో జ్ఞమై కానవచ్చుచుండెను. పశ్చిమాకాశ ప్రాంతమున మిగుల

దూరమున నస్తంగత యగుచున్న కృష్ణపక్షసప్తమీ చంద్రరేఖ క్రమముగా మునింగిపోవుచుండెను.

అప్పటికి దేవేంద్రవిజయుఁడు గంగానదీతీర ఘట్టమునకు వచ్చిచేరెను. అచ్చట నావ లేవియు నగపడలేదు. కొంచెదిదూర మున నీటిలో నేదియో శబ్ద మగుచున్నట్లు వినవచ్చెను.

దేవేంద్రుఁడు చెవి యొగ్గి యాలకింపఁగా నాశబ్దము స్పష్ట ముగా వినఁబడుచుండుటచే నావంక కతివేగముగాఁ బోయెను. అట్లు పోవుచుండఁగనే "అయ్యో! ఆవచ్చువా రెవ్వరు? నేను చచ్చిపోవుచున్నాను. వేగముగా రండు!" అనుపలుకు లాతనికి వినవచ్చెను.

అది శ్రీశచంద్రుని కంఠస్వరమువలె నుండెను. వెంటనే యెవ్వరో గట్టిగా నవ్వుచున్నట్లు వినఁబడియెను. ఆకంఠస్వరము కూడ దేవేంద్రునకుఁ బూర్వపరిచిత మైనదే. అది జుమల యతి భీషణమైన వికటహాసము! తరంగరూపమున వినవచ్చుచుండెను.

దేవేంద్రవిజయుఁడు బాగుగ గుఱుతుపట్టెను. "ఆ జుమల ఆతనిని గట్టిగఁ బట్టుకొని యుండనోపును! ఆతనికి బదులుగా శచీంద్రుని బంపకపోయితిని గదా!" యనుకొనియెను.

దేవేంద్రుఁ డూపిరి విడువకుండఁ బరుగెత్తుకొనిపోయెను. కొంతదూరము పోవునప్పటికి నావ యగపడియెను. అది తీర మునకునూఱుమూరలదూరమునుండి జలములను భేదించుకొనుచుఁ బోవుచుండెను.

దేవేంద్రుఁ డప్పుడు గంభీరభావముతో "ఇక జాలును! ముందటికిఁ బోవలదు. వెనుకకుఁ దిరిగిరమ్ము! అట్లు రానియెడల నీ తుపాకితోఁ గాల్చి చంపివైచెదను" అని యుచ్చైస్స్వరమునఁ బలికెను.

దేవేంద్రుని కేకలకుఁ బ్రత్యుత్తరముగా గట్టిగా నవ్విన నవ్వుమాత్రము వినవచ్చెను. అప్పు డాతఁడు పిస్తోలు తీసి జుమల

కెదురుగా గుఱిచూచి పట్టుకొనియెను.

జుమల యెల్ల కార్యములయందును దేవేంద్రుని పిస్తోలు కడ్డముగా నుంచిన డాలు మిగుల చమత్కార మైనది. ఆమె శ్రీశచంద్రుని కాలుసేతులను గట్టిగాఁ గట్టి యాతనిని దనముఖమునకు సరిగా రెండుచేతులతోడ నెత్తి పట్టుకొని దేవేంద్రుని లక్ష్యమున కడ్డముగా నుంచెను. శ్రీశచంద్రుఁ డప్పుడు జీవములతోడనే యుండుటవలన నాపట్టునుండి తప్పించుకొనుటకై కొట్టుకొనుచుండెను. ఆకార్యము ప్రకృతమున సాగకపోవుటచే నాతఁడు జుమలకు డాలుపోలిక నుండి యామెకార్యమును నిర్వహించుటకే యుపయోగపడవలసి వచ్చెను.

అది పగ లైనయెడల దేవేంద్రుఁ డీసరికే పిస్తోలు కాల్చి వైచి యుండును. అప్పుడు గాఢాంధకారపూరితమైన రాత్రి ఎంత బుద్ధిమంతుఁడైనను గుఱితప్పి పోయినయెడల శ్రీశచంద్రునకు గుండుదెబ్బ తగులఁ గలదను భయముచే పిస్తోలు గాల్చుటకు సాహసింపలేకపోయెను.

అప్పుడు దేవేంద్రుఁడు తనలో "ఈ జుమల కేవలము సాధారణయువతి కాదు. ఢాకినికిఁ గలశక్తికంటెను నీమెకు విశేష సామర్థ్యము కలదు. నేను చేసినప్రయత్నము లన్నియు నీమె యెడల నిరర్థకములై పోయినవి" అని యనుకొనియెను.

శ్రీశచంద్రుఁ డానావలో నామెచేతులలో నుండి "అయ్యో! పిస్తోలు కాల్పవలయును. గుండు విడువుఁడు!" అని కేకలు వైచుచుండెను.

శ్రీశచంద్రుఁడు కేకలు వైచి ముగించునప్పటికి జుమల యాతనిని మఱింతమీఁది కెత్తి యాగంగా ప్రవాహమునఁ బది మూరలదూరము వఱకు విసరి పాఱవైచి తా నాదోనెయం దొక మూల నగపడకుండ దాఁగికొనియెను. ఆదోనెయుఁ బ్రవాహ వేగమునఁ గొట్టుకొని పోవుచుండెను.

దేవేంద్రునకు జమలను వెంటనే పట్టుకొనుట కవకాశము లేకపోయెను. అతఁడు ముందుగా శ్రీశచంద్రు నెట్లయినఁ బ్రది కింపవలయు ననుద్దేశముతో గంగానదిలో దుమికి యీఁదు కొని పోవుచుండెను.

## ౧౦

దేవేంద్రుఁ డతికష్టముతో శ్రీశచంద్రుని తీరమునకుఁ దీసికొని వచ్చెను.

అంతలోపలనే యాఁదోనె కన్నులకగపడకుండ కొట్టుకొని పోయెను. దానికిఁ గట్టియున్న తెరచాఁప గాలిచేఁ గొట్టుకొనుచు బుసకొట్టుచున్న శబ్దముమాత్ర మేదోజంతువు దూరమునందుండి యూపిరివిడుచుచున్నట్లు వినవచ్చుచుండెను.

జమల ప్రస్తుతము తప్పించుకొని పాఱిపోయినది. దేవేంద్రుఁడు శ్రీశచంద్రు నొడ్డునకుఁ దీసికొనివచ్చి యనుకూలములగు నుపచారములు సేయఁగా నాతనికిఁ గొంతసేపటికిఁ దెలివివచ్చెను. అప్పుడు దేవేంద్రుఁ డాతని జూచి "ఏమి జరిగినది?" అని యడిగెను.

శ్రీశ : నేను వెనుకముందుఁ జూచుకొనుచు నీడొంకలను దాఁటివచ్చుచుంటిని. జమల యీడొంకలలో నెచ్చట దాఁగి యున్నదో కాని యప్పుడు నావెనుకప్రక్కనుండి వచ్చి నాతలపై బలమైన దెబ్బ కొట్టినది. కన్నులు తిరిగిపోయి చీఁకటులు గ్రమ్ముటచే క్రిందఁ బడిపోయితిని. తరువాత జమల నాకాలుసేతులను గట్టి నావయందుఁ బడవైచినది. అబ్బా! ఆయువతి మిగులఁ జొరవకలది.

దేవేం : ఔను. శ్రీశా! ఆమెకును నీకు నెంతయంతర మున్నది! నీవు బాలుఁడవు. ఒక్కొకప్పు డామె నన్నే యదలించు చుండును. ఆమెనుబట్టి చూడఁగా స్త్రీలకు బుద్ధియు, సామర్థ్య

మును సాహసమును నెంతవఱ కుండవచ్చునో యను విషయ మునుగూర్చి యూహించుటకు శక్తి చాలనివాఁడ నైతిని.

దేవేంద్రుఁడు హతాశుఁడై శ్రీశచంద్రునిఁ దనవెంటఁ బెట్టుకొని యానందకుటీరమునకు బయలుదేరిపోయెను. అచ్చట నాతని యానతి ననుసరించి నచీందుక్రఁడు రేవతిని మనోరమను కాచికొని యుండెను.

పురాతన మైన యా యానందకుటీరవిషయమై క్రొత్త సంగతులు జుమలకంటె మనోరమకే హెచ్చుగఁ దెలిసియుండెను. జుమల పాఱిపోయిన నేలమాళిగయం దున్న ద్వారమునుగూర్చి మనోరమయు నెఱిఁగియే యుండెను. ఆసంగతి యానందకుటీరము నందలి వారల కెల్లరకును దెలిసినదే. కాని యది యెందులకు నిర్మింపఁబడినదో యెవ్వరు నెఱుఁగరు.

మనోరమ యానేలమాళిగయందలిద్వారము ప్రయోజనము లేకుండుటచే మూయించివైచెను. కాని జుమలమాత్రము దాని యుపయోగమును కనుపెట్టి దానిని మరలఁ దీయించెను.

మనోరమసాహాయ్యమున నామం దిర మంతయును వెదకి యొకగూఢమందిరమున దేవేంద్రుఁడు సుబ్బును చూచెను. ఆహారము లేకుండుటచే నాతనిశరీరము జీర్ణమై యాతనిమొగము నల్లవడియుండెను.

దేవేంద్రునికార్య మింకను ముగియ లేదు. జెమల అనే కాలంకారములను, ద్రవ్యమును నెత్తుకొనిపోయినది. ఆమె నిప్పుడు నిర్బంధించి పట్టుకొనుట యత్యావశ్యకము.

తెల్లవారినతోడనే దేవేంద్రుఁ డెల్లరను తీసికొని తన యింటఁ బ్రవేశించెను. ఆనందకుటీరమునుండి వచ్చునప్పు డినుప పెట్టెయందున్న "17 క." అనుగుఱుతు గల కాగితపుగట్టను తీసికొని వచ్చెను.

౧౧

మఱునాఁడు దేవేంద్రవిజయుఁడు దర్శనగృహమునందు యోజ నాక్రాంతహృదయుఁడై కూర్చుండి యుండెను. ఆసమయమునం దచ్చటికి శచీంద్రుఁడుకూడ వచ్చెను.

దేవేం : శచీంద్రా! ఆపిశాచకాంత నాకుఁ బ్రతికూలిని యై నన్నెదిరించి వచ్చుటకుఁ బ్రవృత్తయై యున్నది.

ఇట్లు చెప్పి దేవేంద్రుఁడు శచీంద్రునివంకఁ జూచుచుండెను.

శచీం : మరల నేమి వచ్చినది ?

దేవేం : ఇదిగో చూడుము !

అని చెప్పి దేవేంద్రుఁ డుత్తరము నాతనిముందుఁ బాఱ వైచెను.

ఆయుత్తరము పైభాగమునందుఁ బెద్దపెద్దయక్షరములతో నిట్లుండెను :

" ఈప్రపంచమున జమల, దేవేంద్రవిజయుఁడు నీఁరిద్దరిలో నెవ్వరో యొకరుండఁగూడదు. " తరువాత:

" దేవేంద్రవిజయా ! "

" ఈయుత్తరమునకుఁ పైభాగమున 'మొదట ప్రపంచకమునందు జమల యుండఁగూడ దని' వ్రాసియుంటిని. కాని యాయర్థము నిష్ప్రయోజన మైనది. 'దేవేంద్రవిజయుఁ డీప్రపంచమున నుండఁగూడదు' అనుమాటయే నిజ మైనది. దేవేంద్రుఁ డీజగమున నిశ్చయముగా నుండఁగూడదు. నేను నిన్నుఁ జంపివైచెదను !

" నిన్ను నేను చంపివేయుటయేమో నిశ్చయము. కాని యది యంత త్వరలోఁ గాఁబోదు. నీ వెవ్వతెను విశేషముగఁ బ్రేమించుచుంటివో యామెను మొట్టమొదట సంహరించెదను.

అప్పుడు నీహృదయము పగిలిపోవును. అప్పుడే నాయభీష్టము నెఱవేఱఁగలదు. ప్రప్రథమమున నీభార్యను పట్టుకొనవలయు నని సంకల్పించుకొనియుంటిని.

"బోధపడినదా ?

"బోధపడకున్నచో వెంటనే బోధపడఁగలదు.

"నేను లేనిపోని వట్టిమాటలచే నీకు భయము కలిగించుట లేదు. నే నట్టిదాననే యని నీ వూహించుకొన వలదు. జమల ప్రతిజ్ఞ నెట్లు నెఱవేర్చుకొనఁగలదో నీవును బాగుగ నెఱుఁగుదువు.

"నేనూరక విడిచిపెట్టుదానను కా నని యిప్పటినుండి తెలిసికొనుము. ని న్నతిభయంకర మైనయవస్థకుఁ దెచ్చి యతికష్టములపాలుచేసి యప్పుడు విడిచెదను. నీవంటివారు నూర్గురుపత్తేదారుల నొకసారిగాఁ బట్టుకొని సంతకుఁ దీసికొనిపోయి యమ్మివైచెదను. నాకట్టిసామర్థ్యమున్నది. ముఖ్యముగాఁ జెప్పవలసినదేమనగా: నేను నిన్ను లక్ష్యము సేయుదానను గాను. ఎందులకు లక్ష్యము చేయవలయును ? జమల సాధారణురాలు కాదు. ఆమె ని న్నేడుసముద్రములనీరును త్రావింపఁగలదు.

"నీవు నాకు రాఁదగిన మహైశ్వర్యమును బోఁగొట్టితివి. కొంచెముద్రవ్యము మాత్రము మిగిలియున్నది. అది యుండనిమ్ము! దానిని మీదంపతుల యుత్తరక్రియామహోత్సవముల కొఱకు వెచ్చపెట్టెదను. నీవు మనోరమను నాసింహాసనమునఁ గూరుచుండఁజేసితివి. దానికిఁ దగినఫల మనుభవించెదవు గాక !

"నీముగ్గురు శత్రువులను చంపివైచితిని. అప్పుడు నీ వేమియు నభ్యంతరము కలిగింప లేదు. నే నీదినమున నెట్టి వ్రతము నూని కంకణము కట్టుకొనియుంటినో యావ్రతోద్యాపనముకొఱకు వారు నాకు సహకారు లగుదు రనునుద్దేశము తోడనే నీవు వారిచావున కెంతమాత్రము నడ్డుపడ లేదు. నీవు

చతురుడఁవే యగుదువు. నావ్రత మేమియో యెఱుఁగుదువా? అది మహావ్రతము: నిన్నువధియించుట——దేవేంద్రవిజయునివధ!

“మొట్టమొదట నిన్నుఁ జూచి యసహ్యముచే నేను తిరస్కరించుచుంటిని. ఇప్పుడు నీపనులను చూచి మునుపటికంటెను విశేషముగఁ దిరస్కరించుచున్నదానను.

“మొట్టమొదట నేను ధనముకొఱకుఁ బ్రాణములపై నాశ వదలుకొంటిని. ఇప్పుడో కొందఱను చితులపై నెక్కింపవలయు నను నుద్దేశముతో నాకార్యమును నిర్వహించుకొఱకుఁ బ్రాణములపై నాశను వదలుకొనుచుంటిని.

“ప్రాణములపై నాశ! ఎవ్వరిప్రాణములో బోధపడినదా? జుమలప్రాణములు! ఈసంకల్పము వ్యర్థము కాఁబోదు! ఎన్నటికిని వ్యర్థము కాఁబోదు!

“చితులు! ఎన్నిచితులో! ఎవ్వరిదో బోధపడినదా? ఒకటి నీప్రియతమ రేవతిచితి, మఱియొకటి నీచెల్లెలికుమారుఁడు శచీంద్రునిచితి, ఇంకొకటి నీచితి. మూడు. ముఖ్యముగా మూడు కాచికొనుము! జాగరూకుఁడవై కాచికొనుచుండుము!

“నాప్రతిజ్ఞ నెఱవేర్చుకొనుట కనేకోపాయము లున్నవి. నన్ను వెదకి పట్టుకొనవలయు నని వృథాశ్రమ మేల పడియెదవు? నేను నీకు దొరకుదాననుగాను. నన్ను నీవు వెంబడించి వచ్చిన యెడల నాకుఁ దెలియకుండఁ బోదు. అందులకు బదులుగా నీభార్యను కాచుకొనుచుండుము. ఆమెసంరక్షణమునకు మఱి కొందఱుకావలివాండ్ర నుంచుము! ఈ సారి మొట్టమొదట నామెను పట్టుకొనియెదను. జాగరూకుఁడవై యుండుము!

“నీవు నాచేతులలోఁ బడినప్పుడు ని న్నేమిచేసెదనో యెఱుఁగుదువా? ముప్పతిప్పలఁ బెట్టకుండ విడువను. నీగ్రుడ్లు పీకివైచెదను. నీరెండుచెవులను కత్తిరించెదను. ఒడలినిండ గాయములు చేసి కారము పూసెదను. ముఖ్యవిషయ మేమ

నఁగా—ఎల్లయమయాతనల ననుభవింపఁ జేసెదను. నీ పట్లు బాధపడుచుఁ గ్రమక్రమముగాఁ జచ్చిపోయెదవు. ఇట్లు సంపూర్ణముగఁ బ్రతిన నెఱవేర్చుకొన్నప్పుడే నాపేరు శ్రీమతి జమల యని చెప్పవచ్చును.

"ఇది యంతయును కేవలము కల్పన యనియు, వృథా ప్రలాప మనియు ననుకొనవలదు. నిజముగా జరగితీరఁగలదు. సంకల్పించినవారెవ్వరో యెఱుఁగుదువా? జాగ్రత!

నేను—జమల"

ఆయుత్తరమును చదివి శచీంద్రుఁడు "అట్లే యగునా?" అనియెను.

దేవేం: ఆయుత్తరమును చదివి యేమి యూహించితివి?

శచీం: నా కంత బాగుగ నున్నట్లు తోఁచుట లేదు.

దేవేం: నా కంతయును బాగుగా నున్నట్లే తోఁచుచున్నది. శచీంద్రా! ఈసారి జమలను పట్టుకొని చెఱయందుఁ బెట్టించితీరెదను.

శచీం: చేయుట కష్టము గాని చెప్పుట యెంతయును సులభమే.

దేవేం: ఈసారి యామె నిశ్చయముగఁ బట్టువడిపోవును.

శచీం: ఈమాటలకు నాకు మిగుల నవ్వు వచ్చుచున్నది.

దేవేం: జమల మిగులఁ జతురమతియే యగును. ఆమె బుద్ధియు సామర్థ్యమును చమత్కారమైనవే! నేనుచేయు ప్రయత్నముల నన్నిటిని విఫలములుగఁ జేయుటకై పనిచేసినది. ఈసారిమాత్రము నాప్రయత్నములయెదుట నామె యడ్డంది యెంతమాత్రమును బనిచేయఁ జాలదు.

శచీం: కావచ్చును.

దేవేం: ఈయుత్తరమును చదివినతరువాత నీ కేట్టియను మానమైనఁ గలిగినదా?

శచీం : మఱియేమియు ననుమానము కలుగలేదు.

దేవేం : నా కొకయూహ తోఁచుచున్నది.

శచీం : ఏమది?

దేవేం : ఆమె మన కతిసమీపముననే యుండును. ఈగ్రామమునందే యున్న దేమో యని తోఁచుచున్నది.

శచీం : మీకట్టియనుమానము కలుగుచున్నదా?

దేవేం : ఔను. నామనస్సున కట్లే తోఁచుచున్నది.

శచీం : అయినచో నిప్పు డేమి చేయవలయును?

దేవేం : వెదకవలయును.

శచీం : ఇప్పుడేనా? నే నందులకు సిద్ధముగనే యున్నాను.

దేవేం : నీవు మాఱువేషము వేసికొని యొకదిక్కునకుఁ బొమ్ము. నేను మఱియొకచోటునకుఁ బోయెదను. ఊరక తిరిగి నంతమాత్రమునఁ బ్రయోజనము లేదు. ఆమెకూడ వేషాంతరమును ధరించియే తిరుగుచుండును. ముసలివేషముననో కాక——

శచీం : ముసలివానిపోలికనా? అది యెట్లు?

దేవేం : శచీంద్రా! బాగుగఁ జెప్పితివి. ఆమెపురుష వేషమునుకూడ వేయఁగలదు. అందుల కింత యాశ్చర్యపడ నేల? నలుదిక్కులను తిరిగి జాగరూకతతోఁ జూచుకొనుచుండవలయును పొమ్ము. నీ కిష్టము వచ్చిన వేషమును వేసికొనుము. నీవు బాలుగంజివైపునకుఁ బొమ్ము. నేను వకుళబాగుదిక్కుగాఁ బోయి గంగాసేతువు వఱకును చూచెదను.

శచీంద్రుఁడు లోపలకుఁ బోయి యువకునివేషమును ధరియించి వెలుపలకు వచ్చెను. తలపై నాల్బర్టుకుళ్ళాయి, చేతియందు బెత్తము, నోటఁ బొగచుట్ట, చేతివ్రేలియందు వజ్రపుటుంగరము, కోటుబొత్తములకడ గడియారపుగొలుసు, మల్లుపంచె, ఒడ లంతటను నత్తరుపరిమళము——ఈరీతిగా నాతనివేషమమరియుండెను.

౧౨

తరువాత దేవేంద్రుఁడు తోఁటమాలివేషము ధరియించి బయలుదేరెను. ఆతఁడు మొట్టమొదట పడమటిభాగ దిక్కుగాఁ బోయెను. అక్కడనుండి గంగాసేతువువఱకును పోయి యం దేమియును విశేష మగపడకుండుటచే నామార్గమును వదలి దక్షిణపుదిక్కుగా మరలి యటనుండి చతుష్పథమునకు వచ్చెను. అట నొకబండి హజారబాగుమార్గమునుబట్టి పోవుచుండెను. దేవేంద్రుఁ డాబండివెనుకభాగమునఁ గూర్చుండెను. ఆతఁ డప్పుడు ధరియించిన వేషమునుబట్టి యాతఁడు చేసిన పని యంత లజ్జాకరముగ లేకపోయెను.

ఆబండి హజారబాగువీథి తుదివఱకును పోయి యట నుండి మందమందముగా నడచుచుండెను. అప్పుడు దేవేంద్రుఁ డాబండి గమ్యస్థానమునకు వచ్చిన దని తెలిసికొని క్రిందికి దిగెను. ఆశకటము మెల్లమెల్లగాఁ బోవుచుండెను. తుద కొక తోఁటలోనికిఁ బోయి యట నొక యింటిముంగిట నాబండి యాఁగెను. అందుఁ గూర్చున్న యువకుఁ డచ్చటనే దిగియెను. ఆతఁడు ధరియించినయుడుపు లన్నియును మనోజ్ఞములు. అప్పు డాతఁడొకటిరెండుసారు లటునిటు చూచి తరువాత లోపలికిఁ బోయెను. ఉన్నతవంశమున జనియించిన తరుణవయస్కులు ధరియించెడువస్త్రములంబోలి యాతనియుడుపులు నిర్మలములై యుండెను. ఆతని వయసు పందొమ్మిదేం డ్లుండవచ్చును.

౧౩

దేవేంద్రుఁ డిఁక నాదిక్కునకుఁ బోవక వెనుకకుఁ దిరిగి యచ్చటఁ జిల్లరసరకుల యంగడియొద్దకుఁ బోయెను. ఆ యంగడివాఁడు

రామాయణకథను రాగయుక్తముగా నిట్లు చదువుచుండెను:

"నింగికి నొఱసెడు నెలతామేడలు
రంగుల నీనెడు రతనపుగోడలు
ఘనత మెలంగెడు గజఘోటంబులుఁ
బనుపడు రత్నాపణవాటంబులు
నరిదుర్భేద్యములై తగుకోటలు
బరిమళములఁ జొప్పడుపూఁదోఁటలు
సమవిపులములై చనుమార్గంబులు
బ్రమదాంచద్ఘనభటవర్గంబులు
వెలయఁ గనులఁ దన్పెడుసాకేతము
చెలువమ్మల గని శ్రీసంకేతము
నతినిర్మల సుగుణాలంకారుఁడు
నతిమానుషసముదారాకారుఁడు
నతిశాంతుఁడు సత్యవ్రతశీలుఁడు
ప్రతిభానిధి దశరథభూపాలుఁడు
మనుబోధిత ధర్మము చెడకుండఁగ
దనపూర్వులవృత్తము విడకుండఁగ
ననయమ్ముగ బుధజనవిహితమ్ముగఁ
బరిపాలించుచుఁ బటువై భవమున
నరయుచునుండె మహాప్రాభవమున—"

ఇట్లు పాడుచు నాయంగడివాఁడు దేవేంద్రవిజయునిం జూచి "అన్నా! నీ కేమి కావలయును?" అని యడిగెను.

వేషధారి దేవేంద్రుఁడు "అయ్యా! దాహ మగుచున్నది. డబ్బు యేలకిపండ్లు నిమ్ము" అనియెను.

ఆయంగడివాఁడు దేవేంద్రుఁ డడిగినరీతి నాతని కేలకిపండ్ల నిచ్చెను. దేవేంద్రుఁడు వాని నందుకొని పోయి యా యంగడి చౌకమునందు గూరుచుండెను. అంగడివాఁడు తనకుమారుఁడగు

భజహరిని పేరు పెట్టి పిలిచి చెంబెడు మంచినీరు తెమ్మని కేక వైచెను. అప్పుడు లోపల నున్న కాంత "భజహరి మఠమునకుఁ బోయియున్నాఁడు" అని ప్రత్యుత్తర మిచ్చెను.

ఇఁకఁ జేయవలసిన దే మున్నది? స్వయముగా నా యంగడివాఁడే యటనుండి లేచిపోయి నీరు తెచ్చి దేవేంద్రున కిచ్చెను. కొంతసే పైనతరువాత దేవేంద్రుఁ డాయంగడివానిని "ఇచ్చట పూవులతోఁట యున్నదా?" అని యడిగెను.

అంగడివాఁడు బొమలు ముడివైచి యాలోచించి "పూవులతోఁటయా? ఇక్కడ లేదు" అనియెను.

దేవేంద్రుఁడు తాను వెనుక నెక్కివచ్చినబండిపై వచ్చిన యువకుఁడు దిగిన యాపూఁదోఁటను చూపించుచు "ఆపూఁదోఁట యెవ్వరిది?" అని యడిగెను.

అంగ: ఎవ్వరో సాహేబుతోఁట.

దేవేం: ఆయనపే రెవ్వరు?

అంగ: నాకుఁ దెలియదు. ఎందులకు?

దేవేం: అయ్యా! నేను తోఁటలను పెంచఁగలను. పూల మొక్కలను, ఫలవృక్షములయంటులను విక్రయించుచుందును. ఎవ్వరో పెద్దమనుష్యుఁడు నా కగపడి స న్నాతనితోఁటకు రావలయు ననియుఁ దనకుఁ గొన్నియంట్లును, పూవులమొక్కలును కావలయు ననియుఁ జెప్పియున్నాఁడు. అందుకొఱకే నే నిక్కడకు వచ్చియుంటిని. ఆయన తనతోఁట గుఱుతులను చెప్పియున్నాఁడు. వానిని బట్టి చూడఁగా నది యీతోఁట యనియే తోఁచుచున్నది. తోఁటయజమానుని మీ రెప్పుడైనఁ జూచితిరా?

అంగ: చూచితిని. పేరుమాత్రము నాకుఁ దెలియదు. ఆతఁడు ముసల్మాను. బంగాళావారిపోలిక నుడుపులను ధరియించుచుండును. చాల నందమైనవాఁడు, ఎఱ్ఱని మైచాయగలవాఁడు, చిన్నవయస్సు,

దేవేం: నిజమే. ఆతఁడే నాతో మాటలాడినాఁడు. ఆయన యిక్కడనే యుండునా?

అంగ: అప్పుడప్పు డిచ్చటకు వచ్చుచుండును. ఆతఁడు వచ్చినప్పుడు చాల గందరగోళముగా నుండును. ఇరువురు ముగ్గురు వెలయాండ్రను గూడ నాతఁడు తనతోఁ దీసికొనివచ్చి నృత్య గీతాదులచే నానందించుచుండును. ఆ కారణమునఁ దరుణ వయస్కు లగు కొందఱు పురుషులుకూడ వచ్చుచుందురు. అంతయు నైనవెనుక నారాత్రియే వారందఱును బయలుదేరి పోవుచుందురు. ఆనుఱునాఁడు మాధవదాసి నాయంగడికి వచ్చి విదేశసారాయముల నుపయోగింపఁగా వెలితియై పోయినసీసాలను నాకు విక్రయించి డబ్బు తీసికొనిపోవుచుండును.

దేవేం: మాధవదాసి యెవ్వరు?

అంగ: తోఁటను గాపాడుచుండునది. ఆమెతోఁటయందే కాపురముండి యీతోఁటను, నిందలి మందిరమును చూచుకొను చుండును. ఆమె మనదేశపు యువతియే.

దేవేం: ఆమెపేరు మాధవదాసియా?

అంగ: ఔను.

దేవేం: ఆమెకుమార్తె యెచ్చట నున్నది?

అంగ: వారి యూరిలో.

దేవేం: వారియూ రేది?

అంగ: మేదినీపురము.

దేవేంద్రుఁ డాయంగడివాని కీయవలసినద్రవ్యము నిచ్చి యటనుండి బయలుదేరి తోఁటవైపునకుఁ బోయెను.

౧౪

దేవేంద్రుఁడు తోఁటగుమ్మమును దాఁటి లోపలకుఁ బోయెను. అట నెడమవైపున నాకుటి ల్లుండెను.

అందు ముసలిది వంట చేసికొనుచుండెను,

దేవేంద్రుఁడు తిన్నగా నావంటయింటిలోనికిఁ బోయి "ఏమి యవ్వా! ఏమి చేయుచున్నావు?" అనియెను.

ముస : (ఆశ్చర్యముతో) మీా రెవ్వరు నాయనా? మీా రెవ్వరు?

దేవేం : నేను మధుసూదనుఁడను.

ముస : ఎవరు! మధుసూదనుఁడా? నేనిదివఱ కెన్నఁడును చూచియుండ లేదు.

దేవేం : నీకు జ్ఞప్తి లేదా?

ముస : నే నెప్పుడును చూడ లేదు. మధుసూదనుఁడా? జ్ఞప్తికి వచ్చుట లేదు.

దేవేం : ఒకయూరఁ బుట్టి యొకయూరఁ బెరిగియున్నను, సీమలు గాని సీమల నున్నప్పు డొకరినొక రెట్లానవాలు పట్ట గలరు? ఇప్పుడైన జ్ఞప్తికి వచ్చినదా? నావంకఁ జూడుము! ఏమి?

ముస : (విసివిసిగొనుచు) నా కెఱుక లేదు నాయనా! మధుసూదనుఁ డెవరు? నే నెఱుఁగను. నే నెప్పుడు నాతనిఁ జూచి యెఱుఁగను.

దేవేం : నీ కెంతటిమఱపే! పట్టణవాసముఁ జేయుటవలన వెనుకచూపు పోయినది కాఁబోలును! అవ్వా! మేదినీపురము మాట మఱచిపోతివా! పెద్దవారి కొలువు సేయుచున్న నీ కిట్టి మఱపు కలుగుట వింత గాదు. నీ కిప్పుడు మేదినీపురముతోఁ బని లేదు కాఁబోలును!

ముస: ఎట్లు పని లేకపోవును? నాయనా! నాబిడ్డ యచ్చట నున్నది కాదా? నాయల్లుఁడు కేశవదాసుఁ డక్కడనే కాదా యున్నాఁడు?

దేవేం : జ్ఞప్తి యున్నదా? ఆ కేశవుఁ డెవ్వఁడో యెఱుఁగుదువా?

ముస : ఏమి ?

దేవేం: ఆతఁడు మా మామగారి తమ్ముఁడు తోఁడియల్లుని బావమఱఁది.

ముస : అలాగా ! నీవా నాయనా ! నీవు దేవదాసుని కుమారుఁడవా ? కూరుచుండుము.

దేవేం : అవ్వా ! ఈతోఁట యెవ్వరిది ? చాలఁ బెద్ద తోఁటగా నున్నది ?

ముస : సాహెబులది.

దేవేం : అగుఁగాక ! కొంచెము లోపలకుఁ బోయి చూచి వచ్చెదను.

ఇట్లు చెప్పి దేవేంద్రుఁ డటనుండి కదలి తోఁటలోని రెండంతస్తులమేడయొద్దకుఁ బోయెను. ఆయింటిద్వారము తెఱచి యుండెను. అప్పుడు దేవేంద్రుఁడు నిరాఘాటముగ లోపలకుఁ బోయి క్రిందియంతస్తుపై కెక్కి యంతటను పరిశీలించి చూచెను. అట నున్నగదు లన్నియును మూసియున్నవి. తరువాత నాతఁడు రెండవయంతస్తుమీఁదికిఁ బోయెను. అచ్చటను తలుపు లన్నియు మూసియుండెను. అం దొకగదితలుపులు మాత్రము తెఱచి యుండెను. ఆతఁడు లోపలకుఁ బోయి చూడఁగా జమల పురుష వేషముతోఁ గూర్చుండియుండెను. ఆమెయే యిదివఱకు బండిపై నెక్కివచ్చిన యువక వేషధారిణి.

౧౫

జమల యాగదియందు మంచముపైఁ గూరుచుండి విసనకఱ్ఱతో విసరుకొనుచు హాయి ననుభవించుచుండెను. ఆకస్మికముగా నామె దేవేంద్రునిఁ జూచి యులికిపడి యతివేగముగ దనయుడుపులలో భద్రముగా నుంచిన యొక కాగితపుఁబొట్లమును దీసి నోట వైచి కొనియెను.

దేవేం : జుమలా ! చాల మంచిపని జరగినది. ఏమైనఁ గానిమ్ము ! పరమేశ్వరానుగ్రహమున నిన్ను వేగముగనే చూడఁ గలిగితిని.

జుమల యీ పొట్లమును దంతములతోఁ గొఱుకుచుఁ గిల కిల నవ్వ నారంభించెను. అప్పుడు దేవేంద్రున కాశ్చర్యము కలి గెను. ఆమె కొంచెమైనను సంకోచపడ లేదు.

దేవేం : జుమలా ! నీవు నోట వైచికొనిన యీ పొట్లము నం దేమి యున్నది ?

జుమ : విషము.

అని చెప్పి యాపొట్లమును ముత్యములవలె మెఱయు చున్న తనదంతములతోఁ బట్టుకొని విస్పష్టముగా " నీ వింకొక యడుగు ముందఱికి వైచినయెడల నీ పొట్లమంతయును నాగర్భమునఁ జేర గలదు" అని చెప్పెను.

దేవేం : అట్లే కానిమ్ము. అందువలన నష్ట మే మున్నది ? నేను నీతో సంధి చేసికొనవలయునని వచ్చియుండలేదు. నీవు బ్రదికియున్నను, మరణించినను, ని న్నిచ్చట నుండి వెంటబెట్టు కొనియే నేను బయలుదేరెదను.

జుమ : అయినచో నీకు నా మృతదేహము మాత్రమే దొరకఁగలదు.

దేవేం : తథాస్తు !

అని చెప్పి దేవేంద్రుఁడు యినుప సంకెలలనుదీసి యడుగు ముందఱికివైచెను. అంతలోనే యీ పొట్లమునందలి సగము భాగమువఱకు జుమల మ్రింగివైచెను. అప్పు డామె తూలుచుఁ గ్రిందఁబడిపోయెను. నోట మాట నిలిచిపోయెను. శరీరమునిష్పంద మయ్యెను. ఉచ్ఛ్వాసనిశ్వాసము లాగిపోయెను.

తరువాతఁ గొంతసేపటికి జుమల మరలఁ గన్నులఁ దెఱచి నెమ్మదిగా లేచి నిలువఁబడియెను. పిమ్మట నెప్పటిరీతి నవ్వి !

అప్పుడు దేవేంద్రుఁడు "ఏమి జుమలా ! విష మేమియును ప్రయోజనకారి కాలేదు కాఁబోలును ! " అనియెను.

జుమ : ఉపయోగపడవచ్చును.

దేవేం : ఎప్పుడు ?

జుమ : అయిదునిమిషములలో.

దేవేం : అయిదునిమిషములే ?

జుమ : అవును. దేవేంద్రా ! నీవంటివాని చేతులలోఁ జచ్చుట జుమలకుఁ గళంకము కాదా ? ఆ కళంక మెన్నటికైనఁ దీరునా ? జుమల యితరులను చంపుటకును దాను చచ్చుటకును గూడ సమర్థురాలే. ఒకదానికి దృష్టాంతమును చూచియే యుంటివి. మఱియొకదాని విషయమునఁ జూడవలసి యున్నది. ఇప్పుడుచూడఁగలవు.

దేవేం : చచ్చుటకు ముందుగా నీ వేమైనఁ జెప్పెదవా !

జుమ : చెప్పవలసియున్నది. నేను ఫూల్ సాహేబును పెండ్లి యాడిన యువతిని. ఆతఁడు యవనుఁడు. అందువలన నేను యవన కాంతను. నాకు గోరీ కట్టవలయును. అట్లు చేసినయెడల నీవు నాకు శత్రుఁడవై యుండియు మిత్రత్వమును నెఱపినవాఁడ వగుదువు.

దేవేం : అట్లే చేసెదను. జుమలా ! నీవెచ్చటఁ బుట్టితివి?

జుమ : కామరూపదేశమునందు. కామరూపదేశమునకుఁ బూర్వోత్తరమున నున్న కచ్చిమరాజ్యమున నేను జన్మించితిని. నేను మిస్మిజాతిదానను. మా జాతియందలి స్త్రీలవంటి సుందరు లీ ప్రపంచమున మఱి లేరు.

దేవేం : అవును. నేను నట్లే వినియుంటిని. జుమలా ! నీ వయసెంత ?

జుమ : నీ యీడున్నది.

దేవేం : ముప్పదియాఱేండ్లా ?

జుమ : ఔను.

దేవేం : నిజమే ?

జుమ : ఆశ్చర్య మెందులకు ?

దేవేం : నాకు నమ్మకము కలుగుటలేదు. నిన్నుఁజూడగా నిరువది యేండ్లకంటె హెచ్చువయసుండు నని యెవ్వఁడును చెప్పఁజాలఁడు. ఇప్పుడు నీవు సంపూర్ణయౌవనమున విరాజిల్లుచున్న దానవు.

జుమ : దేవేంద్రా ! ఇప్పుడు మీ దేశముననున్న కాంతల వలె మా దేశస్త్రీ లిరువదియేండ్లకే ముసలివాండ్రగుటలేదు. యౌవనమును నిలుపుకొనువిధానము మా దేశస్థులకు బాగుగఁ దెలియును. యౌవనము నొకవిధముగా మొదటఁ గాపాడుకొన్న యెడల నది చిరకాలమువఱకు మన స్వాధీనమునం దుండును. నీకు, పత్తేదారి వ్యాపారమును నేర్పిన యరిందమ ముఖోపాధ్యాయుఁ డేడు సంవత్సరముల క్రిందట ఫ్రూలుసాహేబును పట్టుకొన్నప్పుడు నే నెట్లుంటినో యిప్పుడు నట్లే యున్నాను. అప్పుడు నన్నుఁ జూచినవా రిప్పుడు చూచినను నా శరీరమునఁ గాలాను గుణమైన మార్పును కనుపెట్టఁజాలరు. ఈ దినమున నీవు నన్నుఁ జూచితివిగదా! ఇక నిరువదియేండ్లకుఁ జూచినను నే నిట్లే యుండెదను. ఈ బంగారుమేనిచాయయే, ఈసోగకంటిచూపే, ఈమధుర కంఠస్వరమే, ఈ మృదులమందహాసమే, ఈ శృంగార విలాసమే, ఈ మోహనరూపమే ఇట్లే యుండెదను. ఈ దేహ లతికయందలి లావణ్య మిట్లే యుండును. ఈ మోహనశరీరము చిగురుటాకువలె నిట్లే యౌవనమనోజ్ఞమై లావణ్యమయమై విలసిల్లుచుండును. అంతయు నిప్పటియట్లే యుండును.

దేవేం : ఇంతటి శక్తిమంతములగు మూలికలను నీవెచ్చట సంపాదించితివి ?

జుమ : నేనుఁ గొన్నిటి నెఱుంగుదును. తరువాత ఫ్రూలు సాహేబు నొద్దఁ గొన్నిటిని నేర్చికొంటిని.

దేవేం : నీ దేశము నేల వదలి వచ్చితివి ?

జుమ : ఎందులకా? ఆశపడి వచ్చితిని. ప్రణయమున ముగ్ధనై వచ్చితిని. నేను పదునాలేండ్ల యీడుగలదాననై యున్నప్పుడు ఫ్రూలుసాహే బౌషధసంగ్రహమునకై మా దేశమునకు వచ్చెను. వచ్చి యాతఁ డక్కడ ననేక మంత్ర తంత్రౌషధక్రమములను నేర్చికొనెను. అప్పు డాతఁడు డాక్టరు ఫ్రూలు సాహేబుగా నుండలేదు. ఫకీరు ఫ్రూలుసాహేబ్. ఆతడు ఫకీరు వేషముతోనే మా దేశమునకు వచ్చి పిమ్మట డాక్ట రయ్యెను. అందఱు డాక్టరులకంటె వాసిగాంచెను. ఇతర వైద్యులకు స్వాధీనముకాని రోగముల నన్నిటిని కుదిర్చెను. ఫ్రూలుసాహేబు మా దేశమునకు వచ్చునప్పటికి నేను పూర్ణయౌవనవతిని. దేవేంద్రా! అప్పుడు నీవు నన్నుఁ జూచినచో నిజముగా నీ కన్ను లా సౌందర్యప్రకాశమున మూతలు పడిపోవలనదే. నీ వెప్పటికిని నాకుఁ బగవాఁడవై యుండఁబోవు. అప్పుడు నాకాళ్ళమీఁదబడి "స్మరగరళఖండనం మమ శిరసి మండనం-దేహిపదపల్లవ ముదారం" అనుచు గంధరగోళ పడుచుందువు. అపుడు ఫ్రూలుసాహేబు దృష్టి నాపైఁ బడియెను. నా దృష్టుల కాతఁ డగపడియెను. మఱియొకడైనచో నాతఁడు గొఱ్ఱవలె వెంటాడింపవలసినదే. కాని ఫ్రూలుసాహేబు చాల ధైర్యస్థైర్యములు కలవాఁడు. ఆతని లోఁబఱచుకొనుమాట యటుండ నాతనికే నేను లోఁబడిపోతిని. దేవేంద్రా! ఆతని శౌర్యవీర్య పరాక్రమములు సామాన్యము లైనవి కావు. నాచేతిలోఁ జిక్కినవారు మరల వెను దిరుగుట లేదు. ఆ సంగతి నీవు వినియేయుందువు. మొదట నా పేరు ఫాన మోతి. ఫ్రూలుసాహేబును పెండ్లియాడిన పిమ్మట నాతఁడు

ప్రేమతో "ఫూలు బీబీ" యని నన్నుఁ బిలుచుచుండెడివాఁడు. ఒక్కొక్కసారి జుమల యని కూడఁ బిలుచుచుండెను.

దేవేం : ఫూలుసాహేబు చచ్చిపోయినపిమ్మట నీవు మరల బెండ్లి చేసికొంటివా !

జుమ : లేదు. తిరుగఁ బెండ్లిచేసికొనలేదు. కాని, యనేకులు నా కృపాకటాక్షములకుఁ బాత్రులై యుండిరి. ఇంకను ననేకులు నా కృపకుఁ బాత్రులుకావలయు నని యాశపడుచున్నారు. వారికి సంప్రాప్తముకాలేదు. మఱికొంద ఱీయాపాగ్నిలోఁ బతంగములవలెఁ బడి భస్మమై పోయియున్నారు. వారిలోఁ గొందఱిని నీవెఱుఁగుదువు. వారు గోవిందప్రసాద తులసీదాసనవీనచంద్రులు. ఈ మువ్వురు చచ్చిపోవుట నీ వెఱుంగుదువు. జ్ఞప్తి యున్నదా ? ఇంక ననేకులట్లే ప్రాణము లర్పించువారున్నారు. వారు చావనై యున్నారు.

దేవేం : నీవు చనిపోవుటకు ముందుగా నేమైనఁ జెప్ప వలసి యున్నదా ?

జుమ : మఱేమియుఁ జెప్పవలసినది లేదు.

దేవేం : ఇంకేమియును లేదా ?

జుమ : అవును, ఉన్నది. విశేషముగా నున్నది.

దేవేం : ఏమి ? చెప్పుము.

జుమ : ఇప్పుడు నేను చచ్చిపోవుచునే యున్నాను.

దేవేం : ఔను.

జుమ : బ్రదికియున్నప్పుడు నిన్నును నీ వారలను దిరస్కరించుచు వెన్నంటి తిరుగుచుంటిని గాదా !

దేవేం : ఆ విషయమున నేమైన సందేహ మున్నదా ?

జుమ : చచ్చి యేమిచేసెదనో చెప్పుకొనుము. అప్పుడు మిమ్ములను వెన్నాడించెదను.

దేవేం : నిజమేనా ?

జుమ : నిజమే.

దేవేం : భూతప్రేతాదు లున్న వన్నమాట నమ్మవు. ఆ నమ్మిక నేనే నీకుఁ గలిగించితిని.

జుమ : నీవే ! అదెట్లు ?

దేవేం : నే నా నవీనచంద్రుని ప్రేతాత్మ నైతిని.

జుమ : నీవా ?

దేవేం : నేనే.

జుమ : దేవేంద్రా ! అది నిజమే ?

దేవేం : అవును; నిజమే.

జుమ : అయినచో నేను జూచినది నవీనచంద్రుని ప్రేతాత్మకాదా ?

దేవేం : కాదు. నన్నే నవీనప్రేతాత్మ వేషముతోఁ జూచితివి.

జుమ : అ దెట్లు ? నేనుకాల్చిన పిస్తోలుగుండ్లు వ్యర్థములై పోయిన వేమి ?

అప్పుడు జరిగినవృత్తాంత మంతయు దేవేంద్రుఁ డామెకు సవిస్తరముగాఁ దెలియఁజెప్పెను. ఆమాటలువిని జుమల "నీవు నాయందుఁ జాల ననుగ్రహించితివి" అనియెను.

దేవేం : ఎట్లు ?

జుమ : నిజముగా నవీనుని ప్రేతాత్మ యని నేను నమ్మి యున్నాను.

దేవేం : నీవు మోసపోయితివి.

జుమ : నేను మోసపోయితిని. కాని, నీవు మోసపోకుండుము. నేను చచ్చినను నిన్ను విడిచిపెట్టనులే.

దేవేం : నీచేఁత నైనచో నట్లేచేయుము.

జుమ : చేఁత గా కేమి? నిన్నుఁ బట్టుకొనియెదను.

దేవేం : ప్రయత్నముచేసి చూడుము !

జుమ : విను, మఱియొకమాట యున్నది.

దేవేం : చెప్పుము, వినుచున్నాను.

జుమ : నేను బ్రదికియేయున్నయెడల నిన్నుఁ జెఱసాలఁ బెట్టఁగలిగియుందును.

దేవేం : కావచ్చును. నీవట్లే చేయఁగలవు. అయిన నేమి?

జుమ : నాయుత్తరమున నున్న దంతయు తొక్కటొక్కటిగ నెఱవేర్చుచుందును.

దేవేం : అట్లును గావచ్చును.

జుమ : చచ్చినను నాసంకల్పము లన్నియు నెఱవేర్చెదను. అట్లు చేయనిచో నాపేరు జుమల కాదు.

దేవేం : మంచిది. నెఱవేర్పవచ్చును.

జుమ : నేఱవేర్పకుండ మానుదునా ? నాసంకల్ప మెప్పుడును వ్యర్థము కాదు.

దేవేం : మంచిదే. నీప్రేతాత్మ కెదురుగా నిలుచుండుటకు సిద్ధముగా నున్నాఁడను.

జుమ : నీవు వెంటనే నాప్రేతాత్మను జూచెదవు.

దేవేం : ఎక్కడ ? జుమలా! (గడియారమును జూచి) అప్పుడే నాలుగునిమిషములు కావచ్చినది. నీమరణమును జూచుటకై యిష్టపడుచున్నాను.

జుమ : ఇంకను నిమిష మున్నది. ఒకనిమిషములోఁ జచ్చెదను. నేను చెప్పిన దంతయు జ్ఞప్తియం దుంచుకొనుము.

దేవేం : అట్లే.

చూచుచుండఁగనే జుమల మొగ మెఱ్ఱఁబడిపోయెను. అప్పు డామెముఖమున నొకవిధ మైన కాంతి వచ్చెను. ఆమె మనోహర నేత్రములు మూతలు వడియెను. మరల నామె మన

కుగా నున్న చూపులతో దేవేంద్రుని ముఖమును జూచి గట్టిగా నవ్వెను. నవ్వుచు మూర్ఛ వచ్చినదానివలె నేలపైఁ బడిపోయెను. జుమలశరీరము నిష్పందమై కొయ్యబడిపోయెను. క్రమముగాఁ జల్లబడిపోయెను. ముక్కులవెంట నుసురాడుట లేదు. కన్నులర్ధవిరళితము లయ్యెను. వానియందు దృష్టిశక్తి లేదు. ఫూలు సాహేబుసంబంధమైన వృత్తాంతములు దేవేంద్రుఁడు మఱచియుండని కారణమున నిప్పుడు జుమల నిజముగ చచ్చిపోయిన దని యాతఁడు నమ్మలేదు. జుమలదేహమును దీసికొని పోయి గోతిలో వైచి దానిపై మన్నువైచి కప్పవలయును దేవేంద్రుఁ డామె దేహమును జూచుచుఁ గంపించుచుండెను. జుమలగోరీ పూర్తియైన పిమ్మట నాతఁడు నిశ్చింతుఁ డయ్యెను.

" 17 క. " గుఱుతు గలకట్టయందు మనోరమ సంబంధమైన స్థావరజంగ మాత్మకమైన సొత్తునుగూర్చి యనేక ప్రమాణములు దొరకెను. దానిలో మనోరమ కుటుంబమునకు సంబంధించిన యితరులకుఁ దెలియని యంశము లెన్నియో యుండెను.

కుముదిని మనోరమకుఁ దెలియకుండ ననేకవిరుద్ధకార్యములను నడపెను. పిమ్మట నాకస్మికముగ నామెకును జుమలకును బరిచయము కలిగెను. వా రిద్దఱు నొకటై యీకపటకార్యము నందుఁ బ్రవృత్తులైరి. కుముదినికంటె జుమల చతురయు బుద్ధిమతియునై యుండెను. జుమల తనయభీష్టసిద్ధికొఱకుఁ గుముదిని చచ్చిపోయె నను బ్రవాదమును బుట్టించి, కాలాంతరమున, నావశ్యకమును బట్టి కుముదినిని బరిమార్చెను.

దేవేంద్రుఁడు మనోరమ యాస్తి నంతయు నుద్ధరించి యామె కొప్పగించెను.

ఆమె పెండ్లివిషయమున నాతఁ డంతగాఁ గలుగఁ జేసికొన లేదు గాని మనోరమా శచీంద్రుల పరస్పరానురాగమే

వారిని దంపతులనుగాఁ జేసివైచినందునఁ దనయభీప్సితము సిద్ధించుటచే దేవేంద్రుఁడు కన్యాదాతయై తనమేనల్లుఁ డగు శచీంద్రునకుఁ దనయాధిక యగుమనోరమను గన్యాదానము చేసి తన సర్వస్వమును గన్యాదానదక్షిణగా నొసంగి బ్రహ్మానందము నందెను. రేవతియుఁ బరమానందము నందెను. అదిమొదలుగ మనోరమాశచీంద్రుల కానందకుటీర మానందమందిర మయ్యెను.

మనోరమ కథ – సంపూర్ణము.